చందమామ

సంపుటి 110 మే 2004 సంచిక:5

## ఈ నెల విశేషాలు



భల్లూక మాంత్రికుడు-7 13



నాగదేవత (బే.క) 19



విష్ణు కథ-5 45



ఉత్తమ గురువు 51



## ఈ సంచికలో ...

★ పువ్వుపుట్టగానే ...7 ★ కేతిగాడి మందుల సంచి ...8 ★ బాధ ఒక్కటే! ...12 ★ భల్లూక మాంత్రికుడు-7 ...13 ★ నాగదేవత (బే.క) ...19 ★ భారత దర్శిని ...25 ★ మన పూర్వగాథలు : ఉత్తమ రాజలక్షణం! ...26 ★ యదార్థసేరపరిశోధన కథలు: వింత యాదృచ్ఛికాలు! ...29 ★ నాగాల్యాండ్ జానపద కథ : అత్తిమాను దయాగుణం - అపూర్వ కృతజ్ఞత! ...32 ★ చందమామ కబుర్లు ...35 ★ జీవితం అంటే ...36 ★ పట్టుదల! ...40 ★ కథల పోటీ ...41 ★ చిన్నశెట్టి శిష్యుడు (జా.క) ...42 ★ విష్ణు కథ-5 ...45 ★ వివిధ దేశాల కథలు: తోకముడిచిన పొట్టిదయ్యం! ...51 ★ ఉత్తమ గురువు...54 ★ గొప్పయింటి విందు ...57 ★ ఆర్య-11 ...59 ★ నీటిని పొదుపుచేద్దాం! ...63 ★ విజ్ఞానం ... వినోదం ... వికాసం ...64 ★ ఫోటో వ్యాఖ్యల పోటీ ...66

SUBSCRIPTION

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail :
subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.**120**లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# సమృద్ధి మధ్యే ఎద్దడి!

మే నెల వస్తే చాలు; దేశమంతా వేసవితాపంతో, తీరనిదాహంతో విలవిలలాడిపోతుంది. ఇంతకూ మనదేశంలో వర్షపాతం తక్కువా అంటే, అదేం కాదు.

జూన్ నెలలో దక్షిణ సముద్రతీరంలో ఆరంభమయ్యే నైరుతీ ఋతుపవనాలు జూలై, ఆగస్ట్ నెలల వరకు కొనసాగుతాయి. వాటివల్ల ఉత్తర, ఈశాన్య భారత దేశంలో ఎక్కువగా వర్షాలు కురుస్తాయి. ఆ తరవాత సెప్టెంబర్ నెలలో ఆరంభమయ్యే ఈశాన్య ఋతుపవనాలు నవంబర్ వరకు కొనసాగుతాయి. మనదేశంలో యేటా సగటున 2000 మి.మీ. వర్షపాతం నమోదవుతోంది.

ప్రకృతి ఉదారంగా ఇంత వర్షాన్ని ఇస్తోంది. జీవనదులు ప్రవహిస్తున్నాయి. ఇలాంటి సమృద్ధి మధ్యే ఎందుకీ నీటిఎద్దడి? వేసవి రాగానే నీటిబొట్టుకు ఎందుకీ కటకట?

అప్పుడప్పుడు ఋతుపవనాలు విఫలంకావడంతో ఈ సమస్య మరింత జటిలంగా తయారవుతోంది. దానికి తోడు మనలో పాతుకుపోయిన నిర్లక్ష్యం; ముందు జాగ్రత్తలు తీసుకోకపోవడం వల్ల జీవాధారమైన నీటికోసం - రాష్ట్రాల మధ్య, ప్రాంతాల మధ్య, జిల్లాల మధ్య, ఊళ్ళ మధ్య జలవివాదాలు, పొరపొచ్చాలు, పోరాటాలు పెచ్చరిల్లి హృదయవిదారకమైన పరిస్థితులు చోటుచేసుకుంటున్నాయి.

ఋతుపవనాల విషయంలో మనం చేయగలిగిందల్లా ఒక్కటే. పచ్చదనాన్ని, అడవులను పరిరక్షించుకుంటే సకాలంలో వర్షాలు కురుస్తాయని విజ్ఞానవేత్తలు చెబుతున్నారు. ఇక కురిసిన వర్షాన్ని పరిరక్షించుకోవడం మన చేతుల్లోనే ఉంది. ఈ దిశగా మనం చేయవలసింది చాలా వుంది.

మొట్టమొదటిది జలసంరక్షణ. అంటే, నీటిని వృధాచేయకూడదు. దుర్వినియోగం చేయకూడదు. రెండవది - మన అజ్ఞానం, ఉదాసీనత కారణంగా, నానాటికీ తగ్గిపోతున్న జలవనరులను అభివృద్ధి పరచుకోవాలి. చెరువులనూ, చెలమలనూ పూడిక తీసి, నీటి గుంటలు తవ్వి, కురిసే వర్షం వృధాకాకుండా, భూమిలోకి ఇంకేలా చేయాలి. మూడవది 'జలయాజమాన్యం'. అంటే, నీటిపొదుపు, మన అనుదిన జీవితంలో అంతర్భాగం కావాలి. జలకాలుష్యం జరగకుండా చూసుకోవడం, వంటగదిలో ఉపయోగించిన నీటిని మొక్కలకు పోయడం మొదలైన జాగ్రత్తలు తీసుకోవాలి. ఇందుకు క్రమశిక్షణ, శ్రద్ధ చాలా అవసరం. ఒక్కొక్క నీటి బొట్టూ చాలా అవసరం అన్న పరిస్థితి ఇప్పుడు నెలకొనివుంది. కాబట్టి, జల సంరక్షణ, నీటి పొదుపు పట్ల ప్రతి ఒక్కరూ చాలా శ్రద్ధగా మసలుకోవడం ఎంతైనా అవసరం.

సంపాదకుడు : విశ్వం







# చందమామ

## పాఠకులకు, శ్రేయోభిలాషులకు విజ్ఞప్తి

ప్రియమైన పాఠకులకు, శ్రేయోభిలాషులకు,

నమస్కారం. చందమామ పత్రిక వెల పెంచకుండా, అందరికీ అందు బాటులో వుండేలా చేయడానికి మేము ఎల్లప్పుడూ ప్రయత్నిస్తున్నాము. ఇక తప్పదనుకున్నప్పుడు మాత్రమే మా సమస్యను పాఠకులకూ, శ్రేయోభిలాషులకూ తెలియజేస్తూ వచ్చాము.

ఇటీవల కొన్ని సంవత్సరాలుగా పత్రికా ప్రచురణకు సంబంధించిన వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. వాటన్నిటినీ భరించాము. కాని హఠాత్తుగా పెరిగిన న్యూస్ ప్రింట్ కాగితం ధర కారణంగా పత్రిక వెల పెంచడం ఇప్పుడు తప్పనిసరి అయింది. జూలై 2004 నుంచి చందమామ విడిప్రతి వెల రూ. 12.00; సంవత్సర చందా 144-00 రూపాయలు.

పాఠకులూ, శ్రేయోభిలాషులూ పరిస్థితిని సహృదయంతో అర్థం చేసుకుని మాతో ఎప్పటిలాగే సహకరించగలరని ఆశిస్తున్నాము. మరిన్ని వైవిధ్యమైన అంశాలతో చందమామను మరింత ఆసక్తికరంగా, ఆకర్షణీయంగా తీర్చిదిద్దగలమని ఈ సందర్భంగా పాఠకులకు మనవి చేస్తున్నాము.

కృతజ్ఞతలతో,

బి. విశ్వనాథరెడ్డి
ప్రచురణకర్త

పువ్వు పుట్టగానే...

# భయమెరుగని యువకిశోరం!



అది 1921వ సంవత్సరం. మనదేశంలో స్వాతం త్ర్యోద్యమం ఉధృతంగా సాగుతూన్న రోజులు. స్వాతంత్ర్య యోధులు పలువురు జైళ్ళ పాల య్యారు. నిరసన ప్రదర్శనలు, ఊరేగింపులు దేశవ్యాప్తంగా రోజూ జరిగేవి. అలా జరుగుతూన్న ఒక ఊరేగింపును పోలీసులు అడ్డుకున్నారు. ఆ ఊరేగింపులో పదిహేనేళ్ళు నిండీ నిండని ఒక పసివాడు కూడా ఉన్నాడు. పోలీసులు వాణ్ణి ఖైదు చేసి న్యాయమూర్తి ఎదుట హాజరుపరచారు.

"నీ పేరేమిటి?" అని అడిగాడు న్యాయమూర్తి.

"ఆజాద్, (స్వేచ్ఛాజీవి)" అన్నాడు కుర్రవాడు.

"నీ తండ్రి పేరు?" అని అడిగాడు న్యాయమూర్తి.

"స్వతంత్రం!" అని బదులిచ్చాడు కుర్రవాడు ఏమాత్రం జంకూ కొంకూ కనబరచకుండా. కోపంతో చూసిన న్యాయమూర్తి, "నీ ఇల్లెక్కడ?" అని అడిగాడు.

"జైల్లో," అన్నాడు యువకుడు.

న్యాయమూర్తి ఆగ్రహం చెందాడు. మైనర్ కావడంవల్ల ఆ కుర్రవాణ్ణి జైలుకు పంపలేక పోయాడు. అందువల్ల పదిహేను కొరడాదెబ్బలు శిక్షగా విధించాడు. ఆరుబయట ఎర్రటి ఎండలో శిక్ష నెరవేర్చబడింది. తన మీద ఒక్కొక్క దెబ్బ పడుతూన్నప్పుడూ, "వందేమాతరం," అని నినాదం చేశాడా పసివాడు. ఒళ్ళంతా నెత్తురోడుతున్నప్పటికీ, అసామాన్యమైన గుండె నిబ్బరంతో దేశభక్తిని ఎలుగెత్తి చాటి చూపరుల హృదయాలను ద్రవింపచేశాడా కుర్రవాడు.

అసాధారణమైన ధైర్యాన్ని ప్రదర్శించిన చంద్రశేఖర్ అనే ఆ యువకిశోరమే ఈ సంఘటన తరవాత చంద్రశేఖర్ ఆజాద్ (1906 - 1931)గా సుప్రసిద్ధుడయ్యాడు. ఆయన గొప్ప విప్లవ వీరుడు; అకుంఠిత దేశభక్తుడు. 1931 ఫిబ్రవరి 27న ఆఖరిశ్వాస విడిచేవరకూ ఆయన బ్రిటిష్ అధికారాన్ని వ్యతిరేకించి నిర్విరామ పోరాటం సాగించాడు. అలహాబాద్‌లోని ఒక పార్కులో ఉన్నట్టు తెలియగానే బ్రిటిష్ పోలీసులు ఆయన్ను చుట్టుముట్టారు. సాయుధులైన పోలీసులను ఆయన ఒంటరిగా ఎదుర్కొని ఇరవై నిమిషాలు పోరాడి ఆత్మార్పణ చేశాడు. భరతమాత ఆరోజు తన వీరపుత్రులలో ఒకరిని కోల్పోయింది.



# కేతిగాడి మందుల సంచి

వాడపల్లి అనే గ్రామంలో, గోవిందరాజు అనే గాయకుడుండేవాడు. అతడు గ్రామంలోని వెంకటేశ్వరస్వామి కోవెలలో పర్వదినాలలో, తన భక్తి పాటలతో భక్తులకు వీనులవిందు చేసేవాడు. అతడి గానాన్ని విన్న జనం, "ఇంత చక్కగా పాడే గోవిందరాజుకు రాజాశ్రయం లభిస్తే, మన గ్రామానికే గొప్పపేరు తెస్తాడు!" అనేవారు.

కానీ, గోవిందరాజు మాత్రం ఎంతో వినయంగా, "అయ్యా, వేంకటేశ్వరునికి కింకరుడిలా వుండిపోవాలని, స్వామివారు భావిస్తే, నాకు రాజాశ్రయం ఎలా లభిస్తుంది? ఇక్కడే నాకు సుఖంగా జీవితం సాగిపోతున్నది. నాకు నేనై రాజాశ్రయాన్ని కోరను," అనేవాడు.

ఇలావుండగా, వాడపల్లి వెంకటేశ్వరస్వామి కళ్యాణ మహోత్సవం జరిగే రోజు వచ్చింది. ఆ సందర్భంగా, గ్రామంలో వీధి నాటకాలు, భజనలు, తోలుబొమ్మలాటలు మొదలైన వాటితో, రోజుకొక కార్యక్రమం పెట్టి, తొమ్మిది రోజులపాటు స్వామివారి కళ్యాణ ఉత్సవాలు ప్రారంభించారు. ఈ సందర్భంలో గోవింద రాజుకు, గడ్డిపాడు నుంచి వచ్చిన కేతిగాడి పగటి వేషంవేసే భూషణం అనేవాడితో పరిచయం అయింది.

ఈ కేతిగాడివేషం చాలా తమాషాగావుండేది. చేతిలో వంకరకర్ర పట్టుకుని, గొంగళి కప్పుకుని తిరిగేవాడు. తలమీద కాకి ఈకలకుచ్చు టోపీ పెట్టుకునేవాడు. వాడు హాస్యపు మాటలు మాట్లాడుతూ, ఎవరికీ అర్థంకాని వేదాంత విషయాలు కూడా చెప్పేవాడు. వాడి ముఖం మీదవున్న పసుపు, సున్నం బొట్లు చూసి అందరూ నవ్వేవారు.

భూషణం, గోవిందరాజుతో, "నీపాట చాలా అద్భుతంగావుంటుంది. నీ పాట విని జనం ఆనందించినట్టే, మాగడ్డిపాడు పగటివేషగాళ్ళ వేషాలు చూసి కూడా వాళ్ళు విరగబడి నవ్వుతారు. ఈ పగటి వేషాల ద్వారా డబ్బు సంపాదన కన్న కూడా, మా గ్రామానికి పేరు

డా. జొన్నలగడ్డ మార్కండేయులు

తేవడమే, మాకు ముఖ్యం. అందుకే ఇలా ఊరూరూ తిరుగుతూంటాం. నువ్వేమిటిలా మారుమూల గ్రామంలో పాటలు పాడుతూ వుండి పోయావు?'' అని అడిగాడు కళ్యాణో త్సవాలు ముగింపు రోజున.

అందుకు గోవిందరాజు, ''నాకు దేవుడిపై భక్తి పాటలు తప్ప మరేం రావు. సంగీత పరిజ్ఞానం కొంతవున్న మాట నిజమే అయినా, కృషి చేసింది మాత్రం తక్కువ. రాజాస్థానమంటే మాటలు కాదు. నావల్ల మా గ్రామానికి పేరు రావాలంటే, ఆ వేంకటేశ్వరుడి దయ కావాలి,'' అన్నాడు.

ఈ జవాబుకు, భూషణం నవ్వి, ''నోరు తెరుచుకుని కూర్చుంటే, సింహం నోట్లోకి జంతువులు రావు. నువ్వు, వీరభద్రపురం అంగాలమ్మతీర్థం గురించి వినేవుంటావు! అక్కడ తీర్థోత్సవాలు ఘనంగా నెలరోజులు సాగుతాయి. ఇక్కడికి రెండు క్రోసులకన్న, ఆ వీరభద్రపురం ఎక్కువ దూర ముండదు. అక్కడికి నేనివ్వాళే బయలుదేరి పోతున్నాను. నువ్వు కావాలంటే రెండురోజులాగి బయ ల్దేరిరా. ఆ తీర్థానికి జమీందారు కూడా వస్తాడు. ఆయన సమక్షంలో నీకు మంచి గాయకుడుగా గుర్తింపు వచ్చే అవకాశ ముంది!'' అన్నాడు బసచేసిన సత్రంగదిలో సామానులు సర్దుకుంటూ.

గోవిందరాజు ఏదో గుర్తు తెచ్చుకుంటున్న వాడిలా ఒకక్షణం ఆగి, ''ఆ అంగాలమ్మవారి గురించివిన్నాను. ఆమె శివుడి అనుచరుడైన వీరభద్రుడి భార్య. చనిపోయినవారి ఆత్మలకు శాంతి కలిగించమనీ, భూతప్రేతపిశాచాలు



పీడించకుండా తరిమెయ్యమనీ, ఆమెకు కొరడాలు సమర్పిస్తారు భక్తులు. ఆ అమ్మవారి చేతిలో ఎప్పుడూ కొరడా వుంటుంది. అప్పు డెప్పుడో రెండుమూడు సార్లు వెళ్ళాను. కానీ, పాడే అవకాశం రాలేదు,'' అన్నాడు.

''ఈసారి తప్పక వస్తుందిలే!'' అంటూ భూషణం, పెట్టెలో ఒక తోలు సంచీ పెడు తూంటే, ''అదేమిటి?'' అని అడిగాడు గోవిందరాజు.

భూషణం ఉత్సాహంగా తోలుసంచీలోంచి కొన్ని మందులు బయటికి తీసి, ''ఈ అగ్ని తుండు కడుపు నొప్పికి, ఈ లేహ్యం వాంతులు కట్టడానికి, ఇది గుండెదడ తగ్గడానికి – అలా ఎప్పుడేరోగం వస్తుందో తెలియదు కదా. అందుకని ప్రయాణంలో అన్నీ దగ్గరుంచు కుంటాను,'' అని, గోవిందరాజుకు చూపించి,



బయల్దేరాడు. అతడు అక్కడికి చేరేసరికి, ఒక చోట చాలా హడావిడిగావుంది. జమీందారు ఠీవిగా గ్రామప్రజలు వేసిన ఆసనం మీద కూర్చుని నవ్వుతున్నాడు. చుట్టూవున్న జనం కూడా కేరింతలు కొడుతున్నారు. మధ్యలో కేతిగాడి వేషంలో వున్న భూషణం, నిప్పు తొక్కిన కోతిలా అటూఇటూ గెంతుతూ, "అయ్యో, కడుపు నొప్పి! బాబోయ్, కళ్ళు బైర్లుకమ్ముతున్నవి! అగ్నితుండు గుళిక లెక్కడ? గుండెదడ మాత్రలెక్కడ? అసలు నా తోలుసంచీ ఎక్కడ? అమ్మతల్లీ అంగా లమ్మ! కరుణించి నన్నేలు, తల్లో," అంటూ అరుస్తున్నాడు.

ఐతే, జమీందారూ, జనం మాత్రం ఇదంతా కేతిగాడి నటన, హాస్యం అనుకుంటూ విరగ బడి నవ్వుతున్నారు.

భూషణం తోలుసంచీ పేరు చెప్పగానే, గోవిందరాజుకు ఇది హాస్యంకాదనీ, నిజం గానే వాడు కడుపునొప్పితో బాధపడుతున్నాడనీ గ్రహించాడు. ఆయన వెంటనే వాణ్ణి సమీ పించి, "ఇదిగో నీతోలు సంచీ! ఆ మందులేవో నాకు తెలియవు, నువ్వే చూసుకో," అంటూ సంచీని అందించాడు.

ఆ సరికి జమీందారూ, జనం కూడా కేతి గాడిది నటన కాదనీ, వాడు కడుపునొప్పితో బాధపడుతున్నాడనీ తెలుసుకున్నారు. భూషణం తోలు సంచీలోంచి తనక్కావలసిన మందు తీసుకుని మింగి, మంచి నీళ్ళు కావా లన్నట్టు సైగ చేశాడు. జనంలోంచి ఒకడు చిన్నపాత్రలో నీళ్ళు తెచ్చి ఇవ్వగానే తాగి నేల మీద చతికిలబడ్డాడు.

వాటిని తోలుసంచీలో వేశాడు కానీ, దాన్ని పెట్టెలో పెట్టుకోవడం మరిచిపోయాడు.

ఆతర్వాత, కేతిగాడిపగటివేషాల భూషణం, హడావిడిగా సత్రం నుంచి బయటికి వచ్చి, తనలాగే వెళ్ళిపోతున్న కళాకారులలో కలిసి పోయాడు.

వాడలా వెళ్ళిన కొంతసేపటికి, సత్రం నుంచి బయటికి వస్తున్న గోవిందరాజుకు, ఆ మందుల తోలుసంచీ కంటబడింది. దాన్ని తీసుకుని వీధిలోకి వచ్చిన గోవిందరాజుకు, భూషణం కనిపించలేదు. ఎలాగూ అంగా లమ్మ తీర్థానికి వెళుతున్నాను గదా, అక్కడ ఆ కేతిగాడికి సంచీ ఇవ్వవచ్చుననుకున్నాడు, గోవిందరాజు.

మర్నాడు గోవిందరాజు, బాడుగ బండిలో, అంగాలమ్మతీర్థం జరిగే వీరభద్రపురానికి

అప్పుడు, జరిగిన వాస్తవమేమిటో గ్రహించిన జమీందారు, భూషణంతో, "ఒరే, నీ కేతిగాడివేషం, నువ్వు పలికిన హాస్యపు మాటలూ చాలా అద్భుతంగా వున్నవి. ఎటొచ్చీ, ఏది పగటివేషం నటనో, ఏది నిజమైనన రుగ్మతో గుర్తించలేకపోయినందుకు విచారిస్తున్నాను," అన్నాడు.

ఆ వెంటనే భూషణం లేచి నిలబడి గోవిందరాజును చూపిస్తూ, "ప్రభూ! ఈయన వాడపల్లి గ్రామంలోని వేంకటేశ్వరస్వామి కోవెలలో, పర్వదినాలప్పుడు భక్తిపాటలు పాడుతూంటాడు. గొప్ప గాయకుడు. పేరు గోవిందరాజు. ఈయనగారు ఈ సాయంత్రం అంగాలమ్మ అమ్మవారి గుడి ముందు పాడే పాటలు వినవలసిందిగా ప్రార్థిస్తున్నాను," అన్నాడు.

ఇందుకు జమీందారు సంతోషంగా అంగీకరించాడు. ఆ సాయంత్రం గోవిందరాజు అద్భుతమైన గాన మాధుర్యానికి తన్మయుడైన జమీందారు, అప్పటికప్పుడే ఆయనను వాడపల్లి వేంకటేశ్వరస్వామివారి కోవెలకు ఆస్థానగాయకుడిగా నియమిస్తూ, కొంత మాన్యం కూడా ఇచ్చాడు. అంతేకాక, తీర్థానికి వచ్చినవారందరికీ గొప్ప వినోదం కలిగించిన కేతిగాడి వేషధారి భూషణానికి ధనం బహూకరించాడు.

"నువ్వు నాకు చేసిన ఉపకారం నేను ఈ జన్మలో మరిచిపోను," అన్నాడు గోవిందరాజు కృతజ్ఞతతో భూషణం చేతులు ఆప్యాయంగా పట్టుకుంటూ.

"ఇందులో నేను చేసిన ఉపకారం పెద్దది కాదు. సమయానికి వచ్చి నా ప్రాణం నిలబెట్టినందుకు నిజానికి నేనే నీకు ఋణపడి ఉన్నాను. అనుకోకుండా నేను మందుల సంచీ సత్రంలో మరిచిపోవడం, సమయానికి ఆ మందుల సంచీతో వచ్చి నువ్వు నన్ను కాపాడడం; జమీందారు దృష్టి నీమీద పడడం, ఆయన ఆనందించి నిన్ను మీ ఊరి వేంకటేశ్వరస్వామి దేవస్థాన గాయకుడిగా నియమించడం-అంతా దైవకటాక్షం తప్ప మరొకటి కాదు. నువ్వు నమ్మిన వాడపల్లి వేంకటేశ్వరస్వామివారే నీకు మేలు చేశాడు. అంతా ఆ దేవుడి దయ. మనమందరం కేవలం నిమిత్త మాత్రులమే," అన్నాడు భూషణం స్వగ్రామానికి బయలుదేరడానికి ఆయత్తమవుతూ.



# బాధ ఒక్కటే!

గంగాధరం అనే కూరగాయల వ్యాపారి దగ్గర, సత్యరాజనేయువకుడు కొత్తగా పనిలోచేరాడు. సత్యరాజు ఎంతోనిజాయితీగా, చురుగ్గా పనిచేస్తూ, అతితక్కువ కాలంలోనే యజమాని మెప్పుపొందాడు.

అయితే, సత్యరాజుకు కాస్తకోపం ఎక్కువ. కూరగాయలు కొనడానికి వచ్చినవాళ్ళు ఎక్కువగా బేరమాడుతూ విసిగిస్తే, "వెళ్ళండి, వెళ్ళండి! మీరేంకొంటారు," అంటూ కసురుకునేవాడు.

ఇందుకు ముఖ్యకారణాల్లో ఒకటి, ఏ రకం కూరగాయలు ఏ ధరకు అమ్మాలో ముందుగానే నిర్ణయించివుండడం. అయినా, ఈ కసురుకోవడం కోప్పడడంలాంటివి మానుకోమని, గంగాధరం ఎంతగానో చెప్పిచూశాడు. కానీ, సత్యరాజు ఇవేమీ వినిపించుకోలేదు.

ఒకరోజు, ఆ ఊరిపెద్ద వీరభద్రయ్య ఇంట్లో పనిచేసే మనిషి మీద సత్యరాజు దురుసుగా మాట్లాడడంతో, వీరభద్రయ్య స్వయంగా వచ్చి గంగాధరాన్ని నానా మాటలూ అనిపోయాడు. ఇక ఊరుకుని లాభంలేదని గంగాధరం, సత్యరాజును పనిలోంచి తీసివేశాడు.

దిగాలుపడిపోయిన సత్యరాజు రెండురోజుల తర్వాత తిరిగి గంగాధరం వద్దకు వచ్చి, తనను పనిలోకి తీసుకోమని బతిమాలడం మొదలు పెట్టాడు. అయితే, గంగాధరం, అతడు చెప్పేది వినిపించుకోకుండా గొంతుపెద్దది చేసి, "ఏయ్, చెప్తూంటే మనిషివికాదూ వెళ్ళు, పో!" అంటూ అరిచాడు.

గంగాధరం తనను కుక్కను అదిలించినట్టుగా కరకుగా మాట్లాడడంతో, సత్యరాజు మనసు కలుక్కుమన్నది. అతడు కళ్ళల్లోనీళ్ళు తిరుగుతూండగా తలదించుకుని వెనక్కు తిరిగాడు. వెంటనే గంగాధరం అతణ్ణి "ఒరేయ్, ఇలారా!" అంటూ పిలిచాడు.

సత్యరాజు వెనక్కువచ్చి యజమాని ఎదురుగా నిలబడ్డాడు. అప్పుడు గంగాధరం, "ఇప్పుడు నీకు అర్థమయిందా? ఒక మనిషితో మరొకమనిషి మర్యాదగా, గౌరవంగా మాట్లాడకుండా కసురుకుంటే, ఆ మనిషి ఎంతగా బాధపడతాడో!" అన్నాడు సౌమ్యంగా.

నిజంగానే సత్యరాజుకు ఆ బాధ అనుభవంలోకివచ్చింది. అతడు వినయంగా చేతులుజోడిస్తూ, "ఆబాధ ఎలావుంటుందో తెలిసివచ్చింది, బాబూ!" అన్నాడు.

"ఇప్పుడు నేను, నిన్ను నమ్మగలను. వెంటనే పనిలో చేరు," అన్నాడు గంగాధరం శాంతంగా.

- కె. లక్ష్మీకాంతమ్మ





# భల్లూక మాంత్రికుడు

## 7

*[అరణ్యంలో నాగమల్లు అనే దొంగలనాయకుడికి దొరికిన రాజు దుర్ముఖుడు, తన పేరు దుర్జయశెట్టి అని చెప్పి తప్పించుకుని పారిపోజూశాడు. నాగమల్లు నమ్మక అతణ్ణి బలవంతంగా ఒక గుహలోకి తీసుకుపోయాడు. అంతలో అక్కడికి గండ్రగొడ్డలి తిప్పుతూ తలారిభల్లూకం వచ్చి రాజుదుర్ముఖుడి తల తెగనరుకుతానని నానా గొడవ చేస్తూండగా, దాపులనున్న గుహనుంచి ఉగ్రదండుడనే రాక్షసుడు వెలుపలికి వచ్చాడు. తలారిభల్లూకం, వాడి మీదికి గండ్రగొడ్డలి ఎత్తింది. తరవాత- ]*

తలారిభల్లూకం గండ్రగొడ్డలిని పైకెత్తి పట్టుకుని తన కేసి రావటం చూస్తూనే, రాక్షసుడు ఉగ్రదండుడు అంతలోనే ఏదో గుర్తుకు రావటంతో వణికిపోతూ, రాతి గదను ముందుకు చాచి, "ఒరే, మానవ భల్లూకాధమా! ఆగు, ఏమా పొగరు?" అన్నాడు.

తలారిభల్లూకం చప్పున ఉన్న చోటునే ఆగి, "ఒరే, ఉగ్రదండా! రాక్షసుణ్ణని అహం పోతున్నావా? నీ మేకపోతు గాంభీర్యం, నా దగ్గిరా? నీ కాళ్లూ, గద పట్టిన చేయీ వణుకుతూండటం, తెలుస్తూనే వున్నది," అన్నాడు.

ఉగ్రదండుడు పళ్ళుకొరుకుతూ కాళ్ళతో నేలను తాటించి, "నా కాళ్ళూ, చేతులూ వణుకుతున్న మాట నిజమే. కాని, అది నిన్ను చూసిన భయంవల్ల కాదు; అసహ్యం వల్ల!" అన్నాడు.

ఆ మాటలతో ఉగ్రుడైపోయిన తలారి భల్లూకం, కోపం పట్టలేక గండ్రగొడ్డలిని దాపులనున్న పెద్ద రాతిమీద బలంగా కొట్టి, "ఒరే, రాక్షసాధమా! భల్లూక మాంత్రికుడు



సృష్టించిన, ఈ తలారి భల్లూకుణ్ణే హేళనచేసి మాట్లాడుతున్నావా? ఇదిగో, నీ తల తెగి నేల పడబోతున్నది," అంటూ కుప్పించి ముందుకు దూకి, గండ్రగొడ్డలిని రాక్షసుడి కంఠం కేసి కొట్టబోయాడు.

ఉగ్రదండుడు ఎగిరి గంతేసి దాపులనున్న ఒక చిన్న దేవదారువృక్షం పక్కకు పోయి నిలబడి, నిబ్బరంగా అడుగులో అడుగు వేసుకుంటూ తనను సమీపిస్తున్న తలారి భల్లూకుతో, "తలారి భల్లూకా, కాస్త శాంతించు. మనిద్దరం ఒకళ్ళనొకళ్ళం చంపుకునే ప్రయత్నంలో బాగా గాయపడటం తటస్థిస్తే, లాభపడేది ఎవరో తెలుసా!" అన్నాడు.

ఆ ప్రశ్నవింటూనే తలారి భల్లూకుడికి, తానా ప్రాంతాలకు వచ్చిన పనేమిటో గుర్తుకు వచ్చింది. భల్లూక మాంత్రికుడు తనను పంపింది, దుష్టుడైన ఉదయగిరి రాజు దుర్ముఖుడి తల నరకమని! ఆ పని ముగించుకుని, తిరిగి భల్లూకమాంత్రికుడి దగ్గిరకు పోక, తనెందుకు ఈ ఉగ్రదండుడనే రాక్షసుడితో గొడవలు పడటం?

ఈ ఆలోచన కలగ్గానే తలారిభల్లూకం, "ఒరే, ఉగ్రదండా! సమయానికి నేనిక్కడి కొచ్చిన పనేమిటో గుర్తు చేశావు, మెచ్చాను! ఇక నీ దారిన నువ్వుపో, నే నీ పక్కన వున్న గుహలో దాగిన రాజు దుర్ముఖుడి తలనరికి, నా దారిన నేను పోతాను," అంటూ వెను దిరిగాడు.

ఉగ్రదండుడు రెండడుగులు ముందుకు వేసి, "ఓయ్, తలారి భల్లూకీ, కొంచెం ఆగు! ఇంతకు ముందు నువ్వు, భల్లూకమాంత్రికుడి పేరు పలికావు. నే విన్న భల్లూకమాంత్రికుడూ, నువ్వనే ఈ భల్లూకమాంత్రికుడూ ఒకరేనేమో అన్న సంశయం కలుగుతున్నది. నువ్వెరిగిన ఈ మాంత్రికుడి వయసు ఏపాటి వుంటుంది!" అన్నాడు.

ఆ ప్రశ్నకు తలారిభల్లూకుడు పెద్దగా నవ్వి, "సూర్య, చంద్రుల వయసెంతో ఆయన వయసంత. ఆయన కళ్ళ ఎదటే హిమాలయ పర్వతాలు పుట్టి; ఇంత అయినై. బ్రహ్మపుత్రానది పురిటిబిడ్డగా కెవ్వుమంటూ అరిచి, వేలెడంత నీటిపాయగా కొండరాళ్ళ మీద గంతులు వేయటం ఆయనెరుగు!" అన్నాడు.

"భళిరా, తలారిభల్లూకా! నీ చేతిలోని గండ్రగొడ్డలి ఎంత వాడి అయిందో, నీ తలలోని నాలుకా అంత వాడిఅయిందే! నిజంగా మెచ్చాను! నేనూ, నీ వెంట వచ్చి, ఆ భల్లూక

మాంత్రికుడి దర్శనం చేసుకోవటం ఎలా వుంటుందంటావు?" అన్నాడు ఉగ్రదండుడు రాతిగదను దూరంగా విసిరివేస్తూ.

రాక్షసుడి ప్రవర్తనకు తలారిభల్లూకం ఆశ్చర్యపోతూ, "అలా రాతిగదను దూరంగా పారవేయటంలో ఏదైనా విశేష ముందంటావా?" అని అడిగాడు

"ఎందుకు లేదు? ఈ క్షణంనుంచీ మనిద్దరం మిత్రులం," అన్నాడు ఉగ్రదండుడు.

ఆ జవాబుకు తలారిభల్లూకం నవ్వి, "భల్లూకమాంత్రికుడి చేతగల, ఎలుగుతలాటం మంత్రదండం తగిలి, నా రూపం మారినా, చూచాయగా నేనెవరో, నా కింకా గుర్తున్నది. రాజు దుర్ముఖుడి తలను ఆ మాంత్రికుడి పరం చేసిన మరుక్షణం, ఆయన నన్ను తలారిగా మార్చేస్తాడు. కనక, మనిద్దరి మధ్యా స్నేహం సాగదు. నీ గుహ దారేదో నువ్వు చూసుకో," అని, దొంగల నాయకుడూ, రాజు దుర్ముఖుడూ దాగి వున్న గుహకేసి వెళ్ళాడు.

ఈసారి తలారిభల్లూకం గుహకు అడ్డంగా వున్న రాతిని పక్కకు లాగి పడవేసే ప్రయత్నం ప్రారంభించగానే లోపలవున్న రాజు అంగరక్షకుడు, దొంగ నాగమల్లుతో, "నాగమల్లూ, ఈసారి మహారాజుగారితోపాటు మనందరికీ చావు తప్పదు," అన్నాడు వణికిపోతూ.

నాగమల్లు, దుర్ముఖుడి కేసి చూశాడు. దుర్ముఖుడు, తనలో తాను ఏదో గొణుక్కుంటూ గుహద్వారం కేసి చూస్తున్నాడు. నాగమల్లు తన అనుచరులిద్దరినీ కత్తులు దూసి, సిద్ధంగా వుండమని హెచ్చరించి దుర్ముఖుడితో, "నీ అంగరక్షకుడి మాటల



వల్ల ఇప్పటికి నువ్వు శెట్టివి కాదనీ రాజువనీ నాకు నమ్మకం కలిగింది. ఆ భల్లూకం నరక వచ్చింది, నీ తల. ఆత్మరక్షణ చేసుకునే ప్రయత్నం చెయ్యక, ఏదో గొణుగుతున్నావెందుకు?" అన్నాడు కోపంగా.

"నేను గొణగటం లేదు, ఏమి చెయ్యాలో తెలుసుకునేందుకు, ఇష్టదైవాన్ని ప్రార్థిస్తున్నాను," అన్నాడు రాజు దుర్ముఖుడు బొంగురుపోయిన గొంతుతో.

"అంటే, ఈనాటివరకూ నువ్వు చేసిన వెధవ పనులన్నీ, నీ ఇష్టదైవం అనుమతితోనే చేశావన్నమాట! ఛీ, బయిటికినడు," అంటూ నాగమల్లు, దుర్ముఖుణ్ణి పక్కకు తోసి, సగం తెరుచుకున్న గుహద్వారం దగ్గిరకుపోయి, పెద్దగొంతుతో, "ఓయ్, తలారిభల్లూకా, కాస్త నిదానించు! ఈ గుహలోవున్న వాళ్ళలో నీక్కావలసింది, దుర్జయశెట్టినని అబద్ధాలాడు



తూన్న దుర్ముఖరాజే గదా?'' అని అడిగాడు.

''ఔనౌను! మిగతా చిల్లరమల్లరసరుకుతో నాకేం పని? వాణ్ణి గుహనుంచి తలతోపాటు బయటికి నెట్టండి; తల మాత్రం నేన్నరుక్కు పోతాను,'' అన్నాడు తలారిభల్లూకం.

''అయితే కొంచెం ఓపికపట్టు,'' అని, దొంగలనాయకుడు నాగమల్లు వెనుదిరిగి, దుర్ముఖుడితో, ''రాజా, దుర్ముఖా! తలారి భల్లూకం మాటలు విన్నావు గదా? చావే తప్పకపోతే, రాజోచితంగా కత్తి దూసి, ఆ తలారిభల్లూకంతో పోరాడుతూ ఎందుకు చావకూడదు?'' అన్నాడు.

రాజు దుర్ముఖుడు వెలవెలపోతూ, ''నేను రాజోచితంగా బతకటం నేర్చిన వాణ్ణేకాని, రాజోచితంగా చావటం చేతనైన వాణ్ణికాను!'' అని, పక్కనవున్న అంగరక్షకుడితో, ''ఒరే, అంగరక్షకా! నీ స్వామిభక్తి ఎలాంటిదో చూపి, స్వర్గానికి పోయేందుకు, ఇదే మంచి అవకాశం! నువ్వు ముందుపోయి ఆ తలారిభల్లూకాన్ని ఎదిరించు. ఆసమయంలో నేను ప్రాణాలతో తప్పించుకునే అవకాశం వుంటుందేమో చూస్తాను,'' అన్నాడు.

అంగరక్షకుడు ఈసారి ఒరనుంచి దూసిన కత్తిని తిరిగి ఒరలో పెట్టివేస్తూ, ''నేను చచ్చి స్వర్గానికిపోతే, ఇక్కడ నా భార్యాబిడ్డల మాటేమిటి? ఇప్పుడప్పుడే అటుకేసి పోవాలని లేదు,'' అంటూ గుహగోడకు చేరగిలబడి, గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

అంతలో బయటినుంచి తలారిభల్లూకం కోపంతో, ''ఒరే, ఎక్కడరా, ఆ దుర్ముఖ రాజు?, ఒకసారి నేను గుహలోజొరబడ్డానంటే, మీ అందర్నీ ఊచకోత కోస్తాను,'' అన్నది.

దొంగ నాగమల్లు తన అనుచరులిద్దరికీ సైగచేసి, వాళ్ళు వెంటరాగా, గుహకు అడ్డంగావున్న రాయిని పక్కకు నెడుతూ, తల బయటికి పెట్టి, ''అయ్యా, నన్నూ, నా ఇద్దరు సేవకుల్నీ ప్రాణాలతో వదలండి. మేం, ఈ ప్రాంతాల అరణ్యమృగాల మధ్య బతుకుతున్న వాళ్ళం!'' అన్నాడు.

''ఒరే, మీరు దొంగలు, ఆ సంగతి నాకు తెలుసు! అయినా నేను, మిమ్మల్ని ఏమీ చెయ్యను,'' అన్నాడు తలారిభల్లూకుడు.

నాగమల్లూ, అతడి అనుచరులూ రాతిని పక్కకు నెట్టివేసి బయటికి వస్తున్నంతలో, వాళ్ళను చాటు చేసుకుని రాజు దుర్ముఖుడు వేగంగా బయటికి దూకి, పారిపోసాగాడు. తలారిభల్లూకం ఎగిరి గంతేసి, ''ఒరే, దుర్ముఖా! ఆగు, ఆగు'' అంటూ వెంటబడిపరిగెత్తేంతలో

దుర్ముఖుడు ఒకచెట్టుచాటుకు పరిగెత్తబోయి, ఎదురుగా రాతిగద పట్టుకుని నిలబడివున్న రాక్షసుడు ఉగ్రదండుణ్ణి చూసి, ఒక చావు కేకపెట్టి, అతడి ముందు బోర్లాపడిపోయాడు.

తలారిభల్లూకుడు, "ఆహా, దొరికావు గదరా!" అంటూ దుర్ముఖుణ్ణి సమీపిస్తు న్నంతలో, ఉగ్రదండుడు రాతిగదను నేల జార్చి, చేయెత్తి, "సోదరా, తలారి భల్లూకా, ఒక్కక్షణం ఆగు! ఆ భల్లూకమాంత్రికుడు నిన్ను బతికివున్న రాజు దుర్ముఖుడి తల నరుక్కురమ్మన్నాడా లేక చచ్చిన దుర్ముఖుడి తల కోసుకురమ్మన్నాడా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు తలారిభల్లూకం ఆశ్చర్యపోతూ, కదలామెదలక పడివున్న దుర్ముఖుడి కేసి పరీక్షగా చూసి, "ఉగ్రదండా! ఈ దుర్ముఖుడు చచ్చిపోయాడనా నువ్వనేది?" అన్నది.

"చావలేదు, మూర్ఛపోయాడు. మూర్ఛలో వున్నవాడి తల నరకటం మహాపాపం అన్నారు గదా, పెద్దలు. ఒక పని చెయ్యి. వీణ్ణి, ఆ మాంత్రికుడి దగ్గిరికి తీసుకుపోయి, అక్కడే తల నరుకు, అక్కడకు వెళ్ళేలోపల వీడికి స్పృహరాకపోదు," అన్నాడు ఉగ్రదండుడు.

తలారిభల్లూకం బుసలుకొడుతున్నట్టు పెద్దగా నిట్టూర్చి, "శత్రువును భుజానవేసు కుని మోయమన్నావా? ఛీ, ఛీ!" అన్నాడు.

ఉగ్రదండుడు గుహకేసి ఓ మారు చూశాడు. అక్కడ నాగమల్లూ, అతడి ఇద్దరు అనుచరులూ చాటుగా నిలబడి, పారిపోయే ప్రయత్నం చేస్తూ గుసగుసలాడుతున్నారు. ఉగ్రదండుడు రాతిగదను చేతికి తీసుకుని, "ఒరే, దారిదోపిడీ వెధవల్లారా, పారిపోవాలని



చూస్తున్నారా? జాగ్రత్త, కాలరాయగలను! ఇటురండి. ఆ అంగరక్షకు డెక్కడ?" అంటూ గద్దించాడు.

నాగమల్లు గుహలోకి తొంగి చూసి, "అయ్యా, ఇక్కడ ఆ రాజు అంగరక్షకుడు మూర్ఛపోయినట్టున్నది. గుహకు చేరగిల బడి, బిగుసుకు పోయివున్నాడు," అన్నాడు.

"వాడిది దొంగమూర్ఛ. ఉగ్రదండుడు అభయం ఇచ్చి, పిలుస్తున్నట్టు చెప్పండి. ఇక్కడ రాజు దుర్ముఖుడు చావబోతున్నాడు," అన్నాడు ఉగ్రదండుడు.

దొంగల నాయకుడు నాగమల్లు పెద్దగా గొంతెత్తి, "ఒరే, అంగరక్షకా, మూర్ఛలే! మహా రాక్షసుడు ఉగ్రదండుడు, నిన్ను చంపనని అభయం ఇచ్చాడు," అన్నాడు

దానితో అంగరక్షకుడు చప్పున లేచి కూర్చుని, గుహలోనుంచి బయిటికి వస్తూ,

''మహారాజుగారి తల తెగినట్టేనా? ఆ భయంకర తలారిభల్లూకం ఇక్కణ్ణించి వెళ్ళిపోయిందా?'' అని అడిగాడు.

ఆ వెంటనే నాగమల్లు అనుచరులిద్దరూ, వాడిమీదికి దూకి, నడుమూ, మెడాపట్టుకుని బయిటికిలాగి, ''అడుగో, మీ దుర్ముఖ రాజు, ఉగ్రదండుడి పాదాల దగ్గిర మూర్ఛపోయి వున్నాడు,'' అన్నారు.

అంగరక్షకుడు వణికిపోతూ ఉగ్రదండుడి ముందుకు పోయి, ''అయ్యా, ఈ క్షణం నుంచీ నేను తమకు అంగరక్షకుణ్ణి. ఈ తలారి భల్లూకం నుంచి కాపాడాలి,'' అన్నాడు.

ఉగ్రదండుడు పెద్దగా నవ్వి, ''అలా అయితే, నా రక్షణకు, ఒక అంగరక్షకుడు దొరికాడన్నమాట! ఎంత మహారాక్షసుడికి ఎంత దుర్దశపట్టింది,'' అని, ''ఒరే, అంగరక్షకా! ఆ కనబడే నా గుహలోకిపోయి, ఒక రాతిపాత్ర తీసుకుని, ఆ చెట్లచాటునవున్న నీటివాగు నుంచి, నీరు తీసుకురా. ఈ దుర్ముఖ రాజు మూర్ఛనుంచి లేచేమార్గం ఏమన్నా వున్నదేమో చూద్దాం,'' అన్నాడు.

''మా రాజు మూర్ఛనుంచి బయట పడితే తప్ప, తలారిభల్లూక దొర, తల నరుక్కోరన్నమాట!'' అంటూ ఆశ్చర్య పోయాడు అంగరక్షకుడు.

తలారిభల్లూకం గండ్రగొడ్డలి ఎత్తి, ''ఒరే, మూర్ఖుడా! అలా చూస్తావేం? ఉగ్రదండుడు చెప్పిందేమిటి?'' అన్నాడు.

ఆ మరుక్షణం అంగరక్షకుడు రాక్షసుడి గుహలోకి పరిగెత్తి, అక్కడ వున్న ఒక రాతిపాత్ర తీసుకుని, వాగు కేసి పోయాడు. వాడు పాత్రలో నీటిని నింపుతున్నంతలో, ఆ పక్కన వున్న చెట్లగుంపులో నిలబడివున్న తొండం తెగిన ఏనుగు వాణ్ణి చూసి, పెద్దగా ఘీంకరించి వాడికేసి పరిగెత్తి రాసాగింది.

అంగరక్షకుడు పాత్రను అక్కడే వదిలి, ఉగ్రదండుడూ వాళ్ళువున్న చోటుకు అమిత వేగంతో పరిగెత్తుకుంటూ వచ్చి, ''అయ్యా, తలారి భల్లూకంగారి మొండితొండపుటేనుగు వెంటబడి వస్తున్నది,'' అంటూ భయంతో అరిచాడు.

''ఆహా, నా వాహనం ఈ ప్రాంతాలనే వున్నదన్నమాట!'' అంటూ తలారి భల్లూకుడు తల పక్కకు తిప్పి చూసేంతలో, ఏనుగు తొండం పైకెత్తి, ఘీంకరిస్తూ పెనుభూతంలా వాళ్ళ మీదికివచ్చి పడసాగింది. - (ఇంకావుంది)



బేతాళ కథలు

# నాగదేవత

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతిగొలిపే ఈ శ్మశానంలో, అర్ధరాత్రి వేళ ఎడతెగని ఇక్కట్లకు లోనవుతూ కూడా, నువ్వు సాధించదలచిన కార్యం పట్ల చూపుతున్న పట్టుదల మెచ్చదగిందే. కాని, కార్యం ఫలించనున్న తరుణంలో, ధర్మాంగదుడిలాగా దాన్ని చేజార్చుకుంటావేమో అన్న శంక కలుగుతున్నది. నీకు తగు హెచ్చరికగా వుండేందుకు అతడి కథ చెబుతాను; శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ధర్మాంగదుడు, విశ్వనాధుడు అనే వాళ్ళు చాలా కాలంగా మంచి మిత్రులు.



అయితే, వారిస్నేహానికి భూషయ్య రూపంలో పరీక్ష వచ్చింది.

భూషయ్య మోసగాడు. దొంగ పత్రాలు సృష్టించడంలో నేర్పరి. ఆయన, ధర్మాంగదుడు తన వద్ద పొలాన్ని తాకట్టుపెట్టి రెండు వేల వరహాలు తీసుకున్నట్లు దొంగపత్రం సృష్టించాడు. వడ్డీతో సహా తన బాకీ మూడు వేల వరహాలయిందనీ, తక్షణం ఆ బాకీ తీర్చక పోతే ధర్మాంగదుడి పొలాన్ని తను స్వాధీనం చేసుకుంటాననీ కబురు పెట్టాడు.

ధర్మాంగదుడు వెంటనే వెళ్ళి న్యాయాధికారిని కలుసుకుని, భూషయ్యమోసం నుంచి తనను్ను కాపాడమని కోరాడు. న్యాయాధికారి కాసేపాలోచించి, "ఏ నేరాన్నైనా విచారణ జరపకుండా నిర్ణయం తీసుకోరాదు. నాకు నువ్వు మంచివాడివనీ తెలుసు, భూషయ్య మోసగాడనీ తెలుసు. అయినా విచారణ జరిగేదాకా భూషయ్యను ఆపాలంటే, నీవు వెయ్యి వరహాలు ధరావతు కట్టాలి. ఎవరైనా నీగురించి హామీ ఇవ్వాలి," అన్నాడు.

అప్పుడు ధర్మాంగదుడి వద్ద డబ్బులేదు. అయినా అతడు బెంగపడలేదు. ఊళ్ళో తన కింతో అంతో పరపతివుందికాబట్టి అప్పు పుడు తుందనుకున్నాడు. కానీ అతడిపొలం చిక్కుల్లో పడిందని తెలిసి, ఎవరూ అతడికి అప్పివ్వడానికి ముందుకు రాలేదు.

ఇలాంటి కష్ట సమయంలో విశ్వనాధుడు తనను ఆదుకుంటాడని ధర్మాంగదుడు నమ్మాడు. అయితే, అదే సమయంలో విశ్వనాధుడి తండ్రికి పెద్ద జబ్బు చేసింది. వైద్యానికి చాలా డబ్బు ఖర్చయింది. అంతలోనే అతడి చెల్లికి చక్కని పెళ్ళి సంబంధం వచ్చింది. పెళ్ళి ఖర్చులకు అయిదు వేల వరహాలదాకా అవసరమని అంచనా వేశాడు. డబ్బు కోసం విశ్వనాధుడు శతవిధాల ప్రయత్నిస్తూంటే భూషయ్య అతణ్ణి కలుసుకుని, "నీకు నేను సాయపడతాను. బదులుగా నువ్వు నాకు సాయపడాలి," అన్నాడు.

విశ్వనాధుడు స్నేహం కంటే అవసరమే ముఖ్యమనుకున్నాడు. అతడు ధర్మాంగదుడి విషయంలో హామీవుండడానికి నిరాకరించాడు. ధర్మాంగదుడికి ఎక్కడా అప్పు పుట్ట లేదు. అతడి పొలం భూషయ్య పాలయింది.

అప్పుడు ధర్మాంగదుడికి, భూషయ్య మీదకంటే విశ్వనాధుడి మీద ఎక్కువ కోపం వచ్చింది. ముందతడు ఆ మిత్రద్రోహిని చంపేయాలనుకున్నాడు. కానీ అందువల్ల ప్రయోజనమేముంటుంది? తను హంతకు

డనిపించుకుని ఉరికంబ మెక్కాల్సివస్తుంది. పోనీ, విశ్వనాధుణ్ణి కసితీరాకొడదామన్నా - అప్పుడూ అందరూ తనను పరమదుష్టుడని అసహ్యించుకుంటారు!

విశ్వనాధుడి మీద పగతీర్చుకునే మార్గం తోచక చివరకు ధర్మాంగదుడు, ఊరిచివర కొండగుహలో వుండే బైరాగి వద్దకు వెళ్ళి తన గోడు వినిపించాడు. ఆ బైరాగి చాలా గొప్ప వాడనీ, ఆయన మహిమలు చేయగలడనీ అంతా చెప్పుకుంటారు.

బైరాగి, ధర్మాంగదుడు చెప్పింది విని, "తన స్వార్థంకొద్దీ నీకు సాయపడలేదు కాబట్టి విశ్వనాధుడు మంచి మిత్రుడు కాదు. మరి నీ సంగతేమిటి? నీకు సాయపడలేదని నువ్వు విశ్వనాధుడికి అపకారం చెయ్యాలనుకుంటు న్నావు. నువ్వూ మంచి మిత్రుడివి కావు!" అన్నాడు.

"స్వామీ, అపకారం చేసింది విశ్వనాధుడు. నేను అతడికి అపకారం చేయాలనుకోవడం లేదు. అతడి పట్ల ప్రతీకారం తీర్చుకోవాలను కుంటున్నాను. అందుకు మీ సాయం కోరి వచ్చాను," అన్నాడు ధర్మాంగదుడు.

"ఇప్పుడు నీ మనసునిండా పగవుంది. పాముకు విషమెలాంటిదో, మనిషికి పగ అలాంటిదే. నేను విషప్రాణులకు సాయ పడను. నీవు పగను విడిచి పెట్టిరా. అప్పుడు మనం మళ్ళీ మాట్లాడుకుందాం," అన్నాడు బైరాగి.

"స్వామీ! నామనసులోని పగపోయే మార్గం కూడా, మీరే చెప్పండి. ఆ పగ ఉధృతాన్ని తట్టు కోలేకుండావున్నాను," అన్నాడు ధర్మాంగదుడు.



బైరాగి కొద్దిసేపు ఆలోచించి, "అయితే విను. నేను నిన్ను పాముగా మార్చగలను. అప్పుడు నీ పగ అంతా విషంగా మారి, నీతలలో చేరుతుంది. ఆ విషం బారినుంచి బయట పడగానే, నీకు తిరిగి మనిషిరూపు వస్తుంది. పాము రూపంలో వున్నంత కాలం నీకు పూర్వ జ్ఞానం వుంటుంది కానీ, బుద్ధులు మాత్రం పాముపే వుంటాయి. ఎటొచ్చీ పాము రూపంలో వుండగా ఏ మనిషైనా నిన్ను చంపితే మాత్రం ఆరూపంలోనే మరణిస్తావు!" అన్నాడు.

ధర్మాంగదుడు మారాలోచనలేకుండా దీనికి అంగీకరించాడు. బైరాగి అతణ్ణి పాముగా మార్చేశాడు.

పాముగా మారిన ధర్మాంగదుడు, అక్క ణ్ణించి పాకుతూ పొలాలవైపు వెళ్ళాడు. పొలంలో రైతు ఒకడు కర్రను నేలకు తాటిస్తూ వస్తూంటే, దాని దెబ్బ ధర్మాంగదుడి తోకకు



తగిలింది. అతడికి కోపం వచ్చి సర్రున లేచి పడగ ఎత్తి బుస్సుమన్నాడు. అప్పటికే రైతు ముందుకు వెళ్ళిపోయాడు. ఆ శబ్దం విని పక్కనున్న పొదల్లో నుంచి పాము ఒకటి బయటికి వచ్చి, ధర్మాంగదుడితో, "నువ్వా మనిషి వెంటబడి కరుస్తావేమో అని భయ పడ్డాను. మనిషి కంటబడడం మనకు ప్రమాదం అని తెలుసుగదా!" అన్నది.

ధర్మాంగదుడు కాసేపు ఆ పాముతో మాట్లాడి చాలా విశేషాలు తెలుసుకున్నాడు. తలలోని విషాన్ని పాములు ఆత్మరక్షణకు మాత్రమే ఉపయోగించుకుంటాయి. మనిషి వల్ల అపకారం జరిగినా, ప్రాణప్రమాదం లేక పోతే అతడి జోలికి వెళ్ళవు. వాటికి పగ అన్నది తెలియదు.

అది నిజమేననిపించింది, ధర్మాంగదుడికి. కానీ విశ్వనాధుడు తన శత్రువు. అతణ్ణి మాత్రం కాటువేయాలి. అప్పుడు విశ్వనాధుడి ప్రాణాలు పోతాయి. తనకు శిక్షావుండదు!

ధర్మాంగదుడు ఇలా నిర్ణయించుకుని, ఎవరికంటా పడకుండా విశ్వనాధుడి ఇల్లు చేరాడు. ఇంట్లోని ముందరిగదిలో విశ్వనాధుడి కొడుకు ఆరేళ్ళవాడు బొమ్మలతో ఆడుకుంటు న్నాడు. వాడు ధర్మాంగదుణ్ణి చూడనే చూశాడు. వెంటనే భయంతో, "పాము!" అని గట్టిగా అరిచాడు.

ఆ కుర్రవాణ్ణి కాటేసి విశ్వనాధుడికి పుత్రశోకం కలిగించాలని ధర్మాంగదుడు అను కున్నాడు కానీ, తనకే అపకారమూ చేయని వాడి జోలికి వెళ్ళడం తప్పని, అతడికి అని పించింది. అందుకని అక్కణ్ణించి చరచరా పాక్కుంటూ పూజగదిలోకి దూరాడు.

ఇంతలో ఇంటిల్లపాదీ విశ్వనాధుడి కొడుకు చుట్టూ చేరారు. వాడు చెప్పిందివిని, అంతా పూజగదిలోకివెళ్ళారు. చూస్తే, అక్కడ పూజా మందిరంలో, పడగ విప్పి ఆడుతున్నాడు ధర్మాంగదుడు.

"నాగదేవత! కళ్ళు మూసుకుని నమస్క రించండి. ఎవరికీ ఏ అపకారమూ జరగదు! ఈ రోజుతో మనకూ, మనవాళ్ళకూ వచ్చిన కష్టాలన్నీ తొలగిపోతాయి. దుష్టుల కారణంగా నీ స్నేహితుడు ధర్మాంగదుడికి వాటిల్లిన కష్టం కూడా మంచులా కరిగి పోవాలని నాగదేవతకు మొక్కుకో నాయనా," అన్నది విశ్వనాధుడి తల్లి. అక్కడున్న వారందరూ ఆమె చెప్పినట్లే చేశారు. ఆ మాటలు విన్న పాముగూపంలోని ధర్మాంగదుడు ఉలిక్కి పడ్డాడు. ఎంత ప్రయ త్నించినా అతడిలో కసి పుట్టలేదు.

"ఛీ! నాయీ విషంవల్ల ఏ ప్రయోజనమూ లేదు," అనుకుంటూ ధర్మాంగదుడు తన కోరలతో పూజామందిరాన్ని కాటువేశాడు. కోరల విషం బయట పడగానే, అతడి పాము రూపంనశించి తిరిగి ధర్మాంగదుడయ్యాడు. అక్కడున్న వారందరూ ఇంకా కళ్ళు మూసు కునే వుండడంతో తనూ లేచి వారితో కలిశాడు. కళ్ళు తెరిచిన విశ్వనాథుడి తల్లి, మందిరంలో నాగదేవత మాయంకావడం చూసి, మరింత భక్తిభావంతో నాగస్తోత్రం చేసింది. ఆమె ప్రతి చవితి పర్వదినాన వెళ్ళి పాముపుట్టలో పాలు పోసివచ్చేది. ఎలాంటి కష్టాలు వచ్చినా, నాగదేవత కరుణవల్ల తొలిగి పోతాయని కొడుకుకు చెపుతూండేది.

విశ్వనాథుడు కొద్దిసేపు తర్వాత కళ్ళు తెరిచి, పక్కనేవున్న ధర్మాంగదుణ్ణి చూసి ఆశ్చర్య పడి ఏమనాలో తెలియక తలదించుకున్నాడు. అప్పుడు ధర్మాంగదుడు, "మిత్రమా! నీ అవసరం నీచేత చేయించిన పనివల్ల, నాకు పొలం పోయింది. అంత మాత్రాన, అంత కంటే విలువైన నీ స్నేహాన్ని పోగొట్టుకు నేందుకు నేను సిద్ధంగాలేను," అన్నాడు.

ఈ మాటలకు విశ్వనాథుడితో పాటు, అతడి కుటుంబంవారందరూ ధర్మాంగదుణ్ణి ఆకాశానికెత్తేశారు. ఈ విషయం తెలిసి ఊళ్ళో వారందరు కూడా, ధర్మాంగదుణ్ణి ఎంతగానో మెచ్చుకున్నారు. భూషయ్యలో కూడా, ఆ తర్వాత మార్పు వచ్చి ధర్మాంగదుడికి చేసిన అన్యాయాన్ని సరిదిద్దుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా! విశ్వ నాథుడు, ధర్మాంగదుడికి ఎంతో ఆప్తమిత్రు డుగా వుంటూ, ఆపద సమయంలో తన



స్వార్థం కొద్దీ, అతడికి సహాయం నిరాకరించాడు. అటువంటి మిత్రద్రోహి మీద పగసాధించేందుకు ధర్మాంగదుడు, మహిమ గల బైరాగిని ఆశ్రయించి పాముగా మారాడు గదా? కానీ, పూజామందిరంలో అవకాశం వున్నా అతడు, విశ్వనాధుడితో తమ స్నేహాన్ని గురించి అన్న మాటలకూ, పాముగా అతడి ప్రవర్తనకూ పొంతన వున్నట్టు లేదుకదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మనుషులలాగే పశుపక్ష్యాదులక్కూడా ప్రకృతి ప్రభావ కారణంగా సహజ స్వభావమంటూ ఒకటి వుంటుంది. ధర్మాంగదుడు సాధారణంగా మనుషులకుండే ఊహాపోహలతో, పాములకు తను సహజంగా వున్నవనుకుంటున్న దుష్టస్వభావం, పగల గురించి ఆలోచించాడు. బైరాగి, అతడికి పాముగా పూర్వ జ్ఞానం వుంటుందనీ, బుద్ధిమాత్రం పాముల దేననీ చెప్పాడు! ధర్మాంగదుడు కాకతాళీయంగా పొలంలో మరొక పాముకు తటస్థపడినప్పుడు, ఆ పాము - పాములు తలలోని విషాన్ని ఆత్మరక్షణకు మాత్రమే ఉపయోగించుకుంటాయనీ, వాటికి పగ అన్నది తెలియదనీ చెప్పింది. ఆ సమయాన, బుద్ధి విషయంలో పాముల స్థాయిలో వున్న ధర్మాంగదుడికి, అది ఆచరించదగిందిగా తోచింది. పైగా, విశ్వనాధుడు, ధర్మాంగదుడు మిత్రులే. అనుకోకుండా కష్టాల పాలైన ధర్మాంగదుడు మిత్రుణ్ణి సాయం కోరాడు. అది సహజం. అయితే, ఆ సమయంలో విశ్వనాధుడు కూడా తండ్రి అనారోగ్యం, చెల్లెలి పెళ్ళి ఖర్చులు కారణంగా కష్టాల్లో ఉండడం వల్ల, స్నేహితుడు కోరిన సాయం చేయలేక పోయాడు. అయితే, ధర్మాంగదుడు అది గ్రహించలేక, ఆవేశంతో అతని పట్ల ప్రతీకార వాంఛను పెంచుకున్నాడు. పూజగదిలో పామును చూడగానే విశ్వనాధుడి తల్లి అన్నమాటలతో ధర్మాంగదుడికి తన పొరబాటు తెలియవచ్చింది. అందువల్లనే, అతడు విశ్వనాధుణ్ణి కాటువేయలేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగంకలగగానే, బేతాళుడు శవంతో సహామాయమై, తిరిగి చెట్టెక్కాడు. - (కల్పితం)

[ఆధారం: ''వసుంధర'' రచన]






## అడవిలో అగ్నిజ్వాల



పలాస వృక్షాలు నిండిన అడవులు కొన్ని రుతువులలో అగ్ని జ్వాలలు వ్యాపించినట్టు కనిపిస్తాయి. ఆ వృక్షాలు పూచే ప్రకాశ వంతమైన నారింజరంగు పుష్పాల వల్ల ఈ భ్రాంతి కలుగుతుంది. రామాయణంలో అరణ్యవర్ణన ఘట్టం ఒకటి వుంది. వింధ్య పర్వతాల గుండా శ్రీరాముడు నడిచి వెళుతూన్నప్పుడు దూరంగా అగ్ని జ్వాలలు కనిపించాయనీ, తీరా దగ్గరికి వెళ్ళి చూస్తే అవి లేతఎరుపు పుష్పాలునిండిన అద్భుత పుష్పవనం అని ఆయన గ్రహించాడనీ ఆ వర్ణన తెలియజేస్తోంది. అందుకే పలాస పుష్పాలకు 'అరణ్య జ్వాలలు' అనే పేరు వచ్చింది. అడవులలో మార్చి నెలాఖరులో పూచే ఈ పుష్పాలు ఆ ప్రదేశానికి వింత కాంతిని ప్రసాదిస్తాయి. ఈ వృక్షాన్ని గురించిన ప్రస్తావన వేదాలలో కూడా కనిపిస్తుంది.

## అతి పెద్ద నివాసగృహం

ఇప్పుడు జోధ్‌పూర్‌గా పిలువబడే జోదాఘడ్ ఒకప్పుడు మేవార్ సంస్థానానికి రాజధానిగా ఉండేది. దానిని 1859వ సం.లో రావ్‌జోధా నిర్మించాడు. సూర్యరశ్మిని ప్రతిఫలింపజేసి, లోపలి భాగాలను చల్లగా ఉంచడానికి వీలుగా భవనాలన్నిటికీ లేత నీలం రంగు వేశారు. అందువల్ల దీనికి 'నీలం రంగు నగరం' అనే పేరు వచ్చింది. జోధ్‌పూర్‌లోని కోటలు, భవనాలు ఆనాటి ప్రాభవాన్ని, వారసత్వాన్ని చాటుతున్నాయి. ఇక్కడ సుప్రసిద్ధమైన ఉమేద్ భవన్ ఉంది. ప్రపంచంలోనే అతి పెద్ద వ్యక్తిగత నివాస గృహంగా దీనికి పేరుంది. ఇరవై ఆరు ఎకరాల స్థలంలో ఈ భవనం నిర్మించబడింది. పదిహేను ఉద్యాన వనాలూ; మూడువందలా నలభై యేడు బ్రహ్మాండమైన గదులూ ఈ భవనంలో ఉన్నాయి.



# ఉత్తమ రాజలక్షణం!

సువర్ణపురి రాజు సుబలదేవుడు పరాక్రమశాలి; రాజ్య కాంక్షాపరుడు. పొరుగున ఉన్న వ్రతశిలా రాజ్యంతో సువర్ణపురికి తరతరాలుగా పగ కొనసాగుతున్నది. ప్రస్తుత వ్రతశిలా రాజు సుధర్ముడు శాంతి ప్రియుడు. అయితే, మునుముందు కూడా ఇలాంటి పరిస్థితి కొనసాగగలదనే నమ్మకం సుబల దేవుడికి లేదు. ఇప్పుడు తనవద్ద శక్తివంతమైన సేనలు ఉన్నాయి గనక, పొరుగురాజ్యంపై దండెత్తి వెళ్ళి శత్రుశేషం లేకుండా చేయాలని ఆలోచించ సాగాడు.

ఇది సుబలదేవుడి రాణికి ఏమాత్రం నచ్చ లేదు. "ప్రభూ! శాంతి వర్ధిల్లుతున్నప్పుడు మనంగా దండెత్తి వెళ్ళడం భావ్యమవుతుందా? పైగా, వ్రత శిలారాజు ఇప్పుడు అనారోగ్యంతో బాధ పడుతున్నట్టూ, ఆయన మనమీద దాడి చేసే అవకాశం లవలేశం లేదనీ మన చారుల ద్వారా తెలియ వచ్చింది కదా. మైత్రి పెంపొందించుకోవలసిన సమయంలో కయ్యానికి కాలుదువ్వడం సబబేనా? ప్రభువులు మరొక్కసారి ఆలోచించండి," అని తన అభ్యంతరాన్ని సున్నితంగా తెలియజేసింది.

రాణిగారి అభిప్రాయంతో ఏకీభవించిన మహా మంత్రి, "అవును ప్రభూ. మునుపటి రాజు శత్రు భావంతో మనమీద కత్తికట్టిన మాట వాస్తవమే. అయితే, ప్రస్తుత పరిస్థితి దానికి పూర్తిగా భిన్నం. ఈనాటి రాజు సత్వ సంపన్నుడు; శాంతి ప్రియుడు. పైగా యుద్ధఫలితాలు ఎలా ఉంటాయో ఊహించ లేము. రాజు వ్యాధిగ్రస్తుడైవున్న మాట నిజమే. అయితే, ప్రజలు ఆయన పట్ల అపార గౌరవాభి మానాలు ప్రదర్శిస్తున్నారు. ఇంకా పసివాడైన యువరాజు సుశాంతుడంటే దేశ ప్రజలకు పంచ ప్రాణాలు. కాబట్టి ఒక వేళ మనం వాళ్ళ సేనలను ఓడించినప్పటికీ ప్రజలు తిరుగుబాటు చేయ



గలరు. అప్పుడు రాజ్యంలో శాంతి కరువవు తుంది,'' అన్నాడు.

''ఇప్పటి రాజు మరణించాక, అంతగా ప్రజాభిమానం చూరగొన్న యువరాజు సింహాసనాన్ని అధిష్ఠిస్తే, మునుముందు మనమీదికి దండెత్తి రాడన్న నమ్మకం ఏమిటి? మనం బలంగా వున్నప్పుడే శత్రుశేషం లేకుండా చేయడం క్షాత్రధర్మం. ఇక ప్రజల తిరుగుబాటు అంటారా? ఉక్కుపాదంతో అణచివేద్దాం. అంతే!'' అన్నాడు రాజు.

ఆ తరవాత సువర్ణపురి సైన్యం, వ్రతశిలా రాజ్యం మీదికి దండెత్తి వెళ్ళింది. అనారోగ్యంతో బాధపడుతున్నప్పటికీ వ్రతశిలారాజ్య రాజు సుధర్ముడు, స్వయంగా సైన్యాన్ని నడుపుతూ శత్రుసేనలను ఎదుర్కొన్నాడు. సుబలదేవుణ్ణి తీవ్రంగా గాయపరచి, అతడితో పోరాడుతూ వీరమరణం పొందాడు. సుబలదేవుడు వాంఛించిన విధంగానే యుద్ధంలో విజయం సాధించాడు. సువర్ణపురితో వ్రతశిలా రాజ్యాన్ని కలుపుకున్నాడు. అయినా, తాను సాధించిన విజయం ఆయనకు ఆనందం కలిగించ లేదు. యుద్ధంలో సుధర్ముడి ద్వారా కలిగిన గాయం ఎన్నివైద్యాలు చేసినా మానలేదు. దాంతో ఒక సంవత్సరం బాధపడి మరణించాడు.

సుబలదేవుడికి ఉన్నది ఒక్కగానొక్కకుమార్తె. మగ సంతానం లేదు. సద్గుణ సంపన్నుడైన ఒక యువకుణ్ణి దత్తత తీసుకోవాలని మహారాణి ఆశించింది. అలాంటి యువకుడి కోసం, మంత్రి ఆయన పరివారం, అన్వేషణ ప్రారంభించారు.

ఒకవారం గడిచింది. సుప్రసిద్ధ గురువు హేమచంద్రులు నడుపుతూన్న గురుకులాశ్రమానికి వెళ్ళి, అక్కడ విద్యనభ్యసిస్తూన్న యువకులను చూడడానికి మంత్రి, ఇద్దరు అనుచరులతో బయలుదేరాడు. ముగ్గురూ బాటసారుల్లా మారువేషాలు ధరించారు. వాళ్ళు గురుకులాశ్రమాన్ని సమీపించే సరికి సూర్యుడు పడమటి దిశకు చేరుకు



న్నాడు. బంగారం లాంటి లేతపసుపు ఎండలో విద్యార్థులు ఆడుకుంటున్నారు. దాపులనున్న చిన్న గుట్ట మీదికి ఎక్కి మంత్రీ, ఆయన అనుచరులూ ఆడుకుంటూన్న విద్యార్థులను జాగ్రత్తగా పరిశీలించసాగారు.

ఆ విద్యార్థుల బృందంలో ఒకడు చూడడానికి చాలా ముచ్చటగా ఎంతో హుందాగా ఉన్నాడు. సహవిద్యార్థులు అతడి పట్ల ప్రేమాభిమానాలు కనబరుస్తున్నారు. వాళ్ళందరూ ఆడుకుంటూండగా, హఠాత్తుగా ఎక్కడినుంచో ఒకరాయి రివ్వునవచ్చి, అతడి నుదుటికి తగిలింది. బొటబొటా రక్తం కారసాగింది. వెంటనే కొందరువెళ్ళి ఏవో ఆకులు కోసుకువచ్చి, వాటి పసరును గాయంపై పిండి కట్టుగట్టారు. మరి కొందరు మిత్రులు, ఆ రాయి వచ్చిన దిశగా వెళ్ళి, పొదకు ఆవలినుంచి దాన్ని విసిరినవాణ్ణి పట్టుకు వచ్చి తమ మిత్రుడి ఎదుట నిలబెట్టారు.

''ఇతన్ని తప్పక శిక్షించాలి,'' అన్నాడు ఒక విద్యార్థి.

"అవును. మనమూ రాళ్ళు విసిరి, అతని తలను గాయపరచాలి," అన్నాడు మరొక విద్యార్థి ఆవేశంగా.

అయితే, గాయపడిన వాళ్ళ నాయకుడు మాత్రం, అతనికేసి ప్రశాంతంగా చూస్తూ, "నువ్వు రాయిని ఎందుకు విసిరావు?" అని అడిగాడు.

"మరీ ఆకలి వేసింది. ఆ చెట్టుకొమ్మలో మాగిన జామపండు ఒకటి కనిపించింది. దానిని కొట్ట డానికి రాయి విసిరాను," అన్నాడు వచ్చిన మనిషి.

"జామపండు పడిందా?" అని అడిగాడా విద్యార్థి నాయకుడు.

"పడింది. దాన్ని అప్పుడే తినేశాను," అన్నాడా మనిషి.

"ఆకలి తీరిందనుకుంటాను, అవునా," అని అడిగాడు విద్యార్థి.

ఆ పెద్దమనిషి కాస్సేపు అటూ ఇటూ చూసి, "ఎలా తీరుతుంది? ఎలాగైనా అడవికి దాపుల నున్న గ్రామాన్ని చేరుకుని గుడిప్రసాదం తిని ఆకలి తీర్చుకుంటాను. ఆ జామపండే గనక తిన లేదనుకుంటే మాత్రం, ఇక్కడే శోషవచ్చి పడి పోయేవాణ్ణి," అన్నాడు.

"మాతో రా, మా గురుకులాశ్రమంలో భోజనం పెడతాం. చీకటి పడుతోంది. అడివి మార్గంలో ఇప్పుడు ఒంటరిగా వెళ్ళడం క్షేమంకాదు. తెల్ల వారాక వెళ్ళవచ్చు," అంటూ ఆ విద్యార్థి నాయకుడు ఆపెద్ద మనిషిని వెంట పెట్టుకుని గురు కులం వైపు నడవసాగాడు.

"ఏమిటి మిత్రమా! నీ తలను గాయపరచిన వాడికి సాయపడడమా?" అన్నాడు ఒక మిత్రుడు.

"అవును మిత్రమా. అతడు చెట్టు మీదికి రాయి విసిరినప్పుడు చెట్టు ఏం చేసింది? తన ఫలాన్ని ఇచ్చింది కదా! ఒక చెట్టే అలా చేయ గలిగినప్పుడు, మనిషినైన నేను అంతకన్నా మంచి పని చేయాలి కదా? చెట్టు పండునిచ్చింది. నేను భోజనం పెట్టి తీరాలి!" అన్నాడు వాళ్ళ నాయకుడు మందహాసం చేస్తూ.

"అద్భుతం! ఇదీ ఉత్తమమైన రాజలక్షణం! ఆ యువకుడు ఎవరై ఉంటాడు?" అని అడిగాడు వాళ్ళ సంభాషణ విన్న మంత్రి తన అనుచరులను.

ఆ తరవాత మంత్రి గురుకులాశ్రమానికి వెళ్ళి గురువుకు తానెవరైనదీ చెప్పి ఆ యువకుడి వివరాలడిగాడు. అతడు వ్రతశిలా రాజ కుమా రుడు సుశాంతుడని గురువు తెలియజేశాడు.

ఆ తరవాత మంత్రి, మహారాణి కోరిక ప్రకారం, వ్రతశిలా రాణిని దర్శించి సంగతి చెప్పాడు. ఇద్దరు రాణులూ కలుసుకున్నారు. సువర్ణపురి యువరాణి సువర్చలాదేవిని వ్రతశిలా రాజ కుమారుడు సుశాంతుడికిచ్చి ఘనంగా వివాహం జరిపారు. ఉభయ రాజ్యాలకూ రాజై, సుశాంతుడు ప్రజారంజకంగా చిరకాలం రాజ్యపాలన చేసి ఆదర్శ ప్రభువుగా కీర్తిగాంచాడు. - బిందుసార్



# వింత యాదృచ్ఛికాలు!




దాదాపు యాభైసంవత్సరాలకు పూర్వం అమెరికా దేశం నెబ్రాస్కాలోని బియాట్రిస్ అనే చిన్న పట్టణంలో ఒక అందమైన చిన్న చర్చ్ ఉండేది. రోజూ అక్కడ 'క్వాయర్' సంగీత బృందకళాకారులు నిర్ణీత సమయానికి వచ్చి పాటలుపాడి ప్రాక్టీస్ చేస్తూండేవాళ్ళు. సంగీత కళాకారులందరూ సమయపాలనపట్ల చాలా జాగ్రత్తవహించేవాళ్ళు.

అయితే, 1950 మార్చ్ 1వ తేదీ అక్కడొక ఘోరసంఘటన జరిగింది.

మతాధికారి వాల్టర్ క్లెంపెల్, ఎప్పటిలాగే ఆరోజు మధ్యాహ్నం చర్చ్‌కి వచ్చి సాయంకాలం క్వాయర్ సంగీత సాధనకు కావలసిన ఏర్పాట్లన్నీ చేసి వెళ్ళాడు. సాయంకాలం 7.15 గం.లకు సంగీత కళాకారులు వచ్చేసరికి బాగా చలిగా వుంటుంది గనక, చలిమంటను రగిలించి, భోజనానికి వెళ్ళాడు.

ఆయన సాయంకాలం 7.10 గం.లకు భార్యా, కూతుళ్ళతో కలిసి చర్చ్‌కి తిరిగి రావడానికి బయలుదేరాడుగాని, రాలేక పోయాడు. బయలుదేరే సమయంలో, బట్టలు నలిగిపోయి ఉన్నాయి. వాటిని ఇస్త్రీ చేస్తే తప్ప చర్చ్‌కి రానని ఆయన భార్య చెప్పడంతో వాళ్ళు బయలు దేరడంలో ఆలస్యమయింది. వాళ్ళు ఇంటి వద్ద ఉన్న సమయంలోనే ఆ అసాధారణసంఘటనసంభవించింది!

మెషినిస్ట్‌గా పనిచేసే హార్వీ ఆల్, భార్య దగ్గర లేకపోవడంతో తన ఇద్దరు కొడుకుల బాధ్యతను తనే చూసుకుంటు న్నాడు. అయితే, ఆరోజు అతడు అనుకోకుండా తన మిత్రుడితో ఆసక్తికరంగా మాటల్లో పడి సమయం గడిచిపోవడం గమనించలేదు. తీరా గడియారం చూసేసరికి అప్పటికే 7.15 దాటి పోయింది.

పియానిస్ట్ మేరీలిన్ పాల్, నిజానికి ఆరోజు అరగంట ముందే ప్రాక్టీసుకు వెళ్ళాలనుకుంది. అయితే, సాయంకాలం భోజనం చేశాక, చిన్న



మిసెస్ లియొనార్డ్ స్కుస్టర్, ఆమె చిన్నారి కూతురూ సమయానికి క్వాయర్‌కు చేరుకుని ఉండేవారే. అయితే ఆరోజు సాయంకాలం ఆమె తన తల్లిని చూడడానికి వెళ్ళింది. అందువల్ల అక్కడ ఆలస్యమై పోయింది. ఆ తల్లీ కూతుళ్ళు చర్చ్‌ని సమీపించడానికి ముందే ఆ భీకర దుర్ఘటన జరిగిపోయింది!

లేథ్ ఆపరేటర్ హెర్బర్ట్ కిఫ్ మామూలుగా అందరికన్నా అరగంట ముందే చర్చికి వచ్చేవాడు. అయితే, ఆ రోజు బయలుదేరే ముందు అసంపూర్తిగా ఉన్న ఉత్తరం రాయడానికి కూర్చున్నాడు. అతడు తన ఇంట్లో ఉత్తరం రాస్తున్నప్పుడే ఆ వింత సంఘటన జరిగింది!

ఇంతకూ ఆ రోజు, అంటే 1950 మార్చ్ 1 సాయంకాలం ఏం జరిగిందో తెలుసా? మామూలుగా క్వాయర్ పాట కచేరీ ఒద్దిక సరిగ్గా సాయంకాలం 7.15 గం.లకు ఆరంభమయ్యేది. ఆ రోజు ఆ సమయానికి పది నిమిషాలు తరవాత అంటే సరిగ్గా 7.25 గంటలకు, బియాట్రిస్ పట్టణమంతా మారు మోగిన పేలుడు సంభవించింది. సాయం సంధ్య ఆకాశంలో అగ్ని ఖండాలు సుడులు తిరిగాయి. క్వాయర్‌పాటకచేరీ ప్రాక్టీస్ చేసే చర్చ్ గోడలు నేల కూలాయి. కలపతో నిర్మించిన పైకప్పు భీకర శబ్దంతో నేలకు ఒరిగింది!

అదృష్టవశాత్తు చర్చ్ ఖాళీగా ఉంది. సమయ పాలనకు పేరుగాంచిన క్వాయర్ బృందసభ్యులు ఒక్కరంటే ఒక్కరు కూడా అక్కడ లేకపోవడం విశేషం. ఒక్కొక్కరు ఒక్కొక్క కారణంతో సమయానికి అక్కడికి చేరుకోలేకపోయారు. రేడియో కార్యక్రమం వినడం, నలిగిన బట్టలు ఇస్త్రీ చేయడం, అసంపూర్తిగా ఉన్న ఉత్తరం పూర్తి చేయడం, లెక్కలు వేయడంలో నిమగ్నమవడం, కునుకు తీయడం, కారుస్టార్ట్ కాకపోవడం వంటి అతిసాధారణమైన కారణాలవల్ల వాళ్ళు సమయానికి బయలుదేరలేక పోయారు. ఇది ఎలా జరిగింది? కేవలం అన్నీ యాదృచ్ఛికాలేనా? లేక వీటన్నిటికీ వెనక ఏదైనా అదృశ్యశక్తి పనిచేసిందా? అన్నది నిగూఢ రహస్యంగానే మిగిలిపోయింది!

అదిసరే. మరి చర్చ్ పేలిపోవడానికి కారణం ఏమిటి? కారణం ఇదమిత్థంగా నిర్ధారించబడలేదు. అయితే, అగ్నిమాపకదళం మాత్రం - వెలుపలవున్న విరిగిన పైపు నుంచి సహజ వాయువు వెలువడి చర్చిలోకి వెళ్ళివుంటుంది. లోపల రగులుతూన్న చలిమంట కొలిమి నుంచి నిప్పంటుకుని భారీపేలుడు సంభవించి ఉండవచ్చని అభిప్రాయపడింది.



ఆ రోజు సాయంకాలం తమకు జరిగిన సంఘటనలను తలుచుకున్నప్పుడు క్వాయర్ బృంద సభ్యుల హృదయాలు దేవుడి పట్ల కృతజ్ఞతతో పొంగిపొరిలాయి. దేవుడి అద్భుతమే తమ ప్రాణాలను రక్షించిందని వాళ్ళు ప్రగాఢంగా విశ్వసించారు!

మీరూ అలాగే అనుకుంటున్నారా?

## నాగాలాండ్ జానపదకథ

# అత్తిమాను దయాగుణం - అపూర్వ కృతజ్ఞత!

నాగాలు చాలాకాలం క్రితం చేసిన వాగ్దానం కారణంగా, ఈనాటికీ అత్తిచెట్టును నరికి పడ గొట్టరు. దానికి సంబంధించిన ఒక విచిత్ర కథ ప్రాచుర్యంలో ఉంది:

ఒకానొకప్పుడు ఒక నాగాయువకుడు, దూర ప్రాంతానికి వెళ్ళి కొండలూ, కోనలూ నిండిన భీకర అరణ్య ప్రాంతం గుండా స్వగ్రామానికి తిరిగివస్తున్నాడు. ఆ కీకారణ్య ప్రాంతంలో దయ్యాలూ, భయానకమైన నల్లటి ప్రాణులూ తిరుగాడుతూ ఉండేవి. రాత్రివేళల్లో వీటి అపాయం మరీ ఎక్కువ. ఆ ప్రాణులకు పదునైన కత్తులూ, కఠారులు అంటే భయం గనక, అవి మనుషుల మీదికి వెనకనుంచే దాడిచేస్తాయని ఆ యువకుడికి తెలుసు. అయితే, ఆ క్రూర ప్రాణులు ఒక్కసారి పట్టుకుంటే, ఏమాత్రం కనికరం లేకుండా మనుషుల్ని అమాంతం మింగకుండా వదిలిపెట్టవని కూడా ఆ యువ కుడికి తెలుసు.

పొద్దువాలుతూండగా పెద్దపెద్ద కోరలూ, భయంకరమైన కళ్ళూ గల ఒక పొట్టిదయ్యం వెనకనుంచి వచ్చి ఆ యువకుణ్ణి పట్టుకో బోయింది. దానిని గ్రహించిన ఆ యువకుడు మెరుపులా వెనుదిరిగి క్షణంలో దాన్ని తన కత్తితో ముక్కలు ముక్కలుగా నరికాడు.



చీకటి పడుతూన్న కొద్దీ ఆ యువ కుడిలో రకరకాల ఆలోచనలు తలెత్త సాగాయి. రాత్రయ్యే కొద్దీ దయ్యాలు బలం పుంజుకుని పెట్రేగిపోతాయి. వాటన్నిటినీ ఒంటరిగా ఎదుర్కొని హత మార్చడం అంత సులభం కాదు. కాబట్టి ఈరాత్రికి ఎక్కడైనా తలదాచుకోవ డమే వివేకం అనిపించింది.

ఎదురుగా తెల్లటిపువ్వులు, నల్లటి కాండంగల కొండతుమికి చెట్టు కనిపించింది. గుబురుగా ఉన్న ఆ చెట్టు మీద సులభంగా

దాక్కోవచ్చున్న ఉద్దేశంతో అతడు దాన్ని సమీపించి, "నా మీద కరుణించి ఈ రాత్రికి నీ కొమ్మల మధ్య నన్ను దాక్కో నివ్వు. నువ్వు ఆశ్రయం ఇవ్వలే దంటే, ఆ నల్లటి దయ్యాలు వచ్చి నన్ను చంపేస్తాయి," అన్నాడు.



కొండతుమికచెట్టు కొమ్మలనూ రెమ్మలనూ అటు ఇటూ ఊపుతూ, "క్షమించు. నేనాపని చేయలేను. నేను నీకు ఆశ్రయమిచ్చిన సంగతి ఆ దయ్యాలకు తెలిస్తే, నా కొమ్మ లనూ, రెమ్మలనూ విరిచి ఛిన్నాభిన్నం చేయగలవు. ఆ తరవాత నా గతేమవు తుంది? నువ్వు మరేచోటైనా చూసుకో," అన్నది భయం భయంగా.

చీకటి దట్టమవుతోంది. యువకుడు వేరెక్క డైనా చోటు చూసుకోవాలన్న ఆతృతతో, మరొక చెట్టువద్దకు వెళ్ళి, "దయతలచి రాత్రికి తల దాచుకోవడానికి చోటిస్తావా? దయ్యాల కంట బడితే నన్ను హతమార్చకుండా వదిలిపెట్టవు," అని వేడుకున్నాడు.

"క్షమించు మిత్రమా! నాకేమో నీకు సాయ పడాలనేవుంది. అయినా ఆ శక్తి నాకు లేదు. మా జాతి వృక్షాలు మనుషులకు ఆశ్రయమివ్వ కూడదు. మరెక్కడికైనా వెళ్ళు," అన్నది ఇను ములా చేవబారిన ఆ చెట్టు, కత్తులలాంటి తన ఆకులను ఆడిస్తూ.

దాపులనే ఒక బ్రహ్మాండమైన అత్తిమాను కనిపించింది. ఆ యువకుడు చెట్టు చెట్టుకూ వెళ్ళి మొరపెట్టుకోవడం అది చూసింది. వాడిపై జాలిపడి, "ఇలా, రా నాయనా," అని పిలిచింది.

యువకుడు ఆశ్చర్యంతో దానికేసి చూశాడు.

"పెద్ద పెద్ద నా కొమ్మలు చాలా దృఢమైనవి. గుబురుగా ఉన్న కొమ్మలు నిన్ను ఈ రాత్రికి ఆ చీకటి దయ్యాలనుంచి కాపాడగలవు. ఆ దయ్యాల్లో ఒకదాన్ని నువ్వు చంపావు గనక, అవి పగబట్టి నీ కోసం తప్పక వెతుక్కుంటూ వస్తాయి. అయితే, నువ్వు మాత్రం ఏమాత్రం చప్పుడు చేయకుండా కొమ్మలమాటున దాక్కో. తక్కిన వ్యవహారం నేను చూసుకుంటాను అన్నది," అత్తిమాను.

వెంటనే యువకుడు చక చకా చెట్టెక్కి, గుబురు కొమ్మల చాటున గుట్టు చప్పుడు కాకుండా దాక్కున్నాడు. మెల్లమెల్లగా అరణ్య మంతా గాఢాంధకారం అలముకున్నది. అక్క డక్కడ కీటకాల కీచుధ్వనులు తప్ప భయానక మైన నిశ్శబ్దం ఆవరించింది.

మరికొంతసేపటికి కొన్ని పొట్టిదయ్యాలు వింత వింత ధ్వనులు చేస్తూ తమ సోదరుణ్ణి

చంపిన ఆ యువకుణ్ణి వెతుక్కుంటూ వచ్చాయి.

"ఎక్కడ ఆ దుర్మార్గుడు? ఎక్కడ దాక్కున్నాడు పిరికివెధవ?" అని కేకలు పెడుతూ ప్రతి చెట్టునూ చుట్టివచ్చాయి.

"మా సోదరుణ్ణి హతమార్చిన ఆ నీచుడు ఎక్కడున్నాడో చెప్పండి? వాణ్ణి ఇప్పుడే ఖండ తుండాలుగా నరకాలి," అన్నది ఆవేశంగా ఒక దయ్యం.

"వాణ్ణేకాదు. వాణ్ణి దాచిన వాళ్ళను కూడా ముక్కలు ముక్కలుగా నరికి పోగులుపెడతాం. ఎక్కడ వాడు? ఎక్కడ వాడు?" అంటూ పైకీ కిందికీ గెంతసాగింది ఇంకొక దయ్యం.

ఎంతకూ సమాధానం రాకపోయేసరికి దయ్యాలన్నీ కలిసి భీకరంగా కేకలు పెట్టాయి. నానా గొడవ చేశాయి. "ఎక్కడ వాడు?" అని అరిచాయి ఒక్కసారిగా.

"మాకు తెలియదు," అన్నాయి చెట్లు భయంతో వణుకుతూ.

ఆఖరికి అవి యువకుడు దాగివున్న అత్తి మాను వద్దకు వచ్చి, "ఆ దుర్మార్గుడెక్కడున్నాడో నీకు తెలుసా?" అని అడిగాయి.

"వాడిక్కడలేడు. ఎక్కడికి వెళ్ళాడో నాకు తెలియదు. బహుశా ఆవలివైపు అరణ్యంలో ఉన్నాడో, ఏమో. అక్కడికివెళ్ళి వెతికిచూడండి," అన్నది అత్తిమాను ఏమాత్రం తడబాటు లేకుండా.

దయ్యాలు పగసాధించాలన్న ఆవేశంతో కేకలు పెడుతూ అక్కడినుంచి వేగంగా వెళ్ళిపోయాయి.

తూరుపు దిక్కున అరుణోదయం అవుతూండగా యువకుడు, చెట్టుకొమ్మలపై నుంచి కిందికి దిగి వచ్చి, అత్తిచెట్టును కృతజ్ఞతతో కౌగిలించుకుని, "నువ్వు చేసిన ఈ మహోపకారం నా జీవితాంతం మరిచిపోను," అన్నాడు.

ఆ తరవాత అతడు స్వగ్రామం చేరి, అరణ్యంలో తను ఎదుర్కొన్న ఆపదగురించీ, అత్తిమాను చేసినమహోపకారం గురించీ, దాని దయాగుణం గురించీ గ్రామస్థులందరికీ చెప్పాడు.

ఆ రోజు సాయంకాలం ఆ యువకుడు క్షేమంగా తిరిగి వచ్చినందుకు గ్రామంలో విందు ఏర్పాటు చేశారు. ఆ సందర్భంగా ఆ యువకుడు అత్తిమానుకిచ్చిన మాటను ప్రతి ఒక్కరూ పాటించాలని నిర్ణయించారు. దాని పట్ల కృతజ్ఞతతో, అత్తిచెట్టును ఎప్పటికీ నరకరాదని ఒక నియమం ఏర్పాటు చేశారు.

అందుకే, ఈనాటికీ అత్తిచెట్టు పొలం మధ్య ఉన్నప్పటికీ, నాగాలు దానిని పడగొట్టరు!



# గాంధీజీని గురించి 24 గం. ల సుదీర్ఘ వ్యాసం!




జాతిపిత మహాత్మాగాంధీని గురించి ఎందరో ఎన్నెన్నో వ్యాసాలు, గీతాలు, గ్రంథాలు రచించారు. గాంధీజీ కూడా మంచి రచయిత. హరిజన్ పత్రికలోనే కాకుండా ఇతరత్రా కూడా దేశం గురించి నిరంతరాయంగా రచనలు వెలువరిస్తూండేవారాయన. ఇక ప్రస్తుత విషయానికి వస్తే, చెన్నయ్ నగరానికి చెందిన 11వ తరగతి చదివే ఇ. నందిని అనే ఒక పాఠశాల విద్యార్థిని మహాత్మాగాంధీని గురించి ఏకధాటిగా 24 గంటల సేపు కూర్చుని సుదీర్ఘ వ్యాసంరాసి సరికొత్త రికార్డు సృష్టించింది.

ఆమె వ్యాసం రాయడానికి చెన్నయ్, అడయార్‌లోని ప్రశాంతమైన గాంధీమండపాన్ని ఎంపికచేసుకున్నది. ఫిబ్రవరి 12వ తేదీ ఉదయం 10గం. లకు ప్రారంభించిన రచనా 'యజ్ఞాన్ని' మరునాడు 10 గంటలకు పరిసమాప్తి చేసింది. ఆమె తన వ్యాసరచనకు ఎలాంటి ముద్రిత సమాచారాన్నీ ఉపయోగించలేదు. అంతా తన జ్ఞాపకశక్తి నుంచే రాసింది. గాంధీజీని గురించి ఇంతపెద్ద వ్యాసం రాయడానికి ఆ అమ్మాయి ఎంత చదివివుంటుందో ఊహిస్తే ఆశ్చర్యం వేస్తుంది!

# నిరంతరాయ ఇంద్రజాలం!

తమిళనాడు తిరుచిరాపల్లిలో ఎ. అలెగ్జాండర్ అనే ఐంద్రజాలికుడు 24 గంటలపాటు నిరంతరాయంగా ఒక 'మెగా మ్యాజిక్‌షో' నిర్వహించి అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేశాడు. గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో చోటు సంపాయించాలన్నది ఆయన ఆశయం. లండన్‌లోని 'గిన్నిస్‌బుక్' ప్రచురణ కర్తలు-విలక్షణమైన ఈ మ్యాజిక్ షోను వీక్షించి దాని ప్రామాణికతను తెలియజేయమని 'ఇండియన్ మ్యాజిక్ అసోసియేషన్‌నూ, 'ఇంటర్నేషనల్ బ్రదర్‌హుడ్ ఆఫ్ మెజీషియన్స్'నూ ఆదేశించారు. విలక్షణమైన ఈ ప్రదర్శన-వివిధ రంగాలకు చెందిన ప్రముఖులు, ప్రభుత్వ అధికారులు, పత్రికా ప్రతినిధుల సమక్షంలో జరిగింది.





# జీవితం అంటే...

స్వామినాథుడికి, తన ఇరవయ్యేళ్ళ వయసులో అనుకోకుండా, తల్లిదండ్రులిరువురూ అకాల మరణానికి గురవ్వడంతో, వాళ్ళు సంపాదించిన ఆస్తికి అతడు ఏకైక వారసుడయ్యాడు.

స్వామినాథుణ్ణి చిన్నప్పటి నుంచీ అతని తల్లిదండ్రులు ఏ కష్టమూ తెలియకుండా గారాబంగా, ప్రేమగా పెంచడం వలన, అతనికి కష్టపడి పని చేసి డబ్బు సంపాదించడం అంటే ఏమిటో తెలియదు.

అయితే, స్వామినాథుడు బుద్ధిమంతుడు, సాధుహృదయం కలవాడు. ఎవరేమి అన్నా అతిగా చలించి బాధపడే అతి సున్నితమైన మనసు అతనిది. నిజానికి అతను, తన తల్లిదండ్రులను అమితంగా ప్రేమించాడు. అందుకే వాళ్ళ మరణాన్ని భరించలేక పోయాడు.

క్రమంగా నిద్రాహారాలను మానివేసి పగలూ రేయీ వాళ్ళను తలచుకుంటూ కుమిలిపోతూ కాలం గడపసాగాడు. అతడి బంధువులు, స్నేహితులు అతనికి ఎన్నో విధాలుగా నచ్చజెప్ప చూశారు. జీవితం చాలా విలువైందనీ, పొద్దస్తమానం పోయిన వాళ్ళ కోసం దుఃఖిస్తూ కూర్చున్నంత మాత్రాన వాళ్ళు తిరిగిరారనీ, వాళ్ళ ఆత్మలకు సంతృప్తి కలగాలంటే, జీవితంలో పైకి వచ్చి చక్కగా సంసార జీవితం గడపాలనీ వాళ్ళు బోధించారు.

కానీ, స్వామినాథుడు ఎవరి మాటా వినలేదు. అలాంటి సమయంలో, కొందరు స్వార్థపరులూ, అవకాశవాదులైన యువకులు అతనికి కల్లబొల్లి మాటలు చెప్తూ దగ్గరై అతన్ని మభ్యపెట్టి, అతని ద్వారా తమ అవసరాలకు డబ్బు విపరీతంగా ఖర్చు చేయించసాగారు.

ఇలా వుండగా, రామదాసు అనే ఒకాయన స్వామినాథుడి ఇంటికి ఒక రోజున వచ్చాడు. స్వామినాథుడాయన్ను ఎగాదిగా చూసి,

కోలపల్లి ఈశ్వర్

"మీరెవరు? ఏం పని మీద వచ్చారు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు రామదాసు చిరునవ్వు నవ్వి, "నేను నీకు దూరపుబంధువును, వరసకు బాబాయినవుతాను, నాయనా! మాది రామ నగరం. నీ పరిస్థితి తెలిసి, చూసిపోదామని వచ్చాను," అన్నాడు.

ఆ జవాబు వింటూనే స్వామినాథుడు, తన తల్లిదండ్రుల గురించి చెప్పి, ఏడవ నారంభించాడు.

"ఊరుకో నాయనా! నీ దుఃఖం తీరే మార్గం నేచెబుతాను, నా మాట వింటావా మరి?" అన్నాడు రామదాసు.

స్వామినాథుడు కళ్ళు తుడుచుకుంటూ, "అలాగే చెప్పండి!" అన్నాడు.

"ఇక్కడ ఉంటే నీకు పాతజ్ఞాపకాలతో మనశ్శాంతి వుండదు. నాతో పాటు మా ఊరికి రా! అక్కడ ఒక పెద్ద భవంతి అమ్మకానికి వుంది. ఎంతో హాయిగా ఉండవచ్చు," అన్నాడు రామదాసు.

మర్నాడు ఇద్దరూ రామదాసు ఊరైన రామనగరానికి బయల్దేరారు. భవనం చౌకగా వస్తుందనీ, వెంటనే కొనడం బావుంటుందనీ రామదాసు చెప్పడంతో, స్వామినాథుడు చాలా పెద్దమొత్తం డబ్బుతో బయల్దేరాడు.

వాళ్ళెక్కిన గుర్రపు బండి, ఇంకా రామ నగరానికి కోసెడు దూరంలో వుందనగా, హఠాత్తుగా నలుగురు దొంగలు బండిని అటకాయించి, కత్తులతో రామదాసునూ, స్వామినాథుణ్ణీ బెదిరించి డబ్బు దోచుకుని పారిపోయారు.



స్వామినాథుడు నెత్తీ నోరూ బాదుకుంటూ కళ్ళనీళ్ళతో, "ఏమిటి, బాబాయ్, ఈ ఘోరం!" అంటూ వున్నచోటునే కూలబడ్డాడు.

రామదాసు, అతణ్ణి లేవనెత్తి ధైర్యం చెబుతూ, "అంతగా విచారించకు!" అని బండిని తిరిగి స్వామినాథుడి ఊరికి ప్రయాణం కట్టించాడు.

ఇప్పుడు స్వామినాథుడికి ఆస్తిపాస్తులంటూ ఒక ఇల్లు తప్ప మరేం లేదు. ఆ ఇల్లు అమ్మాలన్న ఆలోచన అతడికి రాలేదు. ఇల్లు అమ్ముకుంటే, తనకు నిలవ నీడ ఉండదని, అతనికి తెలుసు. ఇప్పుడు అతనికి పట్టిన దిగులు ఎలా బ్రతకాలి? ఎలా డబ్బు సంపాదించాలన్నదే!

రామదాసు, అతడికి అంతగా విచార పడవద్దని చెప్పి, "స్వామినాథా! నేను మా



ఊరికి పోయి కొంత డబ్బు తెస్తాను. దానితో కొంత వ్యవసాయయోగ్యమైన పొలం నీ కోసం కొంటాను. అలా వ్యవసాయం చేసుకుంటూ నువ్వు బ్రతకవచ్చు. కొంత కాలం పాటు నేనూ, నీకు తోడుగా ఇక్కడే ఉంటాను,'' అన్నాడు.

అన్న మాట ప్రకారం, రామదాసు డబ్బు తెచ్చాడు. అమ్మకానికి ఊరు దగ్గర్లో వున్న పొలాన్ని గ్రామాధికారి సాయంతో కొన్నాడు. అందులో, రామదాసుతో పాటు స్వామినాథుడు కూడా పగలూ, రాత్రీ అని చూడకుండా కష్టపడి పని చేయసాగాడు. వంట పనులూ, ఇతరత్రా ఇంటిపనుల్లో కూడా, ఇద్దరూ శ్రమిస్తూండేవాళ్ళు.

ఒకనాటి సాయంకాలం వేళ, వాళ్ళిద్దరూ వంట పనుల్లో నిమగ్నమై ఉండగా, గ్రామాధికారి కూతురు పదిహేడేళ్ళ గౌరి అక్కడికి వచ్చి, వాళ్ళను చూస్తూనే ఆశ్చర్యంగా, ''అయ్యయ్యో! ఈ వంటా వార్పుల్లో, మగవాళ్ళు మీరు చేయి కాల్చుకుంటున్నారా? ఎవరో చెప్పగా, మా నాన్న పంపాడు. రేపటి నుంచీ మా వంటమనిషి చెల్లెల్ని మీ వంట పనులూ అవీ చేసేందుకు పంపుతాను,'' అని ఇంటిలోని అన్ని గదులూ తిరిగి చూసి వెళ్ళిపోయింది.

సంవత్సరం గడవకుండానే పొలాల్లో వరి బాగా పండింది. స్వామినాథుడూ, రామదాసూ ధాన్యాన్ని బస్తాల్లో నింపి, బళ్ళమీద ఇంటికి చేర్పించారు. స్వామినాథుడి ఆనందానికి అవధుల్లేవు. అది గమనించిన రామదాసు, ఆప్యాయంగా అతడి భుజం తట్టి, ''స్వామినాథా! నీలో వచ్చిన మార్పు నువ్వు గమనించావనుకుంటాను. ఆరేడు నెలల కాలంగా నువ్వు నీ తల్లిదండ్రుల గురించి విచారపడుతూండడం మానేశావు. పోయినడబ్బు గురించీ, నీ భావిజీవితం గురించే ఆందోళన పడ్డావు,'' అన్నాడు.

''అవును, నిజమే!'' అన్నాడు స్వామినాథుడు ఆశ్చర్యపోతూ.

దానికి రామదాసు తృప్తిగా తలాడించి, ''ఇదే జీవితమంటే! మనిషికి అన్నింటి కంటే ముఖ్యమైన అవసరం ఆకలి తీరడం. కడుపు నిండా తిని, అన్నీ అమరినప్పుడు అనవసరమైన ఆలోచనలతో కాలాన్ని వ్యర్థం చేసుకుంటాము. అందుకే, మనిషి ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూండాలి. డబ్బు సంపాదిస్తుండాలి. తను బాగుపడి ఇతరులకు

సాయపడాలి. అప్పుడు ఏ దుఃఖమూ దరి చేరదు,'' అన్నాడు.

''అవును బాబాయ్!'' అన్న స్వామినాథుడితో మళ్ళీ, ''ఇప్పుడు నీకు విడమరచి చెప్పవలసిన చిన్న రహస్యం ఉన్నది. నేను నీకు దూరపు బంధువైనట్టే, గ్రామాధికారి గంగరాజు కూడా నాకు దూరపు బంధువే. మీ నాన్న అంటే ఆయనకు చాలా అభిమానం. నువ్వు తల్లిదండ్రులు పోయారన్న దుఃఖంతో పాటు స్వార్థపరుల గుప్పిట్లో చిక్కుకున్నావని తెలిసిన గంగరాజు, నాకు, నీ గురించిన అన్ని విషయాలు మనిషి ద్వారా కబురంపాడు. నేను వెంటనే బయలుదేరి వచ్చాను. మనం మా ఊరుకు వెళుతున్నప్పుడు బండినాపి డబ్బు దోచుకుపోయిన వాళ్ళు దొంగలు కాదు, ఆయన నియమించిన మనుషులు. ఆ డబ్బు ఆయన దగ్గర నిక్షేపంలా ఉన్నది.

ఆయన కూతురు గౌరిని చూశావు గదా, వంట మనిషిని పంపి, మనకు చాలా సాయం చేయడమేగాక, ఆ వంటకాలెలా ఉన్నాయో అని అప్పుడప్పుడూ వచ్చి చూసి పోతున్నది కూడా!'' అంటూ ఓ క్షణం ఆగి, ''తెలియకడుగుతాను, ఇంతకీ ఆ గౌరిని గురించి నీవేమనుకుంటున్నావు?'' అని అడిగాడు రామదాసు.

''చక్కని అమ్మాయి, చురుకైన అమ్మాయి, చాలా కలుపుగోలున్న పిల్ల,'' అన్నాడు స్వామినాథుడు, ఆ మాటలనేందుకు మొహమాటపడుతున్నట్టు.

ఆ జవాబుకు రామదాసు పెద్దగా నవ్వి, ''గంగరాజు తన కూతురు గౌరి గురించి నీ అభిప్రాయం ఏమిటో తెలుసుకునేందుకు చాలా కుతూహలపడుతున్నాడు, ఇప్పుడు తెలిసింది! నీకు గౌరి నచ్చింది. గౌరికి నీవు నచ్చావు. ఈ సంగతి గంగరాజుకు చెబుతాను. సాధ్యమైనంత త్వరలో మంచి ముహూర్తం చూసి గౌరితో నీ వివాహం జరుగుతుంది!'' అన్నాడు.

ఆ తర్వాత కొద్ది రోజులకు గౌరీ, స్వామినాథుల వివాహం ఘనంగా జరిగింది. రామదాసు తరచుగా వచ్చి చూసి పోతానని స్వామినాథుడికి చెప్పి, సంతోషంగా తన ఊరు వెళ్ళిపోయాడు.



# పట్టుదల!

రంగనాథుడికి పన్నెండేళ్ళవయసువచ్చినా, వాడికి గురుకులంలో ఏమాత్రం చదువు అబ్బడంలేదు. ఆమధ్య జరిగిన అతి తేలికైన పరీక్షల్లో కూడా వాడు తప్పికూర్చున్నాడు. దానితో వాడికి బాధలు మొదలయ్యాయి.

తండ్రి, వాడిని ఎందుకూ పనికిరాని వెధవా అని తిట్టాడు. ఇదివరకు తను ఏదికోరితే అదివండిపెట్టే తల్లి, ఇప్పుడు వేళకు అన్నంకూడా సరిగా పెట్టడంలేదు. ఇదంతా రంగనాథుడికి చాలా బాధ కలిగించింది. కానీ, తిరిగి పరీక్షకు తయారవ్వాలంటే చిరాకు, విసుగు కలుగుతున్నది.

ఒకరోజు వాడు దిగులుగా ఇంటి అరుగు మీద కూర్చున్నాడు. క్రితంరోజు మిత్రులతో కలిసి ఆడుతూంటేరాయితగిలి, వాడి కుడికాలుబొటన వేలికి చిన్నగాయమైంది. దాని మీద ఈగ ఒకటి వాలి బాధకలిగిస్తున్నది. దాన్ని ఎంత తోలినా పోయినట్టేపోయి, తిరిగివస్తున్నది. దానితో వాడుపట్టరానికోపంతో, "ఛీ, ముదనష్టపుదానా!" అంటూ అరిచాడు.

ఆ సమయంలో వీధిన పోతున్న ముకుందం అనే అధ్యాపకుడు, రంగనాథుడి అరుపువిని, వాణ్ణి అడిగి సంగతి తెలుసుకుని, "చూడు, రంగా! అల్పజీవి అయిన ఒక చిన్న ఈగకే తనకు కావలసినదానిపై అంతపట్టుదలవుంటే, అన్ని జీవులకంటే తెలివైన, శక్తికలిగిన మనిషి కెంత పట్టుదల వుండాలో చెప్పు?" అన్నాడు.

ఆ మాటలువింటూనే రంగనాథుడు ఆలోచనలో పడ్డాడు. అంతే! ఆరోజు నుంచీ మనసులగ్నం చేసి, పట్టుదలతో చదివాడు. నెలరోజుల తర్వాత పరీక్షకువెళ్ళి ప్రశ్నలన్నింటికీ తగుజవాబులురాసి ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు.

– కె. చిన్నబాబు



# పాఠకులకు కథల పోటీ
## ఉత్తమ రచనకు రూ. 250 బహుమతి

ఈ కింది కథను చదవండి:

విజయపురి రాజు విజయేంద్రుడు ప్రజల బాగోగులను స్వయంగా తెలుసుకోవడానికి తరచూ మారువేషంలో దేశాటన చేసేవాడు. అలావెళ్ళినప్పుడు రాత్రి పూట పలువురు పిల్లాజల్లతో కలిసి వీధులకు ఇరువైపులా, చెట్లకిందా పడుకుని నిద్రించడం చూసి ఆయన బాధపడ్డాడు. అలాంటి పేదలకు ఇళ్ళు కట్టించాలని సంకల్పించాడు. ఇళ్ళు కావలసిన వాళ్ళం దరూ ఫలానారోజు రాజభవనం ముందు సమావేశం కావాలని చాటింపు వేయించాడు.

ఆరోజు రానే వచ్చింది. రాజభవనం ముందు వేలాదిమంది గుమిగూడారు. వాళ్ళందరికీ చాలినన్ని ఇళ్ళు నిర్మించడానికి కావలసినన్ని వనరులులేవు. పరిస్థితిని తలుచుకుని రాజు విచారగ్రస్తుడయ్యాడు. దానిని గమనించిన మంత్రి పరిష్కారం సూచించాడు. మంత్రి సూచించిన ఆ పరిష్కారమార్గం ఏదో మీరు ఊహించగలరా?

- వచ్చిన వాళ్ళందరినుంచీ కొంత డబ్బును కోరాడా?
- ఇళ్ళ నిర్మాణంలో వాళ్ళను శ్రమదానం చేయమని కోరాడా?
- డబ్బూ, శ్రమదానం ఈ రెండూ కాదంటే, మరి ఏం కావాలని మంత్రి అడిగివుంటాడు?

100-150 మాటలతో కథకు ముగింపురాసి మాకు పంపండి. కవరు మీద 'కథల పోటీ'కి అని రాయండి. కింది కూపన్‌ను తప్పక జతచేయండి.

**కథలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ: మే 31, 2004**

పేరు ---------------------------- వయసు -------- పుట్టిన తేదీ ----------

పాఠశాల ---------------------------------- తరగతి ---------------

ఇంటి చిరునామా ------------------------------------------------

----------------------------------------------------------------

---------------------------------------- పిన్‌కోడ్ -------------

తల్లి/తండ్రి సంతకం విద్యార్థి/విద్యార్థిని సంతకం

**చందమామ ఇండియా లిమిటెడ్**

82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097



# చిన్నశెట్టి శిష్యుడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని ఏలుతుండగా బోధిసత్వుడు శ్రేష్ఠికులంలో పుట్టి, "చిన్న శెట్టి" అని పిలవబడ్డాడు. ఆయన బుద్ధి మంతుడూ, శకునశాస్త్రం క్షుణ్ణంగా తెలిసిన వాడూనూ.

ఒకనాడు చిన్నశెట్టి రాజసభకు వెళుతూ, ఒక చచ్చిన ఎలుకను చూసి, "ఒక తెలివి గల యువకుడు ఈ చచ్చిన ఎలుకతో వ్యాపారం ప్రారంభించి, పెళ్ళి చేసుకోవచ్చును," అన్నాడు.

ఈ మాటలు అటుకేసి వెళుతూన్న ఒక యువకుడి చెవుల పడ్డాయి. అతను మంచి కుటుంబంలో పుట్టినవాడే, కాని చాలా పేదవాడు.

ఆ యువకుడు చచ్చిన ఎలుకను తీసుకు పోయి, పిల్లికి ఆహారం కింద ఒక కానీకి ఏదో దుకాణంలో అమ్మాడు.

అతను ఆ కానీకి బెల్లంగడ్డ కొని, ఒక కుండెడు మంచినీళ్ళు కూడా తీసుకుని, అడవికి వెళ్ళే మార్గంలో కూర్చున్నాడు. అడవి నుంచి పూలుతెచ్చే మాలాకారులకు అతను కొంచెం కొంచెం బెల్లం పెట్టి, తాగటానికి నీరు ఇచ్చి, వారి వద్ద నుంచి గుప్పెడు, గుప్పెడు పూలు పుచ్చుకున్నాడు.

తరవాత అతను ఆ పూలు అమ్మి డబ్బు చేసుకున్నాడు.

మర్నాడు అతను మరింత ఎక్కువ బెల్లం తీసుకుని, మంచి నీటితో మళ్ళీ అదే చోటికి వెళ్ళి కూర్చున్నాడు. ఈ రోజు అతనికి మాలా-కారులు పూలమొక్కలు కూడా ఇచ్చారు. వాటిని తీసుకువెళ్ళి అమ్మి డబ్బు చేసుకున్నాడు. ఇలా అతను చాలా కొద్దిరోజులలోనే ఎనిమిది కార్షాపణాలు (వెండి నాణాలు) సంపాదించాడు.

ఒకనాడు గాలివాన వచ్చింది. రాజోద్యానంలో ఎండు కొమ్మలూ, ఆకులూ అమితంగా గాలికి రాలిపడ్డాయి. తోటమాలి ఉద్యానాన్ని ఎలా శుభ్రం చేయటమా అని ఆలో

చిస్తూండగా, యువకుడు అక్కడికి వెళ్ళి, రాలిన కర్రలు, కంపా తనకు ఇచ్చే పక్షంలో ఉద్యానాన్ని తాను బాగుచేస్తానన్నాడు. తోట మాలి వెంటనే ఒప్పుకున్నాడు.

అప్పుడా యువకుడు పిల్లలు ఆడుకుంటున్న చోటికిపోయి, అందరికీ తలాకాస్త బెల్లం పెట్టి, వాళ్ళను ఉద్యానానికి తీసుకుపోయి, వాళ్లచేత ఉద్యానంలో రాలిపడిన కర్రలూ, కంపా పోగుచేయించి, ఉద్యానద్వారం వద్ద చేర్పించాడు.

ఆసమయంలో రాజుగారి కుమ్మరి అటుగా వచ్చి, ఉద్యానద్వారం వద్దవున్న కుప్పను కుండలు కాల్చటానికి బేరం చేశాడు. ఈ బేరంలో యువకుడికి ఇరవైఆరు కార్షా పణాలూ, కొసరు కింద కొన్ని చట్లూ లభించాయి.

ఇలా ముప్ఫైనాలుగు కార్షాపణాలు సంపాదించిన మీదట అతనికొక ఆలోచన వచ్చింది. అతను నగరద్వారానికి సమీపంలో ఉన్న చలివేంద్రానికివెళ్ళి, అయిదు వందల మంది గడ్డికోసుకునే వాళ్ళకు తాగటానికి నీరు అందించాడు. వాళ్ళు కోరిన సహాయం చేస్తామన్నారు.

తరవాత ఒకనాడు, ఆ యువకుడికి తెలిసిన ఒక వర్తకుడి ద్వారా, మర్నాడు ఆ నగరానికి ఒక గుర్రాల వర్తకుడు అయిదు వందల గుర్రాలతో రానున్నట్టు తెలిసింది. వెంటనే ఆ యువకుడు గడ్డి మోపుల వాళ్ళను కలుసుకుని, "రేపు మీరంతా నాకు తలా ఒక గడ్డి మోపు ఇయ్యాలి. నా మోపులు అమ్ముడయ్యే దాకా మీరు ఎక్కడా గడ్డి అమ్మవద్దు!" అన్నాడు. వాళ్ళు అలాగేనని, అయిదు



వందల గడ్డిమోపులు తెచ్చి, అతని ఇంటి దగ్గర పడేశారు.

అనుకున్న ప్రకారం గుర్రాల వర్తకుడు అయిదు వందల గుర్రాలతో వచ్చాడు. వాటికి కావలసిన గడ్డి ఇంకెక్కడా దొరకక పోవటం చేత, యువకుడి దగ్గర అయిదు వందల గడ్డి మోపులూ కొని, అతనికి వెయ్యి నాణాలు ఇచ్చాడు.

మరికొంత కాలానికి యువకుడు తనకు పరిచయం వున్న ఒక నౌకావ్యాపారి ద్వారా, ఒక పెద్దనావ రేవులోకి వచ్చినట్టు విని, ఒక మంచి ఆలోచన చేశాడు. ఆ ఆలోచన ప్రకారం అతను ఉత్తమమైన బండిని ఎనిమిది కార్షాపణాలకు బాడుగకు తీసుకుని, దానితో రేవుకు వెళ్ళాడు. అతను ఒక ఉంగరాన్ని బయానా కింద ఇచ్చి, అక్కడి నావను కొన్నాడు.

తరవాత ముగ్గురు ప్రతీహారులను నియమించి, వర్తకులెవరైనా వస్తే తన వద్దకు తీసుకురమ్మన్నాడు.

ఈ లోపల నావ రేవులోకి వచ్చినట్టు తెలిసి, కాశీనగరంలోని నూరుమంది వర్తకులు సరుకులు కొనుక్కుందామని వచ్చారు. అప్పటికే సరుకంతా ఎవరో యువకుడు కొనేసినట్టు వారికి తెలిసింది. వర్తకులు ఆ యువకుడి వద్దకు వచ్చారు. యువకుడు వారికి నావలోని సరుకుతో బాటు, జాగా కూడా రెండేసి వేలకు అమ్మి, రెండు లక్షలు సంపాదించాడు.

తరవాత ఆ యువకుడు చిన్నశెట్టి వద్దకు వెళ్ళి, ఆయనకు లక్ష నాణాలు చూపాడు. "నాయనా, నీకు ఈ డబ్బంతా ఎలా వచ్చింది?" అని చిన్నశెట్టి అడిగాడు.

"తమ ఉపదేశం మూలంగా, నాలుగు మాసాల కాలంలో ఈ డబ్బు సంపాదించాను!" అంటూ ఆ యువకుడు తాను చచ్చిన ఎలుకను కానీకి అమ్మినది మొదలుకుని, అంతా వివరంగా చెప్పాడు.

అంతా విని చిన్నశెట్టి, "ఇటువంటి కుర్రవాణ్ణి ఇతరుల చేతిలో పడనియ్యరాదు!" అనుకుని, పెళ్ళికిసిద్ధంగా వున్న తన కూతుర్ని ఆ కుర్రవాడికిచ్చి పెళ్ళిచేసి, తనకున్న ఆస్తి అంతా అతనిపరం చేశాడు. చిన్నశెట్టి చనిపోయిన తరవాత ఆ యువకుడికి "శ్రేష్ఠి" పదవివచ్చింది.





# విష్ణు కథ

విష్ణువు జయవిజయులతో, "మహా మునుల శాపం మీరరానిది. నా పట్ల మిత్రభావంతో ఏడు జన్మల్లో తరించి వస్తారా? లేక నన్ను ద్వేషిస్తూ నాకు శత్రువులై మూడు జన్మల్లో నాచేత అంతమొంది ఇక్కడికి వస్తారా?" అని అడిగాడు.

జయవిజయులు విష్ణు సన్నిధానాన్ని త్వరగా చేరుకోడానికి మూడు జన్మలే కోరుకున్నారు. అప్పుడు సనకసనందనాది మునులు జయ విజయుల్ని మెచ్చుకుంటూ విష్ణువుతో, "రాగద్వేషాలు రెండూ నీకు సమానమనీ, నిన్ను ద్వేషించేవారు మరింత త్వరగా నీకు దగ్గరవుతారనీ ఇప్పుడు తెలుసుకున్నాం! కర్తవ్య నిర్వహణలో మమ్మల్ని అడ్డుకున్న నీ ద్వారపాలకులను శపించిన మా తొందరపాటుతనానికి సిగ్గు పడుతున్నాం. మమ్మల్ని మన్నించు!" అని చెప్పి, లక్ష్మీ నారాయణులను అనేక విధాల మనసార స్తుతిస్తూ సేవించి వెళ్ళారు.

జయవిజయులు కశ్యపప్రజాపతి భార్య దితి కడుపున హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడుగా పుట్టారు. అన్నదమ్ములు గొప్ప పరాక్రమవంతులై తపస్సులు చేసి బ్రహ్మను మెప్పించి గొప్ప వరాలు పొందారు. విష్ణువుపై కత్తికట్టి విజృంభించారు.

హిరణ్యకశిపుడు రాక్షసులకు రాజై, విష్ణువును ఎదుర్కొని సాధించడానికి కంకణం కట్టుకున్నాడు.

హిరణ్యాక్షుడు విష్ణువును కవ్వించే ఘోర కృత్యాలు చేసి చేసి, భూమిని దొర్లించుకుపోయి రసాతల సముద్రంలోకి తోశాడు. భూమి రసాతలం అడుగున మునిగిపోయింది. భూదేవి విష్ణువును తలంచి తన్ను ఉద్ధరించమని మొరపెట్టింది.



విష్ణువు భూదేవి మొర ఆలకించి దశావ తారల్లో మూడవది అయిన వరాహావతారాన్ని ఎత్తాడు.

బ్రహ్మ హెూమం చేస్తూండగా యజ్ఞకుండం నుంచి తెల్లని కాంతితో ఒక నలుసు వెలు వడింది. ఆ నలుసు క్రమ క్రమంగా పెద్దదై అడవి పందిగా రూపొందింది. ఆ ఏదు పందిని విష్ణువు అవతారంగా ఎంచి బ్రహ్మాది దేవతలు యజ్ఞవరాహంగా, శ్వేత వరాహంగా, ఆదివరాహంగా కీర్తిస్తూ స్తుతించారు.

యజ్ఞవరాహము అలా అలా పెరిగి, బ్రహ్మాండమైన ఆకృతి పొందింది; బలిష్ఠమైన కాళ్ళతో, ఉక్కుకవచం లాంటి పైచర్మంతో, వజ్రాల్లాంటి పాడవైన వాడి కోరకొమ్ములతో, ఎర్రనికాంతి ప్రసరించే కన్నులతో, మెడ నుంచి తోకవరకూ నిక్కబొడుచుకొని బంగా రంలా మెరుస్తున్న వెంట్రుకల జూలుతో, విశ్వమంతా ఘూర్ణిల్లేలాగ వరాహము హుంకార ధ్వనులు చేసింది. యజ్ఞవరాహం ముట్టెపై ఖడ్గంలాంటి కొమ్ము ధగధగా మెరుస్తున్నది.

వరాహావతారం మెరుపు వేగంతో రసా తలానికి పరిగెత్తింది. ఆ వేగానికి దిక్కులు అదిరాయి, ప్రళయవాయువులు భీకరంగా వీచాయి.

రసాతల సముద్రంలోకి చొచ్చుకొని వెళ్ళి, అడుగున మునిగి ఉన్న భూమిని తన కొమ్ముతో గుచ్చి యజ్ఞవరాహము మీదకు ఎత్తింది.

అదే సమయంలో హిరణ్యాక్షుడు వరుణు డిపై దాడిచేసి పోరాటానికి పిలిచాడు.

వరుణుడు, ''వీరాధి వీరుడివైన నీవు పోరాడవలసినది నాతో కాదు రసాతలం నుంచి భూమిని ఉద్ధరిస్తున్న యజ్ఞవరాహంతో!'' అని అన్నాడు.

హిరణ్యాక్షుడు హుటాహుటిని వెళ్ళి యజ్ఞ వరహావతారాన్ని ఢీకొన్నాడు.

వరాహరూప విష్ణువుతో హిరణ్యాక్షుడు గొప్ప పరాక్రమంతో పోరుతూ గదతో విష్ణువు గదను తృళ్ళగొట్టి కొంతసేపు అలాగే నిల్చు న్నాడు.

విష్ణువు అతని యుద్ధనీతిని మెచ్చుకొని తిరిగి గదను ధరించాక, ఇరువురికీసంగ్రామం ఘోరంగా సాగింది. చివరకు వరాహావతారం తన కొమ్ముతో హిరణ్యాక్షుణ్ణి పొడిచి చంపింది.

వరాహావతారుడైన విష్ణువును భూదేవి వరించింది. వరాహమూర్తి భూదేవిని సందిట చేర్చుకొని తొడపై కూర్చుండ బెట్టుకున్నాడు. బ్రహ్మాది దేవతలు పూలవాన కురిపిస్తూ,

జగపతిగా విష్ణువును అనేక విధాలుగా స్తోత్రం చేశారు.

పందిరూపంతో తన తమ్ముణ్ణి చంపిన విష్ణువుపై పగసాధించడానికి తీవ్రసంకల్పంతో, ముందు బ్రహ్మవల్ల వరాలు పొందడానికి హిరణ్యకశిపుడు తపస్సుకు బయలుదేరి వెళ్ళాడు. అప్పుడు అతని భార్య లీలావతి గర్భవతిగా ఉన్నది.

ఆమె గర్భవాసాన్ని హతమార్చడానికి ఇంద్రుడు మాయోపాయంతో లీలావతిని చెరగొని, ఆకాశమార్గాన పోతూండగా, నారదుడు ఎదురై, "దేవేంద్రా! ఎంత పనికి ఒడిగట్టావు! నీ ప్రయత్నాన్ని విరమించు. సర్వకాల సర్వావస్థలలో హిరణ్యకశిపుడు పగతో విష్ణువు గురించే తలంచుతూండే వాడవడంవల్ల, లీలావతి గర్భస్థుడైన శిశువుకు ఆ విష్ణుచింతన సంక్రమించి, పగ భక్తిగా అతనిలో రూపాంతరం పొందింది. ఇదే విష్ణు మాయ అయిన ప్రకృతి విశేషాల్లో ఒకటి. లీలావతి గొప్ప విష్ణుభక్తుణ్ణి కనబోతూన్నది. అంచేత లీలావతిని విడిచిపుచ్చి. నీ దారిన నువ్వు వెళ్ళు!" అని చెప్పి లీలావతిని తన ఆశ్రమానికి తీసుకెళ్ళాడు.

ఆశ్రమంలో నారదుడు ఉన్నతమైన వేదాంత విషయాలనూ, విష్ణు దివ్య కల్యాణ గుణగణాలను వర్ణిస్తూన్నప్పుడు, లీలావతి గర్భంలో ఉన్న బిడ్డ అమిత ఆసక్తితో వింటూ, ఊకొడుతూండే వాడు. లీలావతి కుమారుణ్ణి ప్రసవించింది.

హిరణ్యకశిపుడు ఘోరమైన తపస్సు చేసి బ్రహ్మను మెప్పించాడు. భూమ్మీద గాని,



ఆకాశంలోగాని, రాత్రిగాని పగలు గాని, ఇంటగాని, బయటగాని, మృగంచేత గాని మనిషిచేతగాని, దేవతలు మొదలైన వారి వలన గాని, ప్రాణమున్న దానిచేత గాని లేనిదానిచేతగాని, నిప్పు, నీరులాంటి పంచ భూతాల చేతగాని సృష్టిలో ఉన్న ఏరూపం చేత గాని, ఇంకా ఎన్నో విధాలుగా తనకు చావులేని వరాల్ని కోరాడు; బ్రహ్మ అతను కోరిన వరాలన్నిటినీ ఇచ్చాడు.

వరాలను పొందిన విజయగర్వంతో హిరణ్యకశిపుడు వస్తూండగా, నారదుడి వలన జరిగినది విని, నారదాశ్రమానికి వచ్చి, కుమారుడి పేరు ప్రహ్లాదుడు అని నామకరణ మహోత్సవం జరిగాక, భార్యనూ, కుమారుణ్ణీ తన రాజధానికి తీసుకువెళ్ళాడు.

ఇంద్రుడిపై ప్రతీకారంగా హిరణ్యకశిపుడు స్వర్గం మీదకు దండయాత్ర చేసి, స్వర్గ



సింహాసనం ఆక్రమించాడు. దిక్కులన్నిటినీ జయించి, అష్ట దిక్పాలకుల్ని తన అదు పాజ్ఞల్లో పెట్టుకున్నాడు. దేవతల్ని పశువుల్ని బాదినట్లుగా బాదాడు. శచీదేవిని అవమా నించబోతే లీలావతి అడ్డుకొంది.

హిరణ్యకశిపుడు విజృంభించి మునుల ఆశ్రమాల్ని తగలబెట్టించాడు. విష్ణు విశ్వాస కుల్ని చిత్రవధలు చేయించాడు. విష్ణువును ఎదుర్కోవడమే అతని ధ్యేయం. విష్ణువును కవ్వించడానికి చేయవలసినవన్నీ చేశాడు. అయినా విష్ణువు అతనికి తారసపడలేదు. వైకుంఠానికి దాడి వెళ్ళాడు. అక్కడా విష్ణువు అతనికి కనపడలేదు. "నాకు భయపడి అదృ శ్యంగా దాగున్నాడు. పిరికిపంద!" అని హిరణ్య కశిపుడు తిరిగివచ్చాడు.

ప్రహ్లాదుడు దినదిన ప్రవర్థమానంగా ఎల్లప్పుడు విష్ణుస్మరణ చేస్తూ పెరుగుతూ న్నాడు. తనకు అటువంటి కులద్రోహిఎందుకు పుట్టాలి! అని హిరణ్యకశిపుడు చింతించి, గురుపుత్రులైన చండామార్కులకు ప్రహ్లాదుణ్ణి అప్పగించి, విద్యాబుద్ధులు నేర్పమన్నాడు.

ప్రహ్లాదుడు గురుకులంలో హరిధ్యానంతోనే చదువంతా పూర్తిచేశాడు. తోటి బాలురకు విష్ణుభక్తి ప్రబోధంచేసి మోక్షమార్గంపట్ల ఆసక్తికలవారిగా చేశాడు.

చండామార్కులు ప్రహ్లాదుణ్ణి తండ్రి దగ్గరికి తీసుకెళ్ళారు. హిరణ్యకశిపుడు కుమా రుణ్ణి ఆప్యాయంగా తొడపై కూర్చుండ బెట్టుకొని, "నాయనా! నువ్వు నేర్చిన విద్య తెలిసేలాగ మంచి పద్యం ఒకటి చెప్పు!" అన్నాడు.

ప్రహ్లాదుడు, "తండ్రీ! గురువులు చెప్పిన చదువంతా క్షుణ్ణంగా నేర్చాను. చదువులన్నిటి కంటె గొప్పదైన చదువు విష్ణువునందు మనసు నిల్పడం ఒక్కటే! విష్ణువును స్మరించే జన్మే జన్మ!" అన్నాడు.

హిరణ్యకశిపుడు కుమారుణ్ణి చప్పున క్రిందకు తోసి పట్టరాని ఆగ్రహంతో చండా మార్కులతో, "ఇదా మీరు నేర్పిన చదువు?" అన్నాడు.

చండామార్కులిద్దరూ గజగజలాడుతూ, "మా తప్పేమీ లేదు, మహాప్రభూ! మాపై ఆగ్రహించకు!" అని వేడుకుంటూ, గురు కులంలో ప్రహ్లాదుడేవిధంగా ప్రవర్తించినదీ వివరంగా విన్నవించుకున్నారు.

హిరణ్యకశిపుడు కొడుకుతో, "విష్ణువు పందిగా నీ పినతండ్రిని చంపాడు. మన రాక్షస కులానికి పరమశత్రువు. నీవు విష్ణువును

పొగడ్డం క్షమించరాని కులద్రోహం. విష్ణుభక్తి మాను, ఈ క్షణమే వాణ్ణి మర్చిపో!'' అన్నాడు.

''దానవేశ్వరుడవైన నీవు అన్నివిధాలా నన్ను శాసింపతగినవాడివే! కాని ఇనుము ముక్క అయస్కాంతాన్ని ఏవిధంగా అంటు కుంటుందో, అలాగే నా మనస్సు విష్ణువుపైనే లగ్నమై ఉన్నది; మందారపువ్వు మకరందాన్ని తుమ్మెద ఎలాగ విడిచి పెట్టలేదో, అలాగే విష్ణువును మర్చిపోవడం నా వశంలో లేదు. నాలో జీవము ఉన్నంతవరకూ విష్ణుచింతన పోదు, ఆ జీవము కూడా విష్ణువే!'' అన్నాడు వినయంగా.

ముక్కుపచ్చలారని బాలుడైన ప్రహ్లాదుడి మాటలకు విస్తుపోతూ హిరణ్యకశిపుడు కోపంతో అగ్నిలా ప్రజ్వరిల్లి, ''అయితే నీవు చావక తప్పదు, ఆహార పానాలు లేకుండా మలమల మాడి చావు!'' అంటూ ప్రహ్లాదుణ్ణి వెల్తురు చొరని కారాగారంలో పెట్టించాడు.

పుత్రప్రేమతో లీలావతి తల్లడిల్లి పోయింది. రోజులు గడుస్తున్నాయి.

లీలావతి శోకం చూడలేక హిరణ్యకశిపుడు కారాగారం తెరిపించి, తన్మయుడై విష్ణు సంకీర్తన చేస్తూ నవనవలాడుతూన్న ప్రహ్లా దుణ్ణిచూసి, చాలా రోజులుగా అన్నపానాలు లేకుండా ఎలా బతికి ఉన్నాడా అని ఆశ్చర్య పడుతూనే, పట్టరాని ఆగ్రహంతో ప్రహ్లాదుణ్ణి ఏనుగులచేత మట్టించమన్నాడు.

ప్రహ్లాదుణ్ణి చూడగానే ఏనుగులు సింహాన్ని చూసినట్లు బెదిరాయి. మావటి వాళ్లు పొడిచి అతి ప్రయత్నం మీద నడి పించితే, అతనిమీద నుంచి వెళ్ళాయిగాని, అతనికే అపాయమూ కలగలేదు.



పాములచేత కరిపించబోతే, కాటువేయకుండా ముద్దాడి, పడగలు విప్పి గొడుగులు పట్టి ఆడాయి.

కొండ శిఖరం నుంచి తోయించాడు, మంటల్లో వేయించాడు, సముద్రంలో పడ వేయించాడు, కాలకూట విషం త్రాగించాడు. ఎన్నిచేసినా, ప్రహ్లాదుడు సురక్షితంగా ఉండటం చూసి, హిరణ్యకశిపుడు, "నువ్వు, చావకున్నా వెందుచేత? ఆ రహస్యమేమిటో చెప్పు!" అని అడిగాడు.

ప్రహ్లాదుడు నవ్వుతూ, "ఇందులో రహస్యం ఏదీలేదు; ఏనుగుల్లో, పాముల్లో, రాళ్ళలో, అగ్నిలో, సముద్రాల్లో, విషంలో అన్నిట్లో, నీలో, నాలో ఉన్నది విష్ణువే అన్న సత్యాన్ని తెలుసుకోలేకపోతున్నావు! నన్ను చంపాలనుకుంటున్నదీ, నేను బతుకుతూ న్నదీ, అతని లీలావినోదమే, నాన్నా!" అన్నాడు.

ఆ మాటలకు హిరణ్యకశిపుడు కోపావేశంతో ప్రహ్లాదుణ్ణి బరబరా ఈడ్చుకు వెళ్ళి సభామంటపం మధ్య నిలబెట్టి, తన గదను తీసి పట్టుకొన్నాడు. లీలావతి మూర్ఛపోయింది. చుట్టూరా రాక్షస ప్రముఖులు నిర్విణ్ణులై బొమ్మల్లా నిలబడి చూస్తున్నారు.

సభామంటపానికి ఎదురుగా లోహనిర్మితమైన పెద్ద జయస్తంభం ఉంది. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడికి ఆ స్తంభాన్ని చూపుతూ, "ఓరీ కులద్రోహీ! అది, నా విజయ స్తంభం! నా తమ్ముణ్ణి చంపిన విష్ణువుతో పోరాడి, నీ ముందే సంహరించి పగతీర్చుకుంటాను, అందులో ఉన్నాడా?" అని అడిగాడు.

"ఆ సందేహమే వద్దు నాన్నా. అంతటా ఉన్నాడు, అందులోనూ ఉన్నాడు," అన్నాడు ప్రహ్లాదుడు.

హిరణ్యకశిపుడు చరచరా వెళ్ళి గదతో స్తంభాన్ని కొట్టాడు. ప్రళయధ్వనితో భూనభోంతరాలు దద్దరిల్లాయి, పొగల మేఘాలు అంతటా విరజిమ్ముకున్నాయి. స్తంభం రెండుగా చీలిపోతూండగా వెలువడిన మిరుమిట్లుగొలిపే మెరుపుల మధ్య దశావతారాల్లో నాలుగవది అయిన నరసింహావతారంగా విష్ణువు ఆవిర్భవించాడు. సింహం తల, మనిషి శరీరము, చేతులకు సింహం గోళ్ళతో సృష్టిలో లేని అద్భుత రూపం గల నరసింహమూర్తి ప్రళయభీకరంగా గర్జించాడు. పాంచజన్య శంఖధ్వని వినిపించింది. సుదర్శనచక్రం అతని చుట్టూ తిరుగుతూ కనిపించింది.



# తోకముడిచిన పొట్టిదయ్యం!



ఆఫ్రికాలోని ఒక దట్టమైన అడవి మధ్య ఉన్న గ్రామంలో మబూటో భార్య న్జీలీ, చురుకైన కొడుకు అడీన్‌తో కలిసి నివసిస్తూండేవాడు. గ్రామానికి కొద్ది దూరంలో కొంతనేలను చదును చేసి మబూటో కసావా దుంపలను నాటాడు. కసావా దుంపలతో చేసిన వంటలంటే మబూటో కుటుంబానికి చాలా ఇష్టం.

కసావా బాగా పెరిగి దుంపలు తవ్వడానికి పక్వానికి వచ్చాయి. ఒకరోజు మబూటో, న్జీలీ పొలం దగ్గరికి వెళ్ళారు. దానిని చూడగానే, "మనం రేపు బుష్‌కూరతో పాటు కసావాగంజి తాగాలి," అన్నాడు మబూటో.

"దుంపలు తవ్వాలి, వాటి తొక్క ఒలవాలి. ఆ తరవాత దంచి పిండి చేయాలి. అప్పుడే గంజి తయారవుతుంది. ఇవన్నీ రేపటికే ఎలా సాధ్యం. ఇంకొక్క రోజు ఆగండి," అన్నది భార్య న్జీలీ.

అయితే, మరునాడు తెల్లవారగానే పొలం దగ్గరికి వెళ్ళిన భార్యాభర్తలు అక్కడి దృశ్యాన్ని చూసి దిగ్భ్రాంతి చెందారు. తీవ్రమైన ఆశా భంగానికి గురయ్యారు. మొక్కలన్నీ నాశన మయ్యాయి. ఒక్క కసావాదుంప కూడా లేదు. "అంతా పోయింది," అంటూ ఏడ్వసాగింది న్జీలీ.

"ఇది అడవి జంతువులపనే అయివుం టుంది. మిగిలివున్న ఒకటీ అరా మొక్కలు నాశనం కాక ముందే మనం ఆ జంతువులను మట్టుపెట్టాలి," అన్నాడు మబూటో కోపం, బాధా నిండిన కంఠస్వరంతో. ఆ తరవాత తీవ్రంగా ఆలోచిస్తూ భార్యాభర్తలు తమ గుడిసెకు చేరారు. అమ్మా, నాన్న విచారంగా ఉండడం గమనించిన అడీన్ కారణం అడిగాడు. మబూటో జరిగింది చెప్పాడు. వెంటనే అడీన్ ఒక తెలివైన సలహా ఇచ్చాడు:

"అవును, నాన్నా, నువ్వన్నది నిజం. జంతువులను పట్టుకోడానికి లోతైన గోతిని తవ్వడమే సరైన మార్గం. ఒకసారి వచ్చి రుచి మరిగిన జంతువులు మళ్ళీ మళ్ళీ వస్తాయి. వాటిని రాకుండా అరికడితేనే ఉన్న పంటనైనా కాపాడుకోగలం. పైగా మనకు జంతుమాంసం కూడా దొరుకుతుంది," అంటూ న్జీలీ కొడుకు సలహాను మెచ్చుకున్నది.

మబూటోకు కూడా కొడుకు సలహా బాగా నచ్చింది. వెంటనే పారా, పలుగూ తీసుకుని పొలం

దగ్గరికివెళ్ళి గోతిని తవ్వడం ప్రారంభించాడు.

మబూటో గోతిని తవ్వడంలో నిమగ్నుడైవుం డగా, "ఎవడ్రా నువ్వు. నా అడవిలో ఏం చేస్తు న్నావు?" అన్న కఠిన కంఠస్వరం వినిపించింది. తలెత్తి చూసిన మబూటో ఉలిక్కి పడ్డాడు. పక్కనే పొట్టిదయ్యాన్ని చూడడంతో హడలి పోయాడు. అంతకు పూర్వం ఆ అల్లరి దయ్యాలను గురించి వినడమే తప్ప వాటినెప్పుడూ అతడు ఇంత దగ్గరినుంచి చూడ లేదు.



"నా కసావా పొలాన్ని ధ్వంసం చేయడానికి వచ్చే జంతువులను పట్టుకోవడానికి గోతిని తవ్వు తున్నాను," అన్నాడు మబూటో.

"నా అడవిలో, నా అనుమతి లేకుండా గోతిని తవ్వుతున్నావా? ప్రాణాలు తోడేస్తాను, జాగ్రత్త!" అని హుంకరించింది పొట్టిదయ్యం.

మబూటో భయంతో గడగడ వణుకుతూ, "నన్ను క్షమించు. పిల్లలు గలవాణ్ణి!" అన్నాడు.

పొట్టిదయ్యం ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు కొంతసేపు పైకీ కిందికీ చూసి, తల ఊపి, "సరి సరి, ఈసారికి వదిలిపెడతాను. అయితే, ఒక నిబంధన. నువ్వు తవ్వే గోతిలో మగ జంతువు పడితే నువ్వే తీసుకో. ఆడజంతువు పడిందో అది నాకే సొంతం. సరేనా?" అన్నది.

"చిత్తం, అలాగే!" అన్నాడు మబూటో.

పొట్టిదయ్యం వెళ్ళిపోయింది. ఆ తరవాత మబూటో లోతుగా గోతిని తవ్వి, అది కనిపించ కుండా ఆకులూ, రెమ్మలూ దానిపైన మూసి ఇంటికి తిరిగివెళ్ళాడు.

మరునాడు తెల్లవారాక మబూటో గోతి దగ్గ రికి వచ్చాడు. అతని వెనకే పొట్టిదయ్యం కూడా వచ్చింది. గోతిలోపలికి తొంగిచూస్తే అక్కడొక కోతి కనిపించింది. "అది మగది!" అన్నాడు మబూటో సంతోషంగా. పొట్టిదయ్యం వెళ్ళిపోయింది. మరునాడు పొద్దున వచ్చి చూస్తే గోతిలో దుప్పిపిల్ల పడివుంది. వాడెంతో సంతోషించాడు. పొట్టి దయ్యం వెళ్ళిపోయింది. ఇలా రోజూ వెళ్ళినప్పు డల్లా హైయినా, అడివిపిల్లి, ఎలుగుబంటి అంటూ రకరకాల జంతువులు పట్టుబడసా గాయి. అవన్నీ కూడా మగ జంతువులే కావడం విశేషం.

"కసావా అంటే మగజంతువులకే ఇష్టం లాగుంది," అన్నాడు మబూటో. పొట్టిదయ్యం మరేమీ మాట్లాడకుండా వెళ్ళిపోయింది.

ఒకనెల గడిచింది. పొలానికి వెళ్ళి మళ్ళీ అందులో కసావా నాటుదామనుకుని న్జీలీ అక్క డికివెళ్ళింది. తలనొప్పిగా ఉండడం వల్ల మబూటో ఇంటిదగ్గరే ఉండిపోయాడు. వెళ్ళిన న్జీలీ మధ్యా హ్నానికి కూడా రాలేదు. అడీన్, "ఆకలిగా వుంది. అమ్మ కావాలి," అంటున్నాడు. పడుకున్న

మబూటో లేచి చూశాడు. సాయంకాలం కాబో తోంది. న్జీలీకి ఏమయింది? అని మబూటో ఆలోచించసాగాడు.

"నాన్నా, మనం పొలం వెళ్ళి అమ్మను పిలు చుకువద్దాం," అన్నాడు అడీన్. తండ్రీకొడుకు లిద్దరూ పొలం కేసి బయలుదేరారు.

వాళ్ళు గోతిని సమీపించారు. అది తెరుచు కుని వుంది. ఏ జంతువు పడిందా అనిలోపలికి తొంగి చూశారు. అక్కడ న్జీలీ కనిపించింది. ఆమె గోతి వుందన్న సంగతి మరిచిపోయి, దాని మీద కాలువేసి లోపలికి జారిపడిపోయిందన్నమాట!

"ఆహా! ఆడజంతువు దొరికింది. అది నాకే సొంతం!" అని వికారంగా అరుస్తూ పొట్టిదయ్యం అక్కడికి వచ్చింది. ఆ మాటకు గతుక్కుమన్న మబూటో, "వీలుకాదు, ఆమె నా భార్య. నువ్వు తీసుకుపోకూడదు," అన్నాడు.

"ఆడ జంతువులను మాత్రమే నువ్వు తీసు కోవాలి. ఆమె జంతువు కాదు. మనిషి!" అన్నాడు అడీన్.

అయితే, పొట్టిదయ్యం, "మనుషులు కూడా జంతువులే. ఈరోజు నుంచి ఈమె నాకే సొంతం," అన్నది కీచుగొంతుతో.

మబూటోకు ఏం చేయాలో దిక్కు తోచలేదు. నేలపై చతికిల పడి, చేతులతో ముఖం, నెత్తీ మొత్తుకుంటూ విలపించసాగాడు. అయితే, అడీన్ తల్లిని వదులుకోకూడదనుకున్నాడు. "నా తల్లిని ఇది ఎలా అపహరిస్తుందో నేను చూస్తాను," అని ధైర్యంతో ఆలోచించి పొట్టిదయ్యంతో, "సరే, ఆమె నీకే సొంతం. వెళ్ళి తెచ్చుకో," అన్నాడు.

"వద్దు. నేను దాన్ని కళ్ళతో చూడలేను. అడీన్ ఆ మాట అనడానికి నీకు నోరెలా వచ్చింది?" అంటూ మబూటో రోదించసాగాడు.

అయితే, పొట్టిదయ్యం ఆనందంతో భుజాలు ఎగురవేస్తూ, కిచ కిచమని నవ్వుతూ, "ఇప్పుడే వెళ్ళి తెచ్చుకుంటాను," అంటూ దభీమని గోతి లోకి దూకింది.

"నాన్నా, గోతిలో మగజంతువు పడింది. రా పట్టుకుందాం!" అన్నాడు అడీన్.

మబూటో ఒక్క గెంతున లేచి నిలబడ్డాడు. తన కొడుకు తెలివికి పొంగిపోయాడు. గోతిలోకి తొంగిచూస్తూ, "గోతిలో పడ్డ మగజంతువు నాకు కట్టుబానిస. నాకు సేవలు చేయడమే దాని పని!" అన్నాడు.

పొట్టిదయ్యం ఒక్కక్షణం తటపటాయించింది. తరవాత తాను చిక్కులో పడ్డట్టు గ్రహించింది. అది జీవితాంతం మబూటోకు బానిసగా బతక దలచ లేదు. "సరే, నువ్వామెను, పైకి తీసుకో, మన ఒప్పందం రద్దు చేసుకుందాం!" అని మెల్లగా అంటూ, గోతినుంచి జాగ్రత్తగా పైకి ఎగబ్రాకి వచ్చి, అడవిలోకి జారుకున్నది.

న్జీలీ గోతి నుంచి పైకి రావడానికి మబూటో, అడీన్ సాయపడ్డారు. ముగ్గురూ ఆనంద పారవశ్యంతో ఆడుతూ పాడుతూ ఇల్లు చేరారు. పొట్టిదయ్యం మరెప్పుడూ వాళ్ళ జోలికి రా లేదు!





# ఉత్తమ గురువు

విశాలపురాన్నేలే రామభద్రమహారాజు వృద్ధు డయ్యాడు. ఆయన రాజ్యభారాన్ని తన కుమారుడైన వీరభద్రుడికి అప్పగిస్తూ, "నాయనా! నేను రాజునయ్యేనాటికి, మన పౌరుల్లో అధిక శాతం విద్యావిహీనులు కావడంవల్ల మూఢ నమ్మకాలతో, మూఢాచారా లతో తాము ఇబ్బంది పడుతూ, సమాజానికీ ఇబ్బంది కలిగిస్తున్నారు. అందుకని నేను రాజధానిలో ఒక విద్యాలయాన్ని నెలకొల్పాను. కానీ సరైన గురువు లేక ఆ విద్యాలయం, నేనాశించిన ప్రయోజనాన్ని నెరవేర్చలేక పోయింది. ముందుగా నీవు, ఆ విద్యాల యానికి సరైన గురువును నియమించు," అని చెప్పాడు.

తండ్రి మాటలను శ్రద్ధగా విన్న వీరభద్రుడు వెంటనే మంత్రులతో ఆ విషయం గురించి సమాలోచన జరిపాడు.

మంత్రులందరూ ముఖముఖాలు చూసు కుంటూంటే, వారిలో వృద్ధుడూ, వివేక వంతుడూ అయిన వాచస్పతి వినయంగా, "రాజా! విద్యపట్ల ఆసక్తివున్నవారికి తల్లి దండ్రులు, చుట్టూవున్న ప్రకృతి అంతా గురువులే. అలాంటి వారిని ఒక సక్రమ పద్ధ తిలో మరింత ప్రభావితం చేసేందుకు, మీ తండ్రిగారు రాజధానిలో విద్యాలయాన్ని స్థాపిం చారు. అక్కడ శిక్షణ పొందినవారు దేశమంతటా వ్యాపించి, మన పౌరులందరిలోనూ విద్యపట్ల ఆసక్తిని పెంచుతారని ఆయన ఆశించారు. కానీ, మనం నియమించిన గురువులు అను కున్నది సాధించలేకపోయారు," అంటూ పరిస్థితిని వివరించాడు.

"అందుకు కారణమేమిటి?" అన్నాడు వీరభద్రుడు.

"పాండిత్యమున్నవారు గొప్ప పండితు లుగా మాత్రమే చలామణీ కాగలరు. వారం దరూ గొప్ప గురువులు కాలేరు. మనం గొప్ప పండితులను విద్యాలయానికి గురువులుగా నియమించాం. వారు గొప్ప గురువులు కాలేక

శ్రీరామకమల్

పోయారు. అయినా, గురువుల గొప్పతనాన్ని కూడా పరీక్షించవలసివుంటుందని, ఇప్పుడిప్పుడే నాకూ స్ఫురిస్తున్నది,'' అన్నాడు వాచస్పతి.

ఈ మాటలు వీరభద్రుడికి వాస్తవం అనిపించాయి. అతడు చారులను పంపి విచారించగా, దండకారణ్యంలో ప్రశాంతుడు, ప్రసేనుడు అనే ఇద్దరు ఉద్దండ పండితులున్నారనీ, వారి శిక్షణలో ఎందరో ఆరితేరిన విద్యావంతులు తయారయ్యారనీ తెలిసింది. వీరభద్రుడు, వాచస్పతికి ఈ విషయం చెప్పి, వారిద్దరిలో ఒకరిని వెంటనే రాజధానిలోని విద్యాలయానికి ఆహ్వానించవలసిందిగా కోరాడు.

వాచస్పతి కాసేపాలోచించి, ''రాజా! మన విద్యాలయంలో చేరి విద్యావంతులు కాలేకపోయిన ఇరవైమంది యువకులను ఎన్నుకుని, వారిలో పదిమందిని ప్రశాంతుడికీ, మరొక పదిమందిని ప్రసేనుడికీ అప్పగిద్దాం. ఆరుమాసాల గడువులో ఎవరు సత్ఫలితాలు సాధిస్తే, వారిని మన విద్యాలయంలో గురువుగా నియమిద్దాం!'' అని సూచించాడు.

రాజు వీరభద్రుడు ఇందుకు సంతోషంగా సరేనన్నాడు.

అనుకున్న ప్రకారం వాచస్పతి పదిమందిని ప్రశాంతుడి వద్దకూ, మరొక పదిమంది విద్యార్థులను ప్రసేనుడి వద్దకూ పంపాడు. ఆరుమాసాలు గడిచే సరికి ప్రశాంతుడి వద్ద చేరినవారిలో ముగ్గురు శాస్త్రాల్లో నైపుణ్యాం సంపాదించితే, ప్రసేనుడి వద్ద చేరినవారిలో ఏడుగురు నైపుణ్యం సంపాయించారు.



అప్పుడు వాచస్పతి ముందుగా ప్రసేనుణ్ణి, ''మరి మిగతాముగ్గురి మాట ఏమిటి?'' అని అడిగాడు.

''నాదగ్గర మిగిలిన ఆ ముగ్గురూ జడులు, జన్మతః మందమతులు! వాళ్ళను ఎవరూ విద్యావంతుల్ని చేయలేరు,'' అన్నాడు ప్రసేనుడు.

ఆ తర్వాత వాచస్పతి, ప్రశాంతుణ్ణి కలుసుకుని, ''మీవద్ద మిగిలిన ఆ ఏడుగురు విద్యార్థుల మాటేమిటి?'' అని అడిగాడు.

దానికి ప్రశాంతుడు, ''మంత్రివర్యా! నా వద్ద చేరిన విద్యార్థుల్లో ముగ్గురు చురుకైన వారు. అందువల్ల త్వరత్వరగా వారికి విద్యాగంధం సోకింది. మిగిలిన ఏడుగురూ అంత చురుకుకాదు. ఆరు మాసాల్లో వారిని విద్యావంతుల్ని చేయగల సమర్థత నాకు లేదు. మరికొంత గడువిస్తే, వారినీ ఆ ముగ్గురు

విద్యార్థుల స్థాయికి తీసుకురాగలను,'' అన్నాడు.

వాచస్పతి, రాజుకు ఈ విషయం చెప్పి, రాజధానిలోని విద్యాలయానికి ప్రశాంతుణ్ణి గురువుగా నియమించమని సలహాయిచ్చాడు.

ఇందుకు రాజు ఆశ్చర్యపోయి, ''గురువర్యా! ఆరు మాసాలలో ఏడుగురిని విద్యావంతుల్ని చేసిన ప్రసేనుణ్ణి కాదని, ముగ్గుర్ని మాత్రమే విద్యావంతుల్ని చేయగలిగిన ప్రశాంతుడికి పదవి ఇవ్వడం విజ్ఞత అవుతుందా?'' అని అడిగాడు.

అందుకు వాచస్పతి చిరునవ్వు నవ్వి, ''రాజా! మన విద్యాలయంలో ఎందుకూ కొరగాని వారనుకున్నవారిని ప్రశాంతుడూ, ప్రసేనుడూ కూడా విద్యావంతుల్ని చేయగలిగారు. అంటే, నిస్సందేహంగా ఇద్దరికిద్దరూ గొప్ప గురువులు. ప్రసేనుడు ఏడుగురినీ, ప్రశాంతుడు ముగ్గుర్నీ విద్యావంతులుగా చేయగలిగారంటే – అది వారి ప్రతిభకు కొలబద్దగా తీసుకోకూడదు! ప్రసేనుడి వద్ద చురుకైనవారు ఎక్కువమంది చేరినట్లు భావించాలి. ఎందుకంటే, చురుకుతనం లేనివారి నాయన, జడులు అంటూ ఈ సడించాడు. ఇకపోతే, ప్రశాంతుడు తన శిష్యులెవరినీ జడులు అనుకోలేదు. ఇక్కడ మనం విష్ణుశర్మ, మూర్ఖులైన ముగ్గురు రాజకుమారుల కథా జ్ఞప్తికి తెచ్చుకోవలసిన అవసరం వుంటుంది!'' అంటూ ఆగాడు.

రాజు, ''అవునవును!'' అంటూ తల ఊపి, ''చెప్పండి, గురువర్యా!'' అన్నాడు.

''రాజా! మనం ఒకటి గమనించాలి. ప్రశాంతుడు మిగిలిన ఏడుగురు శిష్యులనూ విద్యావంతులను చేయడానికి మరికొంత వ్యవధి కావాలన్నాడే తప్ప శిష్యుల నాయన తప్పుపట్ట లేదు. శిష్యులను జడులనుకునేవాడు ఉత్తమ గురువు కానేరడు. అందువల్ల, నేను ప్రశాంతుణ్ణి ఉత్తమ గురువుగా ఎన్నిక చేశాను,'' అన్నాడు వాచస్పతి.

రాజు వీరభద్రుడు, వాచస్పతిని మెచ్చుకుని, ప్రశాంతుణ్ణి రాజధాని విద్యాలయంలో గురువుగా నియమించాడు. అతడి శిక్షణలో ఎందరో యువకులు విద్యావంతులై విశాలపురంలో విద్యావ్యాప్తికి తోడ్పడి, దేశ పౌరుల మానసిక వికాసానికి సాయపడ్డారు.





# గొప్ప ఇంటి విందు

ఒక గ్రామంలో ఒక జమీందారు ఉండేవాడు. ఆయన గొప్ప ధనికుడూ, అంతకన్న గొప్ప అహంకారీనూ. ఆ గ్రామంలో ప్రజలందరూ రైతులూ, కాపులూనూ. జమీందారుకు వాళ్ళ పొడ ఏమాత్రమూ గిట్టేది కాదు.

ఒక రోజు పొలాల్లో రైతులు, "ఇవాళ నేను జమీందారుగారిని అంతదూరంలో చూశాను," "ఇంత దూరంలో చూశాను," అని గొప్పగా చెప్పుకుంటూంటే, ఒక పేదకాపు విరగబడి నవ్వి, "ఏ చెట్టు చాటునుంచో, పుట్ట చాటు నుంచో జమీందారుగారిని చూడటం గొప్పా ఏమిటి? తలుచుకుంటే నేను జమీందారుగా రింట విందుభోజనం తినగలను," అన్నాడు.

ఈ మాటలు విని మిగిలిన రైతులకు చాలా కోపం వచ్చింది. "ఈ మొహమేనా జమీందారుగారింట విందు కుడిచేది? నిన్ను జమీందారుగారి గడపదాటి లోపలికి అడుగు పెట్టనివ్వరు. ప్రగల్భాలాడకు," అంటూ నలుగురూ నాలుగు మాటలూ అన్నారు.

"ప్రగల్భాలాడే దాకా నా కేం పని? ఉన్న మాటే చెబుతున్నాను. నేను తలుచుకుంటే ఏ పూటైనా జమీందారుగారింటికి వెళ్ళి, భోజనం చేసి రాగలను," అన్నాడు పేదకాపు.

"నువ్వు ఆ పని చేస్తే నీకు మూడు గరిసెల ధాన్యమూ, జత ఎద్దులూ ఇస్తాం. నువ్వు జమీందారుగారింటి భోజనం చెయ్యలేక పోతే మేం చెప్పిన పనిఅల్లా చెయ్యాలి," అన్నారు రైతులు. "నా కేమీ అభ్యంతరం లేదు," అన్నాడు పేదకాపు. ఆ పూటే వాడు జమీందారుగారింటికి వెళ్ళాడు. తలవాకిట కావలివాళ్ళు వాణ్ణి తరిమికొట్టబోయారు.

"కొంచెం ఆగండి. నేను ప్రభువువారి కొక శుభవార్త చెప్పాలి," అన్నాడు కాపు.

"ఆ శుభవార్త ఏమిటో మాతో చెప్పు. మేం ఏలిన వారితో చెబుతాం," అన్నారు కాపలా వాళ్ళు. "ఈ శుభవార్త ప్రభువుగారితో స్వయంగా చెప్పాలి. అది మీతో చెప్పేది కాదు," అన్నాడు కాపు.

జమీందారుతో నౌకర్లు కాపువాడన్న మాట చెప్పారు. వాడు తనతో చెబుతానన్న శుభవార్త ఏమిటో తెలుసుకోవాలని జమీందారుకు కుతూహలం కలిగింది. ఈ కాపువాడు ఏదో లాభకరమైన సంగతి చెప్పటానికి వచ్చాడు. అందుచేత ఆయన వాణ్ణి లోపలికి రానిమ్మని తన నౌకర్లతో చెప్పాడు. నౌకర్లు కాపును తెచ్చి జమీందారు ముందు ఉంచారు.

"నువ్వు ఈ ప్రాంతాల వాడివిలాగే వున్నావు! ఏమిటి నువ్వు చెప్పదలచిన వార్త?" అని జమీందారు కాపును అడిగాడు.

కాపువాడు రహస్యంగా, "గుర్రం తల కాయంత బంగారం ధర ఏపాటి ఉంటుం దంటారు?" అని జమీందారును అడిగాడు.

"ఎందుకలా అడుగుతున్నావు?" అన్నాడు జమీందారు.

"ఒక కారణం ఉండి అడుగుతున్నాను, ప్రభూ. తమకు తెలిస్తే చెప్పండి," అన్నాడు పేదకాపు. "ఆ కారణం చెప్పమంటున్నాను," అన్నాడు జమీందారు.

కాపువాడు నిట్టూర్చి, "తమకు చెప్పడం ఇష్టం లేకపోతే నేను మాత్రం ఏం చెయ్య గలను? తమ సెలవైతే ఇంటికి పోయి భోజనం చేస్తాను. కడుపులో మండిపోతున్నది," అన్నాడు.

జమీందారుకు వాడిని వెళ్ళనివ్వ బుద్ధికా లేదు. గుర్రం తలకాయంత బంగారం చెయి జారి పోనివ్వటం ఇష్టంలేక ఆయన తన నౌకర్లను పిలిచి, "వీణ్ణి తీసుకుపోయి, వెంటనే సుష్టుగా భోజనం పెట్టండి," అన్నాడు.

కాపువాడు రాజోపచారంగా కడుపునిండా తిండి తిని వచ్చాక, జమీందారు వాడితో, "నువ్వు ఆ బంగార మేదో పట్టుకురా! దాని గొడవ నీ కన్న నాకు బాగా తెలుసు. నీకు బహుమానం కూడా ఉంటుందిలే!" అన్నాడు.

"బంగారమా? నా దగ్గిర బంగారం ఎక్కడు న్నది? రెండు గరిసెల ధాన్యమూ, జతఎద్దులూ కలిసి గుర్రం తలకాయంత బంగారంతో సమానం అవునో కాదో తమరినడిగితే తెలు స్తుంది గదా అనుకున్నాను," అన్నాడు కాపు.

జమీందారుకు మండిపోయింది. "ఛీ, వెధవా! ఇంకో క్షణం ఇక్కడున్నావంటే నిన్ను చంపేస్తాను. మారు మాట్లాడకుండా పో!" అన్నాడు కాపుతో. కాపు వెళ్ళిపోయి, రైతుల దగ్గిర పందెం గెలుచుకున్నాడు.



11

# ఆర్య

అజ్ఞాత యువరాజు
విచిత్ర సాహస గాథ

చిత్రాలు:
గాంధి ఆర్య

శాంతిపురి సింహాసనాన్ని ఆక్రమించిన వీరసింహుడు, అమృతపురి మీదికి తన సేనలను పంపాడు. అయితే వెల్లువల కారణంగా సేనలు, ఆయుధాలు నందినీ నదిలో కొట్టుకుపోయాయి. ఆశాభంగానికి గురైన వీరసింహుడు మళ్ళీ ఆయుధాలను సమకూర్చుకోవడానికి ప్రజలనుంచి పన్నుల రూపంలో బియ్యం వసూలు చేయనున్నాడు. చంద్రగిరికి వెళుతూన్న బియ్యం బస్తాలను ప్రజలు అడ్డగించి తమనుంచి బలవంతంగా పట్టుకుపోయిన బియ్యాన్ని రాబట్టుకున్నారు.

పన్నుల రూపంలో బియ్యం సేకరించాలన్న పథకం సాగకపోవడంతో వీరసింహుడు ఆగ్రహం చెందాడు.

వాళ్ళను కఠినంగా శిక్షించాలి.

ఆ దోపిడీగాళ్ళను వెంటనే పట్టిబంధించండి.

జమీందారుల నుంచి కొత్త పన్నుగా వసూలు చేయనున్నాను కదా?

కొత్త పన్ను విధించాలా?

జమీందారులు పన్ను చెల్లించాలా?

ఎందుకు?

మనం బియ్యం ఇచ్చి, ఆయుధాలు తెచ్చుకుంటాం.

ఆయుధాలు మనకెందుకు?

మూర్ఖుడా! ఆయుధాలు యుద్ధం చేయడానికి!


అది నిజమే. మరి, శాంతిపురి ఎవరిమీదికీ దండెత్తి వెళ్ళడం లేదుకదా?
వెల్లువల కారణంగా కొంత సైన్యాన్నీ, ఆయుధాలనూ కోల్పోయాము.
నీ నోరు కాస్త ముయ్!


హఠాత్తుగా గవాక్షం నుంచి దూసుకువచ్చిన ఒక బాణం, వీరసింహుడి పక్కన గోడకు రయ్యిమని తగిలి, కింద పడింది. బహుశా అందులో ఏదో లేఖ ఉన్నట్టుంది.
అమరసింహుడు దానిని అందుకోబోయాడు. వీరసింహుడు అతన్ని వారించాడు.
మూర్ఖుడా! మొదట ఆ బాణం వేసిన వాడెవడో వెళ్ళిచూడు!
ఏమిటీ!


అమరసింహుడు వెలుపలికి వచ్చి, ఎవడో గుర్రంమీద వెళుతూండడం చూసి దిగ్భ్రాంతి చెందాడు.
ఒరేయ్! దుర్మార్గుడా! ఆగు, ఆగు!
భటులారా! వాణ్ణి పట్టుకోండి!





జయసింహపాలుడు, అశ్వదళంతో వెనుదిరిగి వచ్చాడు. వీరసింహపాలుడు అన్న అనుమానాస్పదమైన మాటను అతడు మరువలేకపోయాడు.
మహాప్రభూ! బాణానికి ఉన్న ఈ చిన్నరుమాలులో ఏదో రాసివుంది.



మేముకాదు దోపిడీగాళ్ళం! మీ మనుషులే మా బియ్యాన్ని దోచుకుపోతున్నారు. మేము ఆయుధాలను తినలేము!



చూడండి! నేను అన్న మాటలు ఈ రుమాలులో అలాగే ఉన్నాయి. అంటే, నా సభలోనే ఎవడో శత్రుగూఢచారి ఉన్నాడన్న మాట!



ఎవడా దుర్మార్గుడు? వాణ్ణి పట్టుకున్నావా?
లేదు ప్రభూ! పట్టుబడకుండా గుర్రం మీద పారిపోయాడు.


రాజభవనంలోకి ఎవడో
యథేచ్ఛగా వస్తూ, పోతూ ఉన్నాడు!
మొదట కాపలా
భటులను మార్పించు!
ఇదేదో కుట్రలాగా
ఉంది!


సరిహద్దు మార్గాలను
మూయించు! సైనిక
శిబిరాలను
ఏర్పాటుచేయించు!
చిత్తం,
మహాప్రభూ!


అమరసింహుడు దళనాయకులతో చర్చలు
జరిపాడు.
మనం ఏ క్షణంలోనైనా
పొరుగురాజ్యం మీదికి
దండెత్తవలసి వుంటుంది.


సైనికులు ఉత్సాహంగా ఆయుధ శిక్షణలో పాల్గొనసాగారు.


ఎవడో అజ్ఞాతవ్యక్తిలా ఉన్నాడు.
వెంటనే ఈ సంగతి
మానవేంద్రుడికి
తెలియజేయాలి!
-(ఇంకావుంది)

# నీటిని పొదుపుచేద్దాం!

వీణ తల్లితండ్రులతో కలిసి చెన్నయ్‌లో వున్న మామయ్య సురేష్ ఇంటికి బయలు దేరింది. ఆమె మనసు ఆనందోత్సాహాలతో ఉరకలు వేస్తోంది.

రైల్వేస్టేషన్ నుంచి టాక్సీలో వెళుతూంటే ఆకాశాన్నంటే ఎత్తయిన భవనాలు చూసి అబ్బుర పడింది వీణ. ఇంటి గేటు వద్ద ఎదురు వచ్చి, టాక్సీ నుంచి దిగుతూన్న వీణనూ, ఆమె తల్లితండ్రులనూ ఆప్యాయంగా పలకరించారు అత్తయ్య రేణుక, మామయ్య సురేష్, వాళ్ళ పిల్లలు అజయ్, విజయ్‌లు.



వీణ కాళ్ళు చేతులు కడుక్కోవాలన్నది. అత్తయ్య బాత్‌రూమ్ చూపుతూ, "వీణా, ఉదయం, సాయంకాలం కలిపి గంటసేపు మాత్రమే నీళ్ళు వస్తాయి. బిందెలలో, బక్కెట్లలో నింపివుంచుకుంటాం. నీళ్ళు కాస్త మితంగా ఉపయోగించు బుజ్జీ," అన్నది నవ్వుతూ.

ఆ మాటకు వీణ ఆశ్చర్యపోయింది. బాత్‌రూంలో నిలబడడానికి చోటులేదు. గదినిండా చిన్నా, పెద్దా పాత్రలే. "ఏం చేస్తాం, వచ్చే ఆ కొద్ది సేపట్లోనే పట్టేసుకోవాలి కదా. లేకుంటే అవసరానికి నీటిబొట్టు దొరకదు. బహుశా ప్లాస్టిక్ బిందెలతో జనం పడిగాపులు కాయడం దారిపొడవునా నువ్వు చూసే ఉంటావు," అన్నది రేణుక మళ్ళీ.

"అవును, అత్తయ్యా. అయినా, మా ఊళ్ళో నీళ్ళ కరువేలేదు. హాయిగా కావలసినంతవాడుకోవచ్చు. సరే, ఇంతటి నీటిఎద్దడిలో ఎలా మీరు నెట్టుకు వస్తున్నారు?" అని అడిగింది వీణ ముక్కుపై వేలేసుకుంటూ.

"నీటిని పొదుపు చేయడానికి రకరకాల పద్ధతులు అవలంబిస్తాం. పాత్రల జిగట పోవడానికి వాటిని కడగడానికి ముందు కాస్సేపు నానబెడతాం. అప్పుడు కడగడానికి కొద్దిపాటి నీళ్ళే సరిపోతాయి. పళ్ళు, కూరగాయలు కడగడానికి పెద్ద గిన్నెలను ఉపయోగిస్తాం. వాషింగ్ మెషీన్‌కు ఎక్కువ నీళ్ళు కావాలి గనక, ఫుల్‌లోడ్ బట్టలు ఉన్నప్పుడే దానిని ఉపయోగిస్తాం. ఇంట్లోని కొళాయిల్లో ఏమాత్రం లీకేజ్, లోపం వచ్చినా వెంటనే బాగుచేయిస్తాం. కాళ్ళు చేతులు కడుక్కోవడానికీ, స్నానానికీ, నీళ్ళను మితంగా ఉపయోగిస్తాం. వీటన్నిటికీ మించి వర్షపు నీటిని సేకరించడానికి మా ఇంట్లో చక్కని ఏర్పాటు చేశాం. ఇవన్నీ నీటి కొరతను తట్టుకోవడానికి ఎంతైనా ఉపయోగపడతాయి," అన్నది అత్తయ్య రేణుక.

"అత్తయ్యా, నాకిప్పుడు నీటివిలువ బాగా తెలిసి వచ్చింది. ఇకపై నీళ్ళను ఒక్క చుక్క కూడా వృథా చేయను. ఈ సంగతి నా స్నేహితులకు కూడా చెబుతాను," అన్నది వీణ సంతోషంగా.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## విజ్ఞాన వీచికలు :

### ఝుంకార ధ్వని

తేనెటీగలు గుంపుగా వెళ్ళేప్పుడు ఝుం అంటూ వెళతాయి. అది మనకందరికీ తెలుసు. తేనెపిట్టలాంటి ఒక అందమైన పిట్ట ఎగిరేప్పుడు కూడా ఇలాంటి శబ్దమే వస్తుంది. అందుకే దీనికి 'హమ్మింగ్ బర్డ్' అనే పేరువచ్చింది. మామూలుగా పక్షులు రెక్కలల్లా రుస్తూ ముందుకు దూసుకువెళతాయి. అయితే, హమ్మింగ్ బర్డ్ నిటారుగా పైకి ఎగురుతుంది. ఇది హెలికాప్టర్‌లాంటిది. పైకీ, కిందికీ, కుడివైపుకూ, ఎడమవైపుకూ తల్లకిందులుగానూ సునాయాసంగా ఎగరగలదు! పువ్వు నుంచి మకరందాన్ని జుర్రుకుంటూన్నప్పుడు అది అలాగే నిశ్చలంగా నిలబడడం అత్యద్భుతమైన విన్యాసం!

ఇది సెకనుకు 50-60 సార్లు రెక్కలల్లారుస్తుంది. దక్షిణ అమెరికాలోని కొన్ని హమ్మింగ్ బర్డ్స్ నిమిషానికి 5000 సార్లు రెక్కలను కొట్టుకోగలవు. అంటే రెక్కలు కదలడమే మనకు కనిపించదన్నమాట.

ఇవి ఇలా ఎత్తుకు ఎగరడానికి చాలినంత శక్తి కావాలి గనక, పది నిమిషాలకోసారి ఏదైనా తింటూ ఉంటాయి!



## మన పరిసరాలు :

### ఎడారులలోనూ జంతువులు ఉంటాయి



ఎడారులు జంతువులకు నివాసయోగ్యాలు కావు. నీటిబొట్టు కరువయ్యే ఎడారి ప్రాంతాలలో విపరీతమైన వేడి, భయంకరమైన చలి, రక్షణ లేకపోవడం మొదలైన ప్రతికూల వాతావరణం, పరిసరాల కారణంగా జంతువులు బతకలేవు. అయినా, ఇలాంటి జటిల సమస్యల మధ్య కూడా కొన్ని జంతువులు జీవిస్తున్నాయి.

ఆఫ్రికాలోని రాయిరప్పలు నిండిన ఎడారులలో నివసించే ఆగామా అనే తొండనే తీసుకుందాం. ఈశాన్య ఆఫ్రికాలో మాత్రమే కనిపించే ముళ్ళతోకగల ఈ తొండ బలమైన తన గోళ్ళతో దాదాపు రెండు మీటర్ల లోతున బొరియలు తీస్తుంది. వీటిలో జొరబడి పగటి ఎండకూ, రాత్రి చలికీ రక్షణ కల్పించుకుంటుంది.

ముళ్ళతోవున్న రంపంలాంటి తోక ఆయుధంలా పనిచేస్తుంది. ఇది ఆత్మరక్షణకు కూడా ఉపయోగపడుతుంది.

## మీకు తెలుసా?

### గింజలే ప్రధానం

పోకచెట్ల ఉపయోగం, విలువ అవి ఇచ్చే గింజల మీదే ఆధారపడి ఉన్నాయి. వాటి గింజలకు వ్యాపారరీత్యా గొప్ప విలువ ఉంది. ఈ గింజలలోని 'టానిన్' అనే రసాయనిక పదార్థాన్ని నలుపు, ఎరుపు సిరా తయారు చేయడానికి ఉపయోగిస్తారు. ఈ గింజలను వేయించి పొడిచేసి పళ్ళపొడి కూడా తయారుచేస్తారు.

సన్నటి కాండంతో పద్దెనిమిది నుంచి ఇరవై మీటర్ల



ఎత్తు వరకు పెరిగే పోకచెట్లు చాలా అందంగా ఉంటాయి. చెట్లకు కొమ్మలుండవు. కాండం పదిహేను సెం.మీ. వ్యాసంతో ఉంటుంది. చెట్లు నాటిన ఐదేళ్ళకు కాపుకు వస్తాయి. సంవత్సరానికి దాదాపు మూడువందల కాయలు కాస్తాయి. వర్షం సమృద్ధిగా కురిసే కేరళ, పశ్చిమ బెంగాల్, అస్సాం ప్రాంతాలలో పోకచెట్లు విరివిగా కనిపిస్తాయి.

## లోకజ్ఞానం :

### మన పార్లమెంటు

1. లోకసభలో ప్రస్తుతమున్న మొత్తం స్థానాలు ఎన్ని?





2. భారత ప్రధానిని ఎవరు నియమిస్తారు?

3. ఓటు వేసే హక్కు ఏ వయసులో వస్తుంది?





4. ఉపరాష్ట్రపతిని ఎవరు ఎన్నుకుంటారు?

5. మనరాజ్యాంగంలో భారతదేశం ఎలా నిర్వచింప బడింది?





6. రాజ్యాంగం కల్పిస్తున్న ప్రాథమిక హక్కులు ఎన్ని?

(సమాధానాలు 66వ పేజీలో)

# ఫోటో వ్యాఖ్యల పోటీ



ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని,
చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా?
రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



TAJY PRASAD



NARAYANA MURTHY TATA

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జూలై 2004 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.



## అభినందనలు

మార్చ్ నెల పోటీ ఫలితాలు

అంబటి అప్పారావు
ఫ్లాట్ నెం. S-5
నాగార్జున అపార్ట్‌మెంట్స్
వెంకటనగర్, కాకినాడ - 533 003.

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : ఇంతేనా ఈ జీవితం ...
రెండవ ఫోటో : కాదు కాదు ...
తిరిగే రంగుల రాట్నం!

## సమాధానాలు

1. 543 (మరిద్దరు నామినేటెడ్ సభ్యులు)
2. బలపరచే పార్టీ(లు) ఎన్నుకున్న తరవాత రాష్ట్రపతి నియమిస్తారు.
3. పద్దెనిమిది సంవత్సరాలు.
4. లోక్‌సభ, రాజ్యసభ సంయుక్తంగా.
5. సర్వసత్తాక, సోషలిస్ట్, లౌకిక, ప్రజాస్వామ్య గణతంత్రం (రిపబ్లిక్)
6. ఏడు.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : B. Viswanatha Reddi (Viswam)

## మూడు ఆలయాలు వెలసిన ఈ తెల్ల బండరాతి కొండ ప్రపంచంలోని అతి ప్రాచీనమైన కొండలలో ఒకటి! శాశ్వతమైన పునాదుల సుస్థిరతను చాటుతోంది!

83 మీటర్ల ఎత్తయిన ఈ కొండ 3800 మిలియన్ సంవత్సరాల నాటిది. అంటే ఇది హిమాలయాలకన్నా ప్రాచీనమైన దన్నమాట! మేధాసంపన్నులైన పల్లవులు, నాయకరాజులు దీనిని ఆలయ పునాదులుగా, గుహాలయాలుగా, కోటగా మలిచారు. కాలప్రవాహానికి ఎదురొడ్డి కనులవిందు చేస్తున్న కళాఖండాలు ఇవి. సందర్శించండి. సెలవులను మరపురాని మహోత్తర ఘడియలుగా మీ హృదయాలలో పదిలపరచుకోండి! కొండకోటగా ప్రసిద్ధిగాంచిన బ్రహ్మాండమైన ఈ బండరాతి కొండ తమిళనాడులోని తిరుచ్చిలో ఉంది!

ఈ పురాతన
అద్భుతాలను
ఇంకా చూడలేదా?






For details on TTDC's attractive package tours with excellent accommodation and transport facilities, please contact: TTDC, Tamilnadu Tourism Complex, Wallajah Road, Chennai - 600 002. Tamilnadu, India. Ph: 91-044-25388785 / 25361640. Fax: 91-044-25382772. E-mail: ttdc@md3.vsnl.net.in Website: www.tamilnadutourism.org For online bookings: www.ttdconline.com Call: Chennai 91-044-25389857, 25383333 New Delhi 91-011-23745427 Mumbai 91-022-24110118 Goa 91-0832-2226390 Bangalore 91-080-22286181 Hyderabad 91-040-27667492 Kolkata 91-033-22437432



పాల్గొనండి



# ఒలింపిక్ క్విజ్ కాంటెస్ట్

## & చందమామ




2004 మేలో ప్రారంభించబడిన న్యూట్రిన్-చందమామ ఒలింపిక్ క్విజ్ కాంటెస్ట్‌లో ఇది చివరిది. కింద ఇవ్వబడే ప్రశ్నలు ఆసక్తికరంగానూ, క్రీడల పరిజ్ఞానాన్ని పెంపొందించేవిగానూ ఉంటాయి. వాటికి సరైన సమాధానాలను ఎంపికచేసి, ఎంట్రీ ఫారాన్ని పూర్తిచేసి, న్యూట్రిన్ చాక్లెట్ ఎక్లెయిర్స్ 5 రేపర్స్‌తో పాటు ఈ పేజీని కత్తిరించి ముగింపు తేదీలోగా న్యూట్రిన్‌చందమామ కాంటెస్ట్, చందమామ ఇండియా లిమిటెడ్, 82 డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097కు పంపండి.

ఇది ఒక అఖిల భారత పోటీ. ప్రతినెలా ఈ పేజీ కోసం చూడండి. పోటీలో పాల్గొనండి. నెలనెలా 3 కోనికా కెమేరాలు, 10 కాల్క్యులేటర్లు, 50 న్యూట్రిన్ స్వీట్ హాంపర్స్ వరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులుగా ఇవ్వబడతాయి. 5 నెలల పోటీ అనంతరం, 6వ నెలలో జరిగే బంపర్ డ్రాలో, విజేత సాధారణ బహుమతులతో పాటు ఒక పర్సనల్ కంప్యూటర్‌ను కూడా అందుకుంటాడు. 6 నెలలు జరిగే అన్ని పోటీలలోనూ పాల్గొనేవారికి మాత్రమే బంపర్ డ్రాలో పాల్గొనే అర్హత ఉంటుంది. బంపర్ డ్రా ఫలితాలు డిసెంబర్ నెలలో పోస్ట్ ద్వారా తెలియజేయబడగలవు.







### న్యూట్రిన్-చందమామ ఒలింపిక్ క్విజ్ కాంటెస్ట్-6

క్రింది ప్రశ్నలను జాగ్రత్తగా చదివి సరైన సమాధానాన్ని నిర్ణీత ఖాళీ బాక్స్‌లో టిక్ [✓] మార్క్‌తో సూచించండి.

1. ఇంతవరకు ఇండియా ఎనిమిది బంగారు పతకాలు సాధించిన ఏకైక ఒలింపిక్స్ ఈవెంట్ ఏది?
   ☐ వెయిట్ లిఫ్టింగ్ ☐ టెన్నిస్ ☐ హాకీ
2. వరుసగా 1928, 1932, 1936 ఒలింపిక్స్‌లో 36 గోల్స్ చేసిన భారతీయ హాకీ క్రీడాకారుడు ఎవరు?
   ☐ ధన్‌రాజ్ పిళ్ళై ☐ మిల్ఖాసింగ్ ☐ ధ్యాన్‌చంద్
3. 2000 సిడ్నీ ఒలింపిక్స్‌లో కాంస్య పతకం సాధించిన భారతీయ మహిళ ఎవరు?
   ☐ కుంజురాణి దేవి ☐ కరణం మల్లేశ్వరి ☐ షైనీ విల్సన్
4. ఒలింపిక్ విమన్స్ డిస్కస్‌త్రోలో ప్రపంచరికార్డు పొందివున్న వారెవరు?
   ☐ మార్టినా హెల్మన్ ☐ ఇలానా స్లూపియానక్ ☐ ట్రయిన్ హాట్‌స్టడ్
5. ఈ సంచికలోని న్యూట్రిన్ ప్రకటనలో ఉన్న మొత్తం 'Y'లు ఎన్ని?
   ☐ 4 ☐ 3 ☐ 2

### మీకు తెలుసా?



1900 ప్యారిస్ గేమ్స్‌లో ప్రవేశ పెట్టబడిన టగ్-ఆఫ్-వార్ ఆ తరవాత కేవలం ఐదేళ్ళ వరకే కొనసాగింది.

<u>పోటీ నిబంధనలు:</u> • న్యూట్రిన్, చందమామ సంస్థల ఉద్యోగులుగాని, వారి బంధువులుగాని ఈ పోటీలో పాల్గొన కూడదు • న్యాయ నిర్ణేతలను ఎంపికచేసే హక్కు న్యూట్రిన్ సంస్థకు మాత్రమే ఉంటుంది • భారతీయ సంతతికి చెందిన 15 ఏళ్ళలోపు పిల్లలు మాత్రమే ఈ పోటీలో పాల్గొనడానికి అర్హులు • పోటీని పొడిగించడం లేదా ముందుగానే ముగింపే ప్రత్యేక హక్కు ఒక్క న్యూట్రిన్‌కు మాత్రమే ఉంటుంది • వయసును ధ్రువపరచడానికి బర్త్ సర్టిఫికెట్‌ను జతపరచాలి • అన్ని సరైన సమాధానాలుగల ఎంట్రీల నుంచి లాటరీ పద్ధతి ద్వారా విజేతలను ఎంపిక చేయడం జరుగుతుంది • విజేతలకు పోస్ట్ ద్వారా సమాచారం తెలియజేయబడుతుంది • బహుమతి వస్తువులకు బదులుగా నగదు ఇవ్వబడదు • బహుమతి వస్తువులకు ఇచ్చే గ్యారంటీ వాటి ఉత్పత్తి దారులకు సంబంధించినది మాత్రమే • ఒకపోటీదారు నెలకు ఒకే ఒక ఎంట్రీని మాత్రమే పంపాలి • అలాంటి ఒకటిరెండు పోటీలలో గానీ, మొత్తం ఆరు పోటీలలో గానీ పాల్గొనవచ్చు. • ఎంట్రీఫారాలతో ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ అంగీకరించ బడవు • ఎంట్రీ ఫారంలో మీరుచేసే సంతకం, పోటీ నియమనిబంధనలకు మీ అంగీకారంగా భావించబడుతుంది. • ముగింపు తేదీ తరవాత చేరే ఎంట్రీలు అంగీకరించ బడవు • అన్ని సరైన సమాధానాలు గల ఎంట్రీలు రానట్టయితే, ఎక్కువ సరైన సమాధానాలు గల ఎంట్రీల నుంచి డ్రా చేయడం జరుగుతుంది • న్యాయ నిర్ణేతలదే తుది నిర్ణయం.

**ముగింపు తేదీ : 31 అక్టోబర్ 2004**

పేరు : ..................................................

వయసు : .............. తరగతి : .............. పుట్టినతేదీ : ..............

ఇంటి చిరునామా & పిన్‌కోడ్ : ..................................................

..................................................

సంతకం : ..................................................




India's largest selling sweets and toffees

చందమామ

సంపుటి: 111 అక్టోబర్ 2004 సంచిక:4

## ఈ నెల విశేషాలు



భల్లూక మాంత్రికుడు-12

13



జ్యోతిష్యానికి జ్యోష్యం (బే.క)

19



రొట్టెలో నగలు
విదేశ పూర్వగాథలు
(ఆఫ్ఘనిస్థాన్)

26



విష్ణు కథ-10

45

## ఈ సంచికలో...

★ అమ్మవారి మహత్తు ...8 ★ వాక్శుద్ధి ...9 ★ భల్లూక మాంత్రికుడు-12 ...13 ★ జ్యోతిష్యానికి జ్యోష్యం (బే.క) ...19
★ భారత దర్శిని ...25 ★ విదేశ పూర్వగాథలు (ఆఫ్ఘనిస్థాన్) రొట్టెలో నగలు ...26 ★ మూగజీవిసాక్ష్యం ...28 ★ దేవుడి ఉనికి ...29
★ చందమామ కబుర్లు ...33 ★ కథల పోటీ ...34
★ జాలిగుణం ...35 ★ మహారాష్ట్ర జానపద కథ: శనివారం వింతలు-విడ్డూరాలు! ...38 ★ పంచాయుధుడు ...42
★ విష్ణు కథ-10 ...45 ★ వ్యాపారంలో పోటీ ...51 ★ విదేశాల కథలు: చెరూకీ కథ - ఏడుపంది-పొట్టితోక! ...52 ★ నల్లపిచ్చుక ...56
★ ఆర్య-16 ...59 ★ పచ్చని ప్రపంచం! ...63
★ విజ్ఞానం ... వినోదం ... వికాసం ...64
★ ఫోటో వ్యాఖ్యల పోటీ ...66

**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**

*- Remittances in favour of Chandmama India Ltd.*
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail:
subscription@chandamama.org

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు పన్నెండు సంచికలు రూ: **900**

ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.**144.00**

చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# ఇప్పుడే ప్రారంభించాలి

ఏథెన్స్ క్రీడల్లో మేజర్ రాజ్యవర్ధన్ సింగ్ రాథోడ్ రజత పతకం సాధించి చరిత్ర సృష్టించాడు. 108 సంవత్సరాల క్రితం ఆధునిక ఒలింపిక్ క్రీడలు ఆరంభమయ్యాక ఇండియా సాధించిన మొట్టమొదటి వ్యక్తిగత రజత పతకం ఇది. దేశప్రజలందరూ పరవశించి, రాథోడ్‌ను ముక్తకంఠంతో అభినందించారు!

మనం ఇంతకు పూర్వం కొన్ని వ్యక్తిగత కాంస్య పతకాలూ, హాకీ టీమ్ ఈవెంట్‌లో కొన్ని బంగారు పతకాలూ సాధించాము. అయితే, ఇటీవలి కాలంలో హాకీలో సైతం మన ఆధిక్యతను నిలుపుకోలేక పోవడం విచారకరమైన విషయం.

ఏథెన్స్‌లో మనవారి ఘోర వైఫల్యాన్ని తలుచుకుని విచారించి ప్రయోజనం లేదు. అయితే, మునుముందయినా ఒలింపిక్ స్థాయిని అందుకోవడానికి యువక్రీడాకారులకు కల్పించవలసిన అవకాశాలు, అందించవలసిన శిక్షణ, ఉత్సాహప్రోత్సాహాలు-అందుకు రూపొందించవలసిన పథకాలూ మొదలైన అంశాలను గురించి లోతుగా అధ్యయనం చేసి, సత్వర చర్యలు తీసుకోవలసిన అవసరం ఎంతయినా వుంది.

మన దేశంలో స్పోర్ట్స్ అకాడెమీలు ఉన్నాయి. అయితే ఇవి ప్రత్యేక శిక్షణలు మాత్రమే ఇస్తున్నాయి. సామాన్య విద్యను గురించి పట్టించుకోవడం లేదు. ప్రస్తుత పరిస్థితులలో ఈ అకాడెమీలు, క్రీడల్లో ప్రత్యేక శిక్షణ ఇవ్వడంతో పాటు డిగ్రీ చదువులు కూడా ఇప్పించి ఉద్యోగావకాశాలు కల్పిస్తే వీటి పట్ల యువతీయువకుల ఆసక్తి పెరుగుతుంది. అలా కానప్పుడు ఇవి ఆశించినంత ప్రాముఖ్యతను సంతరించుకోలేవు.

ఇండియా మూడుసార్లు ఆసియా క్రీడలు నిర్వహించింది. 2010లో కామన్వెల్త్ క్రీడలు జరుపనున్నది. ఒలింపిక్ క్రీడలను జరిపే ఆసక్తి కూడా లేకపోలేదు. అలాంటప్పుడు మునుముందు మన క్రీడాకారులు దేశానికి పేరు ప్రఖ్యాతులు తీసుకురావాలంటే ఇప్పటి నుంచే అర్హులను గుర్తించి, తగిన శిక్షణ, ఉత్సాహప్రోత్సాహాలు అందజేయాలి.

సంపాదకుడు : విశ్వం

Visit us at : http://www.chandamama.org

# గిరిజన బాలల కోసం
# ఓ అందాల పత్రిక ఆవిర్భావం




ప్రచురణారంగంలో 57 సంవత్సరాలుగా విశిష్ట సేవలందిస్తూ, విజయ పథంలో కొనసాగుతూన్న 'చందమామ' - సంతాలీ భాషలో 'చందొమామొ'ను ప్రారంభించి మరో నూతన అధ్యాయాన్ని సృష్టించింది!

పూర్తి వర్ణచిత్రాలతో ఒక గిరిజన భాషలో వెలువడుతూన్న మొట్టమొదటి పిల్లల మాసపత్రిక చందొమామొ. గురు గోమ్కె పండిట్ రఘునాథ్ ముర్ము రూపొందించిన ఓల్చికి లిపిలో ఇది ప్రచురించబడుతున్నది.

2004 ఆగస్ట్ 15వ తేదీ భువనేశ్వర్‌లో ఒరిస్సా ముఖ్యమంత్రి శ్రీ నవీన్ పట్నాయక్ ప్రారంభ సంచికను లాంఛనప్రాయంగా ఆవిష్కరించారు. ఆయన మన సంస్థ ఉదాత్త ఆశయాన్ని ప్రశంసిస్తూ, ఈ వినూత్న ప్రయత్నానికి శుభాకాంక్షలు తెలియజేశారు. ఆయనకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాం.

శ్రీమతి ద్రౌపది ముర్ము ఎం.ఎల్.ఏ అధ్యక్షతన పనిచేస్తూన్న సంతాలీ చందొమామొ కమిటీ సంపూర్ణ సహాయ సహకారాల పర్యవసానంగానే ఈ సంతాలీ ప్రచురణ సుసాధ్యమయింది. ఈ విషయంలో ఆ కమిటీకి మేమెంతో ఋణపడి ఉన్నాం. ఈ శుభ సందర్భాన్ని పురస్కరించుకుని తక్కర్ బాపా ఆదివాసి హాస్టల్ ప్రాంగణంలో మొక్కలు నాటే కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు.

విలక్షణమైన ఈ పిల్లల పత్రిక ఆవిర్భావాన్ని గురించి విపులంగా వార్తలు ప్రచురించిన పత్రికలకూ, ప్రసారం చేసిన ఎలక్ట్రానిక్ మాధ్యమానికీ మా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

ప్రచురణకర్త

పాఠకులకు కథల పోటీ (మే)

## ఉత్తమ బహుమతి పొందిన ముగింపు!



రాజభవనం ముందు గుమిగూడిన వేలాది మందికి చాలినన్ని ఇళ్ళు నిర్మించడానికి కావలసినన్ని వనరులు లేవని విచారగ్రస్తుడైన రాజును సమీపించి మంత్రి ఇలా అన్నాడు: "రాజా, ఇది పెద్ద సమస్య కాదు. పేదలకు ఇళ్ళు నిర్మించడానికి ముఖ్యంగా కావలసినవి కలప, వెదురు, గడ్డి, మట్టి, రాళ్ళు. కొన్నేళ్ళుగా సకాలంలో వర్షాలు కురవడం వల్ల అడవిలో చెట్టు చేమలు దట్టంగా పెరిగాయి. కలప, వెదురు కావలసినంత ఉన్నవి. మనరాజ్యంలో సుగంధద్రవ్యాలు తయారు చేయడం కోసం రైతులు నిమ్మగడ్డిని విస్తారంగా సాగు చేస్తున్నారు. రసం తీశాక ఆ గడ్డిని ఇంటి పైకప్పుగా ఉపయోగించడం వల్ల, ఇంటికి వేసిన కలపకు, వెదురుకు చెదపట్టదన్న సంగతి మీకు తెలియనిది కాదు. ఇక మన రాజ్యంలో మంచి మట్టికీ, రాళ్ళకూ కొరతలేదు కదా? తమరు భోజన వసతి మాత్రం కల్పిస్తే చాలు. ప్రజలే స్వయంగా శ్రమించి, త్వరలో తమ ఇళ్ళు నిర్మించుకోగలరు," అన్నాడు.

మంత్రి సలహా రాజుకు నచ్చింది. ప్రజలు కూడా పరమానందంతో హర్షధ్వానాలు చేశారు.

రాజాజ్ఞ ప్రకారం ప్రజలు అడవికి వెళ్ళి, కలప, వెదురు; రైతుల నుంచి గడ్డి తెచ్చుకుని ఒకరికొకరు సాయంగా నిలబడి ఇళ్ళు నిర్మించుకున్నారు. రాజు దయాగుణాన్నీ, మంత్రి సలహానూ వేనోళ్ళ కొనియాడుతూ ప్రజలు చిరకాలం సుఖశాంతులతో జీవించారు.

కోరాడ మౌనిక, డాటరాఫ్ కె. రమణమూర్తి
కె. ఆయిల్ కంపెనీ, కొరసవాడ ఎ.టి.పి.ఓ
C/o. పాతపట్నం పోస్ట్, శ్రీకాకుళం జిల్లా (ఆం.ప్ర)

# అమ్మవారి మహత్తు

గరికపాడు అనే గ్రామంలో వున్న వాళ్ళందరూ చిన్నకారు రైతులు. చదువులేని అమాయకులు. అందరివీ పూరి ఇళ్ళు. ఒక్క మునసబు, కరణాలకు మాత్రం పెంకుటిళ్ళు వుండేవి. గ్రామం మధ్య అమ్మవారి గుడి వుండేది.

గ్రామంలోని రైతుల మధ్య ఐక్యత వుండేది కాదు. ప్రతి స్వల్ప విషయంలోనూ తరచుగా తగవులాడుకుంటూండేవారు.

ఒకనాటి ఎండాకాలంలో అర్ధరాత్రి, గ్రామంలోని ఒక పూరింటికి నిప్పంటుకుని భగ్గుమంటూ మంటలు లేచినై. అది చూసిన గ్రామస్తులు కేకలు పెడుతూ, ఒకరినొకరు హెచ్చరించుకుంటూ దాపులనున్న చెరువుకు పోయి కడవలతో నీళ్ళు తెచ్చి, మంటలు ఇతర ఇళ్ళకు పాకకుండా ఆర్పివేశారు.

ఆ తర్వాత తృప్తిగా తమ తమ ఇళ్ళకు పోతున్న గ్రామస్తులను గుడి పూజారి ఆగమంటూ చెప్పి, "మీరందరూ గ్రహించివుండరు. మన గుడి అమ్మవారు, తన మహత్తును మనకళ్ళ ఎదుట కట్టి చూపింది!" అన్నాడు.

పూజారి మాటలు గ్రామస్తులకు ఎవరికీ అర్థంకాలేదు. అందరూ మౌనంగా ఊరుకున్నారు. అప్పుడు పూజారి గొంతెత్తి, "మన అమ్మవారే గనక ఇంతటి కటిక చీకట్లో మంటల ద్వారా వెలుగు చూపక పోతే, అవి ఎక్కడున్నవో తెలుసుకుని ఆర్పడం మనకు సాధ్యపడేది కాదు గదా!" అన్నాడు.





# వాక్శుద్ధి

హరి, గిరి అనేవాళ్ళు, ఇరుగు పొరుగు ఇళ్ళల్లో వుంటున్న యువకులు. ఇద్దరికీ ఉద్యోగాల్లేవు. అయితే, ప్రవర్తనలో మాత్రం ఇద్దరికీ, ఏనుగుకూ, దోమకూ వున్నంత తేడా! హరి ఇంట్లో తల్లికీ, ఇంటి బయటి పనులకు తండ్రికీ అడగకుండానే వీలైనంత సాయం చేస్తూంటాడు. ఊళ్ళోని పెద్దలకు మర్యాద యిస్తాడు. తన ఈడు వారితో ఎంతో స్నేహంగా వుంటాడు. అందరూ హరిని మెచ్చుకుంటారు. తమ పిల్లలకు హరిలావుండాలని తరచూ చెబుతూంటారు.

గిరి ప్రవర్తన హరికి పూర్తిగా భిన్నం. అతడు అడిగినా ఎవరికీ ఏసాయమూ చేయడు. ఎక్కువ సేపు నిద్రపోతూంటాడు. పెద్దలను గౌరవించడు. పెద్దా చిన్నా అని లేకుండా అందరి తోనూ గొడవ పెట్టుకుంటాడు. అందరూ గిరిని తిట్టుకుంటారు. తమ పిల్లలకు గిరిలా వుండ కూడదని చెబుతూంటారు.

తనకు చెడ్డ పేరు వచ్చిందని గిరికి తెలుసు. అయితే అందుక్కారణం తన ప్రవర్తన అని అతడనుకోడు. హరి కారణంగానే తనకు చెడ్డ పేరు వచ్చిందని అందరితో అంటాడు. ఉత్త పుణ్యాన హరిని అవకాశం దొరికినపుడల్లా శాపనార్థాలు పెడతాడు.

ఇదంతా హరికి తెలుసు. అయినా అతడికి గిరిపట్లకోపంలేదు. ఎవరైనా గిరి చెడ్డవాడనీ అంటే, ''అందరి ప్రవర్తనా ఒక్కలాగావుండదు. కానీ అంతా గిరిని నాతో పోల్చి చిన్నబుచ్చు తూంటారు. అందుకే అతడికి నామీద కోపం. లేకుంటే మేమిద్దరం మంచి స్నేహితులమే!'' అనేవాడు.

ఇలావుండగా, ఒక రోజున గిరి మేనమామ శంకరయ్య, ఆ ఊరువచ్చాడు. కాసేపు గిరితో మాట్లాడాక, ఆయన, ''బాబూ! నువ్వు చాలా తెలివైనవాడివి. మా ఊరు జమీందారుకు ఇద్దరు చురుకైన కుర్రాళ్ళు కావాలి. ఒకడు పనికీ, మరొకడు కబుర్లకీ. నువ్వేమో జమీం దారుకు కబుర్లు చెప్పికాలక్షేపం చేస్తే, మీ పొరుగింటి హరి పనులు చేసి పెడతాడు. జమీందారు, మీ ఇద్దరూ జంటగా వెళితే

శ్రీరామ కమల్



''నాకుద్యోగం రాకున్నా ఫరవాలేదు కానీ, హరికి మాత్రం రాకూడదు. అందుకే, జమీం దారు దగ్గరకు జంటగా వెళ్ళి ఉద్యోగమడ గడం, నాకిష్టం లేదు,'' అన్నాడు గిరి ఆవేశంగా.

''ఆ హరి ఎంతో మంచివాడు. అతడంటే ఎందుకురా నీ కంత కోపం?'' అని అడిగాడు శంకరయ్య.

''వాడు మాయగాడు. తను మంచివాడి నని అందర్నీ ఇట్టే నమ్మిస్తాడు. వాడితో పోల్చి అంతా నన్ను చెడ్డవాడనుకోవాలని వాడి ఉద్దేశ్యం. అందువల్ల, నేను పైకి వచ్చినా రాకున్నా వాణ్ణి మాత్రం పైకిరానివ్వను,'' అన్నాడు గిరి.

శంకరయ్యకు తన మేనల్లుడి ఓర్వలేని గుణం అర్థమైంది. ఆయన ఆ రోజే వెళ్ళి హరిని కలుసుకుని విషయం చెప్పి, ''మీ ఇద్దరికీ ఇది చాలా మంచి అవకాశం. నువ్వు ఎలాగో గిరికి నచ్చజెప్పే ప్రయత్నం చేయి,'' అన్నాడు.

ఇందుకు హరి సరేనని, ఆ సాయంత్రం గిరి వద్దకు వెళ్ళాడు. అతడు హరి చెప్పిం దంతా శ్రద్ధగా విని, ''ఆ జమీందారు మంచి వాడు కాదని, వాళ్ళూ వీళ్ళూ అనుకుం టూండగా విన్నాను. ఆయన మనిద్దరికీ పనియిచ్చినా, తర్వాత కొన్నాళ్ళకు నన్ను పనులు చేయమంటాడు; నిన్ను కబుర్లు చెప్పమంటాడు. నేను పనులు సరిగ్గా చెయ్య డంలేదనీ, నువ్వు కబుర్లు సరిగ్గా చెప్పడం లేదనీ తిట్టడం మొదలు పెడతాడు. అందుకే ఆ ఉద్యోగాలు వద్దన్నాను,'' అన్నాడు.

''ఇదంతా నీ ఊహ అని నాకనిపిస్తున్నది. మరొకసారి బాగా ఆలోచించు,'' అన్నాడు హరి.

తప్పక ఉద్యోగాలిస్తాడు. ఆయన ఇచ్చే నెల జీతం కూడా చాలా ఎక్కువే వుంటుంది,'' అన్నాడు.

''నేను ఒక్కణ్ణే వెళ్ళి అడిగితే, నాకు ఉద్యోగం ఇవ్వడా మీ జమీందారు?'' అని అడిగాడు గిరి.

''ఇవ్వడు! కబుర్లు చెప్పేవాడికి తనతో సమానంగా జీతమిస్తే, పని చేసేవాడికి అసం తృప్తిగా వుంటుంది. అలాగని కబుర్లు చెప్పే వాడికి తక్కువ జీతమిస్తే వాడికి అసంతృప్తి పుట్టి కబుర్లు సరిగా చెప్పలేడు. అందుకని ఆ జమీందారు, ఇందుకు అభ్యంతరం చెప్పని జంటయువకులకే, ఈ ఉద్యోగాలిస్తాడు. మీ హరి చాలా మంచివాడు. మీరు జంటగా వెళితే తప్పక ఈ ఉద్యోగాలు దొరుకుతాయి. వాటిలో మీరు తప్పక రాణిస్తారు,'' అన్నాడు శంకరయ్య.

ఇందుకు గిరి చిరాగ్గా, "పోనీ, ఊహే అను కుందాం. అయినా నాకు వాక్శుద్ధివుంది. నేనేమంటే అది జరుగుతుందని, మా ఇంట్లో అంతా అంటారు. వారం రోజుల క్రితం నాకు జున్ను తినాలనిపించి, ఇంట్లో పాలన్నీ విరిగి పోతే బాగుండునన్నాను. ఆ రోజు పాలు విరిగి పోయాయి. మూడు రోజుల క్రితం పెరట్లో మొక్కలకు నీళ్ళు పొయ్యమని అమ్మ బల వంత పెడితే, కాసేపట్లో వాన పడుతుందిలే అన్నాను. నిజంగానే వాన పడింది. ఇప్పుడు జమీందారు దుష్టుడు అన్నాను. ఆ మాటా నిజమే అవుతుంది. నా మాట నమ్ము" అన్నాడు.

"నీ ఊహ నిజమైనా కాకపోయినా, నాకు చాలా మంచి అవకాశం పోయిందని ఎంతో బాధగావుంది," అన్నాడు హరి.

"అవకాశం నాకూ పోయిందిగా! అయినా, నామూలంగా నీకు మంచి అవకాశం పోయిం దని నువ్వనుకుంటున్నావు. కానీ అది నిజం కాదు. నీకు ఇంతకంటే గొప్ప అవకాశం తొందరలో వస్తుంది. అప్పుడు నీవు ఈ అవ కాశం పోయినందుకు ఎంతగానో సంతోషి స్తావు. మరొకసారి చెబుతున్నాను నా మాట నమ్ము. నాకు వాక్శుద్ధివుంది. నా మాట తప్పదు," అని గిరి తన ఉద్దేశ్యం ఖచ్చితంగా చెప్పేశాడు.

హరి మంచివాడు కాబట్టి ఇంకేమీ అనలేక తిరిగి వెళ్ళాడు.

అయితే, ఆశ్చర్యంగా మరి నాలుగు రోజులకు, హరికి దూరపు బంధువు కేశవుల నుంచి కబురొచ్చింది. కేశవులు పట్నంలో వుంటున్నాడు. ఆయన సముద్రయానం చేసి రకరకాల వ్యాపారాల ద్వారా, కూర్చుని తిన్నా తరతరాలు తరగనంత ఆస్తిని సంపాదిం చాడు. ఆయనకు పిల్లలు లేరు. ఇప్పుడు



ముసలివాడై పట్నంలో విశ్రాంతి తీసుకుంటు న్నాడు. తన ఆస్తిని ధర్మకార్యాలకు విని యోగించాలని ఆయన కోరిక. అందుకు సమర్థుడు, మంచివాడు అయిన యువకుడు కావలసివస్తే, ఎవరో ఆయనకు హరి పేరు చెప్పారు. తన ఆస్తిలో నాలుగోవంతు హరి కిచ్చి, తను అతడి వద్దనే వుంటూ, మిగతా ఆస్తిని ధర్మకార్యాలకు వినియోగించాలని ఆయన కోరుకుంటున్నాడు. ఆయన కోరిక మేరకు హరి పట్నం వెళ్ళి ఆయన్ను కలుసు కున్నాడు. ఆయనకు హరి నచ్చాడు. తర్వాత హరి తన ఊరువచ్చి, తనీస్థితికి చేరుకు నేందుకు సాయపడినవారందరికీ పేరుపేరునా కానుకలిచ్చాడు. వారిలో తలిదండ్రులు, అన్నదమ్ములు, గురువులు, మిత్రులు వున్నారు కానీ గిరి లేడు.

గిరి అతణ్ణి కలుసుకుని, "నా వాక్శుద్ధి వల్లనే నీకీ ఉన్నత స్థితికలిగింది. ఎంతో మంచివాడివని పేరు పొందిన నువ్వు, నా విషయం మరిచిపోవడం విచిత్రంగా వుంది," అన్నాడు.

ఇది వింటూనే హరి చీదరింపుగా, "నాకు ఉద్యోగంరాకూడదని, నీ ఉద్యోగావకాశాన్ని కూడా వదులుకున్న దుష్టుడివి. నీకు నిజంగా వాక్శుద్ధివుంటే, నాకు మేలు జరగాలని కోరు కోవుగాక కోరుకోవు. వాక్శుద్ధివుండాలంటే, మొదట మనసు నిర్మలంగావుండాలి. అది నీలో లేదు. ఆ పాలు విరగడం, వాన కురవడం -ఒకటి నీ స్వార్థంకోసం, రెండోది పని తప్పించు కునేందుకు అన్నవే. మరొక సంగతి; తాను చెప్పినచెడుపనులు జరిగినట్టయితే, అలాంటి వారిని వాక్శుద్ధికలవారని చెప్పరు, నాలుక పైమచ్చగలవారని అంటారు!" అని హరి ఆగాడు.

గిరి వచ్చేకోపాన్ని బలవంతంగా ఆపు కుంటూ, "ఆగావేం? ఇంకేమైనావుంటే చెప్పు," అన్నాడు.

హరి అతడి ముఖంకేసి ఒకసారి పరీక్షగా చూసి, "చెప్పడానికి చాలావుంది. ప్రస్తు తానికి కానుకల సంగతి. నీకు కానుకలిస్తే, అర్హత లేని వారిని సన్మానించినట్లే! అది నేను సన్మానించిన మిగతా వారికి చిన్నతనం. కాబట్టి నేను నీకోసం ఏ కానుకా తేలేదు," అన్నాడు.

ఈ జవాబుతో గిరి మారుమాట్లాడక తల వంచుకుని అక్కణ్ణించి మౌనంగా వెళ్ళి పోయాడు.





# భల్లూక మాంత్రికుడు

## 12

*[దుర్ముఖరాజు కోటను ఆక్రమించిన సామంతుడు, తలారి భల్లూకుడూ వాళ్ళ పైకి, సైనికుల్ని పంపాడు. దొంగ నాగమల్లు సేనానాయకుడికి, తాను రాజు దుర్ముఖుణ్ణి బంధించి తెచ్చినట్టు చెప్పాడు. సామంతుడు తలారి భల్లూకుడి దగ్గిరకు వచ్చాడు. రాజు దుర్ముఖుడు ఉగ్రుడైపోయి, సామంతుడి మీదికి దూకాడు. సామంతుడు పారిపోసాగాడు. దుర్ముఖుడు వెంటబడ్డాడు. తరవాత- ]*

సామంతు భూపతి తన గుర్రాన్ని ఆపి, వెనుదిరిగి, వెంటబడి తరుముకు వస్తున్న రాజు దుర్ముఖుణ్ణి ఎదిరించే ప్రయత్నం చేయకుండా, తెరిచివున్న కోట ద్వారాలకేసి గుర్రాన్ని దౌడు తీయించసాగాడు. తమ రాజు అలా శత్రువుకు వెన్నిచ్చి పారిపోవటం చూసిన సేనాని కూడా, తన వెంటవున్న సైనికులను హెచ్చరించి, కోటవైపుకు గుర్రాన్ని తిప్పాడు.

సేనాని అలా పారిపోయే ప్రయత్నం చేస్తున్నంతలో, అతడి వెంటవున్న ధైర్యవంతులైన ఇద్దరు సైనికులు, అతడితో, "అయ్యా, మనపైకి దాడి వచ్చిన శత్రువులు పదిమంది అయినా లేరు. కొత్తగా రాజైన సామంతుణ్ణీ, పాతరాజు దుర్ముఖుణ్ణీ, అలా ఒకరినొకర్ని కత్తులతో నరుక్కోనిద్దాం. ఈ లోపల మనం శత్రువులను చుట్టుముట్టి హతం చేస్తే పాత, కొత్త రాజుల ప్రమేయం లేకుండా, మీరే ఉదయగిరికి రాజైపోవచ్చు," అన్నారు.

సైనికులు ఇలా అనగానే సామంతుడి సేనానికి ఒక కొత్త ఆశ పుట్టింది. అతడు గుర్రాన్ని వెనుదిప్పి, ఏనుగుల మీద వున్న తలారి భల్లూకుడు వాళ్ళకేసి చూశాడు.



దానిని చూడగానే సేనాని చప్పున గుర్రాన్ని వెనుదిప్పి, "ఒరే, మనం రాక్షసుల్నీ, గండ్ర గొడ్డళ్ళు పట్టిన ఎలుగుబంట్లనూ ఎదిరించి బతకలేం. కోట గోడలే మనకు శరణ్యం. రండి, కోట ప్రవేశిస్తూనే, ద్వారాలు బంధిద్దాం," అంటూ పారిపోసాగాడు.

సేనాని కోటకేసి పారిపోవటం చూస్తూనే చాలామంది సైనికులు అతణ్ణి అనుసరించారు. తలారి భల్లూకుడు,మొండి తొండ పుటేనుగు కుంభస్థలం మీద వున్న ఆటవికుడితో, "ఒరే, ఆటవిక సేవకా! నీ అలవాటు ప్రకారం, ఏదో పిట్టలను బాణాలతో కొట్టినట్టు, పారిపోతున్న సైనికులపై బాణాలు వదిలి, వాళ్ళను చంపకు. మనం దుర్ముఖ రాజును కొద్ది క్షణాలపాటు, పోయిన సింహాసనం మీద కుర్చోపెట్టి, అతడి తల తీసుకుని, భల్లూక మాంత్రికుడి దగ్గిరకు పోదాం. అనవసర రక్తపాతం ఎందుకు?" అన్నాడు.

భల్లూకుడు గొడ్డలి పైకెత్తి, దొంగ నాగమల్లూ, అతడి అనుచరుల్నీ; దుర్ముఖుడి అంగరక్షకుల్నీ హెచ్చరిస్తూ, "ఒరే, దుస్సాహసానికి పోయి రాజు దుర్ముఖుడు రాజ్యంతోపాటు ప్రాణాలు కూడా పోగొట్టుకునేలా వున్నాడు. మనం పక్కన లేకుండా అతడు, అంతమంది శత్రువుల మధ్యకు పోవటం చావు కోరితెచ్చుకోవటమే. ఇక కదిలి, అడ్డం వచ్చిన శత్రువులను నరుక్కుంటూపోతే తప్ప, లేకపోతే ఆ దుర్ముఖుణ్ణి రక్షించలేం," అన్నాడు.

ఆ మాటలు వింటూనే రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగదను పైకెత్తి, ప్రళయ భయంకరంగా హుంకరించి, "హేయ్, సామంతు సూర్యభూపతి సైనికుల్లారా, జాగ్రత్త! రాజు దుర్ముఖుడికి, మీలో ఎవరివల్లనైనా హాని జరిగిందో, మీ అందర్నీ చిత్రవధ చేస్తాను," అంటూ కోటవైపుకు బయలుదేరాడు.

ఏనుగుల పైన వున్న తలారి భల్లూకుడూ, దొంగనాగమల్లూ, దుర్ముఖుడిఅంగరక్షకులూ; రాక్షసుడు ఉగ్రదండుడి వెనక తమ వాహనాలను పరిగెత్తిస్తూ, కోట ద్వారాలను చేరేంతలో, సామంతు సేనాని కొందరు సైనికులతో కోట ప్రవేశించి, ద్వారాలను చప్పున మూయించాడు. అప్పటికింకా కోట ద్వారాలను సమీపించని కొందరు అశ్వికులూ, సైనికులూ ప్రాణభయంతో హాహాకారాలు చేస్తూ, కోట గోడల వెంట చెల్లాచెదురుగా పారిపోయారు.

రాక్షసుడు ఉగ్రదండుడు ముందుగా కోట ద్వారాలను సమీపించి, రాతి గదతో వాటి మీద గట్టిగా రెండుసార్లు పొడిచి, అవేమాత్రం

బెసకక పోవటంతో ఆశ్చర్యపోతూ, అక్కడి కొచ్చిన తలారి భల్లూకుడితో, "తలారి భల్లూకా! ఈ సామంతు సేనాని ఎంత పిరికి వాడో, అంత జిత్తులమారి ఘటం. ఇప్పుడేం చేయటం? రాజు దుర్ముఖుడు కోటలో ఒంట రిగా శత్రువుల మధ్య చిక్కుకుపోయాడు. అతగాడి ప్రాణాల మాటకేంగాని, భల్లూక మాంత్రికుడికి నువ్వు సమర్పించుకోవలసిన అతడి తల ఏమైపోతుందో అని నాకు దిగు లుగా వున్నది," అన్నాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు ఇలా అనగానే తలారి భల్లూకుడికి నిలువెల్లా కంపరం ఎత్తిపోయింది. దుర్ముఖుడి తల తీసుకు పోకపోతే, ఆ మాంత్రికుడు తనను బతికిన న్నాళ్ళూ, ఇలా భల్లూకంగానే వదిలేస్తాడు. మనిషిగా పుట్టి, ఎంతోకాలం మనిషిగా జీవిం చిన తను, అరణ్యాలు పట్టి, ఏ తేనెపట్టులో తింటూ జీవించటంకన్న నీచం మరొకటున్నదా!

తలారి భల్లూకుడు ఇలా అనుకుని, ఎలా అయినాసరే రాజు దుర్ముఖుడి ప్రాణాలు కాపాడాలన్న ఆవేశంతో గండ్రగొడ్డలి పైకెత్తి, "జై, దిరిశెనవన భైరవా!" అంటూ కేకపెట్టి, కోట ద్వారాల మీద బలంగా కొట్టాడు. గట్టి కొయ్యతో చేసిన తలుపుల మీద, బలమైన ఇనుప రేకు తాపడం చేసిన ద్వారాలు, ఆ దెబ్బకు చెక్కు చెదరకపోగా, వాటి తాకిడికి తలారి భల్లూకుడి చేతిలోని గండ్రగొడ్డలి ఎగిరి అంత దూరం పోయి కింద పడింది.

ఏనుగు మీద ముందు కూర్చున్న ఆటవి కుడు ఎగిరి కిందికి దూకి, పరిగెత్తి పోయి గండ్రగొడ్డలిని చేతికి తీసుకుని, "భల్లూక



దొరా, అనవసరంగా ఆవేశ పడి, భల్లూక మాంత్రికుడి మహత్తుగల గండ్రగొడ్డలిని విరగ్గొట్టకు. కోటలో మనం జొరబడాలంటే, ఈ మూసిన ద్వారాలను కాల్చి బూడిద చేయటం ఒక్కటే మార్గం," అన్నాడు.

"ఒరే, ఆటవిక సేవకా, ఆలోచన బాగానే వున్నది. కాని, ఈ లోపల సామంతు సూర్య భూపతి, రాజు దుర్ముఖుణ్ణి చంపితే, అప్పుడు గతేంకాను?" అన్నాడు తలారి భల్లూకుడు.

"ఆ మాటా నిజమే!" అంటూ రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగద పైకెత్తి, దూకుతూ పోయి కోటద్వారాల మీద బలంగా ఒకదెబ్బ కొట్టాడు.

రాక్షసుడి బలమైన గద దెబ్బకు ద్వారాలైతే విరగలేదుగాని, నెర్రెలువారి వున్న వాటిపై కోటగోడ భాగం కొంత విరిగి, రాళ్ళూ రప్ప లతో దభీమంటూ కింద పడింది. మొత్తం గోడ



కూలుతున్నదేమో అన్న భయంతో భల్లూకుడూ, ఆటవికుడూ కోటద్వారాలకు దూరంగా పరిగెత్తి, తలలెత్తి చూశారు. కోటగోడ మీద వాళ్ళ కంటబడిన దృశ్యం, అందరికీ ఆశ్చ ర్యంతోపాటు, భయం కూడా కలిగించింది. నల్లని దుస్తులు ధరించిన పెద్ద కోతి ఆకారం ఒకటి గోడ మీద కూర్చుని వున్నది. దాని చేతిలో పొడవాటి మంత్రదండం వున్నది. దాని పిడిమీద ఒకే వజ్రంలో మలిచిన ఎలుగు బంటి తల, సూర్యకాంతిలో మిలమిల మెరుస్తున్నది. ఆ కోతిరూపాన్నీ, దాని చేతిలో వున్న మంత్రదండాన్నీ చూసి తలారిభల్లూ కుడు గట్టిగా పళ్ళుకొరికి, పెద్దగా గొంతెత్తి, ''ఒరే, కోతి రూపంలో వున్న నీవు, నిజంగా కోతివా లేక ఏదైనా పిశాచానివా? మహా శక్తిసంపన్నుడైన భల్లూకమాంత్రికుడి మంత్ర దండం నీకెలా దొరికింది?'' అన్నాడు.

ఆ ప్రశ్నకు కోతి రూపం కర్ణకఠోరంగా కిచకిచమని, ''అరె ఒరే! భల్లూక రూపంలో వున్న నువ్వు, నిజంగా భల్లూకానివా లేక ఏదైనా పిశాచానివా?'' అని అడిగింది.

తలారి భల్లూకుడు ఆ ప్రశ్న వింటూనే కోపం పట్టలేక గండ్రగొడ్డలి విసర బోయేం తలో, రాక్షసుడు ఉగ్రదండుడు అతణ్ణి ఆగ మని, చిన్న గొంతుతో, ''తలారి భల్లూకా, తొందరపడకు! నువ్వనే ఆ భల్లూకమాంత్రి కుడు ఏదో పెద్ద ప్రమాదంలో చిక్కుకున్నా డని నా అనుమానం. ముందు, ఈ పిశాచి కోతి నుంచి, మంచి మాటలతో, ఏం జరిగిందో తెలుసుకుందాం,'' అన్నాడు.

ఉగ్రదండుడు మాట ముగించే లోపలే, చాటునుంచి ఆటవికుడు గురిపెట్టి వదిలిన బాణం రివ్వుమంటూ పిశాచికోతి కేసి పోయింది. కోతి ఈసారి కిచకిచా అని నవ్వుతూ, ఉన్న చోటునుంచి కదలకుండానే, బాణాన్ని చప్పున ఎడమ చేతితో వడిసి పట్టుకుని, కుడిచేతిలో వున్న మంత్రదండాన్ని పైకెత్తి, ''ఒరే, శుంఠాగ్రేసరులారా! నా శక్తి ఎలాంటిదో చూశారు గదా? నేను మాయా మర్కటాన్ని! తెలిసిందా?'' అన్నది.

తలారి భల్లూకుడు రెండు చెవులూ ఒక సారి మూసుకుని, రాక్షసుడు ఉగ్రదండు డితో, ''ఉగ్రదండా! ఇక, ఈ చచ్చు మర్క టంతో మాటలు వద్దు. కోట లోపల రాజు దుర్ముఖుడు ఇంకా బతికే వున్నాడో లేక ఈ పాటికి సామంతుడి చేతిలో హతమై పోయాడో తెలియటం లేదు. కోట తలుపులు బద్దలు కొట్టలేక పోతే, గోడలైనా ఎక్కి మనం

లోపల ప్రవేశించాలి. మార్గం ఏమిటి?'' అన్నాడు.

ఉగ్రదండుడు ఆశ్చర్యపడుతున్న వాడిలా, తలారి భల్లూకుడి కేసి చూసి, ''తలారి భల్లూకా, నీ కింకా సంగతి సందర్భాలు బాగా అర్థమైనట్టు లేదు. ఈ మాయామర్కటాన్నసే దుర్మార్గుడు, భల్లూకమాంత్రికుడి మంత్ర దండాన్ని చేజిక్కించుకోగలిగాడంటే, ఆ మాంత్రికు డీసరికి ప్రాణాలు పోగొట్టుకుని వుండాలి. అలాంటి స్థితిలో నువ్వు, రాజు దుర్ముఖుడి కోసం అనవసరమైన చిక్కుల పాలవటం ఎందుకు? పద, అరణ్యంలోని కొండప్రాంతాల కాలక్షేపం చేద్దాం,'' అన్నాడు.

''రాక్షసుల వారిది, బహుమంచి సలహా, తలారి భల్లూక ప్రభో!'' అంటూ దొంగ నాగమల్లు ఏనుగు మీది నుంచి కిందికి దూకి, తన అనుచరులిద్దర్నీ, అంగరక్షకుల్నీ కూడా ఏనుగుమీది నుంచి కిందికి దిగమని, ''ఉగ్రదండులవారి ఆలోచన ఎలావున్నది? అందరం ఏకంగా అరణ్యంలో ఒకే చోట గుంపు కట్టివుంటే, మన దారిదోపిడీలను అడ్డగలవాళ్ళు, ఈ భూప్రపంచంలో ఎవరుంటారు?'' అన్నాడు ఉత్సాహంగా.

తలారి భల్లూకుడు కోపంతో కళ్ళెర్రచేసి, ఆటవికుడితో, ''ఒరే, ఆటవిక సేవకా! ఈ దొంగ నాగమల్లు పారిపోకుండా బాణం ఎక్కుపెట్టు,'' అని, మిగతా వాళ్ళందరితో, ''భల్లూక మాంత్రికుడూ, మహా శౌర్యవంతుడైన కాళీవర్మ అనే యువకుడూ ఏమయ్యారో వెతికేందుకు, నా వెంట వచ్చేవాళ్ళెవరు? చేతులెత్తండి?'' అన్నాడు.



ఒక్క రాక్షసుడు ఉగ్రదండుడు తప్ప, అందరూ అంగీకార సూచకంగా చేతులెత్తారు. ''ఉగ్రదండా, నీ సంగతేమిటి? ఆ భల్లూక మాంత్రికుడితో ఏదో పనివున్నట్టు లోగడ చెప్పావుగదా?'' అన్నాడు తలారి భల్లూకుడు.

''ఆ మాంత్రికుడు సజీవుడైతే గదా, నాకు పని!'' అన్నాడు ఉగ్రదండుడు.

అంతలో మాయామర్కటం కోటగోడ మీద కీచుమంటూ పెద్దగా అరిచి, ''సైనికులు రెండు భాగాలుగా చీలిపోయి కొందరు పాత రాజు దుర్ముఖుణ్ణీ, మరి కొందరు సామంతు సూర్యభూపతినీ గెలిపించాలని చూస్తున్నారు. వెధవలు ముఖాముఖి యుద్ధం చేయకుండా, స్తంభాల చాటునా, చెట్ల చాటునా పొంచివుండి కవ్వించుకుంటా రెందుకు?'' అన్నది.

ఆ మాటలతో తలారి భల్లూకుడు కొంచెం స్థిమితపడి, ''ఉగ్రదండా, రాజు నాకు ప్రాణాలతో దొరికే ఆశ వున్నదన్నమాట,'' అన్నాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు చీదరించుకుంటున్నట్టు రాతిగదను నేలకు వేసి గట్టిగా కొట్టి, ''ఓయ్, తలారి భల్లూకా, భల్లూక మాంత్రికుడు ప్రాణాలతో వుండగా, అతడి మంత్ర దండాన్ని ఎవరైనా చేజిక్కించుకోగలరా?'' అని, మాయామర్కటాన్ని చప్పట్లు చరిచి పిలిచి, ''ఓయ్, మర్కటం! భల్లూక మాంత్రికుడి మంత్రదండాన్ని తెచ్చావు బాగానే వుంది. మరి, అతడి శవాన్ని ఏం చేశావు?'' అని అడిగాడు.

''ఆ శవాన్ని నరికి కాకులకూ, గద్దలకూ ఆహారంగా వేశాను. కాని, ఆ పక్షులు ముట్టకుండా కాళీవర్మ అనే వాడి శిష్యుడు కాపలా కాస్తున్నాడు,'' అంటూ మంత్రదండాన్ని గోడమీద నిలువునా ఆనించి, దానిమీదికెక్కి దూరంగా చూస్తూ, ''అరె, అరే! ఆ భల్లూక మాంత్రికుడు ఏ సంజీవనీ విద్యవల్లో తిరిగి బతికాడన్నమాట! వాడు ఎనుబోతు మీదా, పక్కన గుర్రం మీద కాళీవర్మ అనేవాడూ- ఇటే వస్తున్నారు. వాళ్ళను పట్టుకునేందుకు చంద్రశిలా నగర రాజు జితకేతుడి మంత్రి సైన్యంతో వెంబడిస్తున్నాడు. వాళ్ళిద్దరి శిరశ్ఛేదం కళ్ళారా చూసిగాని, నేనిక్కణ్ణుంచి కదలను,'' అన్నది.

మాయామర్కటం ఇలా అనగానే తలారి భల్లూకం, ''దిరిశెనవన భైరవా!'' అంటూ పెద్దగా అరిచి, ''ఒరే, చచ్చుకోతి వెధవా! ఇందాకటి నుంచి చూస్తున్నాను, నువ్వు మాట్లాడేదేమిటి? నీ కేమైనా వెర్రాలేక మాకు వెర్రెత్తించాలని చూస్తున్నావా?'' అన్నాడు.

తలారి భల్లూకం మాట పూర్తి చేసే లోపలే, వేగంగా ముందు గుర్రం మీద కాళీవర్మ, వెనకగా ఎనుబోతు మీద భల్లూక మాంత్రికుడూ అక్కడికి వచ్చి, కోటగోడ మీదవున్న మాయా మర్కటాన్ని చూస్తూనే, ''తలారి భల్లూకా! మంత్ర దండాన్ని దొంగిలించిన, ఈ మాయా మర్కటాన్ని ప్రాణాలతో వదలగూడదు,'' అన్నారు.

ఆ మరుక్షణం మర్కటం కిచకిచా అంటూ నవ్వి, ఛెంగున ఎగిరి కోటలోపలికి దూకేసింది. -(ఇంకావుంది)



బేతాళ కథలు

# జ్యోతిష్యానికి జ్యోష్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, భయంకొలిపే శ్మశానంలో నువ్వింతగా శ్రమపడుతున్నావంటే, అందుక్కారణం నువ్వేదో ఒకానొక మహాత్కార్యాన్ని సాధించదలచావని తెలుస్తూనే వున్నది. అయితే, చాలామందిలో తమ శక్తికి మించిన కోరికలూ, వాటిని సాధ్యం చేసుకోవాలన్న తాపత్రయం చూస్తుంటాం. అలాంటి వాళ్ళు శాస్త్రాలను వల్లెవేయడంలో తప్ప, ఇతరత్రా



తార్కిక దృష్టీ, మానవ స్వభావాన్ని గురించిన లోతైన పరిజ్ఞానం లోపించడంతో నిరాశకు గురవుతారు. నువ్వు అలాంటివారికి భిన్నుడివా కాదా అన్న సంశయంకలుగుతున్నది. నీకు తగు హెచ్చరికగా వుండేందుకు, ఒక జ్యోతిశ్శాస్త్ర పండితుడూ, అతడికి ఆ శాస్త్రంలో తన అనుభవజ్ఞానం ద్వారా పాఠాలు చెప్పిన ఒక సామాన్యుడి కథా చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

వేములవాడ అనే గ్రామంలో వుండే సీతారామయ్య కొడుకు భాస్కరుడు ఎర్రటి దేహచ్ఛాయతో చక్కని అంగసౌష్ఠవంగల యువకుడు. అతణ్ణి అల్లుడిగా చేసుకోవాలని శేషావతారం అనే సన్నకారు రైతు మనసుపడ్డాడు.

అయితే భాస్కరుడు, "నాకు పైసా సంపాదన లేదు. ఎక్కడైనా పనిదొరికితే తప్పకుండా, నీ కూతుర్ని పెళ్ళి చేసుకుంటాను," అని శేషావతారానికి చెప్పాడు.

శేషావతారానికి అల్లుణ్ణి ఇంట్లోవుంచుకుని పోషించే స్తోమతు లేదు. భాస్కరుడిని ఎలాగైనా పెళ్ళికి ఒప్పించాలని శేషావతారం పలు విధాల ఆలోచించి, చివరకు గ్రామంలో పేరు పడ్డ జ్యోతిష పండితుడు మృత్యుంజయుణ్ణి ఆశ్రయించాడు. శేషావతారం ఆయనకు సంగతి చెప్పి, భాస్కరుడు తనకు తానుగా ఎప్పట్నించి సంపాదిస్తాడో చెప్పమనికోరాడు.

మృత్యుంజయుడు, సీతారామయ్య కుటుంబీకులవీ, శేషావతారం కుటుంబీకులవీ జాతకాలు తెప్పించుకుని ఏవేవో లెక్కలు కట్టి, "భాస్కరుడు నీ కూతురు సంధ్యను పెళ్ళి చేసుకుని మతంగపురం వెళితే, అక్కడ రెండు చేతులా సంపాదిస్తాడు," అని చెప్పాడు.

భాస్కరుడికి జ్యోతిషం మీద నమ్మకం లేదు. కానీ సీతారామయ్య మాత్రం మృత్యుంజయుడి జోస్యాన్ని పూర్తిగా నమ్మాడు. ఆయన కొడుకుతో సంధ్యను చేసుకోమని చెప్పాడు.

"ఇదంతా శేషావతారం, జ్యోతిష్కుడితో కలిసి ఆడుతున్న కపట నాటకం. దమ్మిడీ ఆదాయం లేకుండా నేపెళ్ళిచేసుకోను," అన్నాడు భాస్కరుడు.

"నువ్వు నా మాట విని సంధ్యను పెళ్ళి చేసుకుని మతంగపురం వెళ్ళు. జ్యోతిష్కుడు చెప్పినట్లు అక్కడ నీ జాతకం ఫలించకపోతే తిరిగిరా. నిన్నూ, నీ భార్యనూ నేను పోషిస్తాను. పెళ్ళి చేసుకోనంటావా – నువ్వీక నాతో వుండనక్కర్లేదు," అన్నాడు సీతారామయ్య.



చేసేది లేక భాస్కరుడు, తండ్రి మాటలకు తలవంచి సంధ్యను పెళ్ళిచేసుకున్నాడు. ఆమెను వెంటబెట్టుకుని మతంగపురం చేరుకున్నాడు. అక్కడ నివాసం కోసం ఒక గృహస్థు ఇంటికి వెళ్ళి, "అయ్యా! కొత్తగా ఈ ఊరొచ్చాను. మీ ఇంట్లో ఆశ్రయం కోరుతున్నాను. ఇక్కడ నాకేదైనా ఆదాయం లభిస్తే, మీకు తగిన ప్రతిఫలం ఇచ్చుకోగలను," అన్నాడు.

ఆ గృహస్థు అతణ్ణి ఎగాదిగా చూసి, "మా ఇల్లు చాలా పెద్దది. ఒక భాగంలో నువ్వుండొచ్చు. అయినా, నీ వివేకాన్నీ, సమయజ్ఞతనూ పరీక్షించనిదే నీకిల్లు ఇవ్వను. నాకు రాములు, సోములు, నాగులు, వెంకులు అనేవాళ్ళు బాకీవున్నారు. ఎవరింటికి వెళితే బాకీ వసూలవుతుందో చెప్పు. వాళ్ళింటికి వెళతాను. బాకీవసూలయిందంటే, ఇక నువ్వు నా ఇంట్లో వుండొచ్చు!" అన్నాడు.

ఏదో ఒకటి చెప్పకపోతే, ఆయన తనకు ఇల్లివ్వనంటాడని భయపడి, "అయ్యా! తమరు నాగులింటికి వెళ్ళండి. ఈ రోజతడు మొత్తం బాకీ తీర్చేస్తాడు," అన్నాడు భాస్కరుడు.

గృహస్థు నాగులింటికి వెళ్ళాడు. నాగులాయనకు రెండు చేతులూ జోడించి, "అయ్యో! తమరే బయల్దేరివచ్చారా! నేనే మొత్తం బాకీ చెల్లువేయడానికి తమరింటికి వస్తున్నాను," అంటూ ఆయనకు డబ్బిచ్చి పంపాడు.

భాస్కరుడికా గృహస్థు ఇంట్లో ఆశ్రయం దొరికింది. ఈ విషయం ఆ నోటా ఈ నోటా ఊరంతా పాకింది. భాస్కరుడు గొప్ప జ్యోతిష్కుడనీ అంతానమ్మి అతడి వద్దకు రాసాగారు. భాస్కరుడు వచ్చిన వారిని రకరకాల ప్రశ్నలు వేసి, తనకు కావలసిన విషయాలు తెలివిగా రాబట్టి, దానికి లోకజ్ఞానాన్ని జోడించి తనకు తోచింది చెప్పేవాడు. అతడు చెప్పినవన్నీ తూచా తప్పకుండా జరిగాయి. దాంతో అతడి పేరు మార్మోగి పోయింది.

ఇప్పుడు మతంగపురంలో భాస్కరుడి భుక్తికి లోటులేకుండా గడచిపోతున్నది. అలా కొంత కాలంగడిచాక సంధ్య, భాస్కరుడితో, "జ్యోతిషంలో నీకున్న సామర్థ్యం అసాధారణమని నాకు తోస్తున్నది. మనం రాజధానికి వెళదాం. అక్కడ ఎందరో భాగ్యవంతులుంటారు. వారు మనకు విలువైన కానుకలిస్తారు. రాజుగారి ప్రాపకం దొరికితే ఇక చెప్పనే అక్కర్లేదు!" అన్నది ఒక రోజున.

భాస్కరుడు నవ్వి, "నాకు జ్యోతిషవిద్య తెలియదు, జ్యోతిషమంటే నమ్మకమూ లేదు.



ఏదో అదృష్ట దేవత కరుణించి, నా వాక్కు ఫలిస్తున్నది. ఇలా ఎంతకాలమో జరగదు. మనం రాజధానికి మారిపోయి చిన్న వ్యాపారం ప్రారంభిద్దాం. అదృష్టం బాగుంటే అందులో కలిసివచ్చి బోలెడు సంపాదించవచ్చు,'' అని చెప్పాడు.

అందుకు సంధ్య ఏమాత్రమూ ఒప్పుకోక, ''హనుమంతుడికిలా, మీ శక్తి మీకు తెలియదు. మీ శక్తిని జ్యోతిష పండితుడు మృత్యుంజయుడు కనిపెట్టాడు. మీరు ఆయన సలహాలేనిదే జ్యోతిషాన్ని విడిచిపెట్టడానికి, నేనొప్పుకోను,'' అని పట్టుబట్టింది.

భార్య మాట కాదనలేక మృత్యుంజయుడి వద్దకు ప్రయాణం కట్టబోయాడు, భాస్కరుడు. కానీ ఈలోగా మృత్యుంజయుడే అతడింటికి వచ్చి, ''నాయనా! జ్యోతిషవిద్యలో నీవు చూపుతున్న ప్రజ్ఞ అసాధారణం. నీవు చెప్పే ఫలితాలు ఏ శాస్త్రానికీ అందవు!'' అంటూ పొగడ్తలతో ముంచెత్తాడు.

''ఆర్యా! నేను మిమ్మల్ని కలుసుకునేందుకు రాబోతూంటే, మీరే నావద్దకు వచ్చారు. తమరి రాకకు అంతరార్థమేమిటో తెలుసుకోవాలనుంది!'' అన్నాడు భాస్కరుడు.

మృత్యుంజయుడు వెంటనే, ''అందుకే నీది అసాధారణ ప్రజ్ఞ అన్నాను. నీకు నేను వచ్చిన పని చెబుతాను, విను,'' అన్నాడు.

మృత్యుంజయుడి ఊళ్ళో రంగస్వామి అనే రైతున్నాడు. రాజు కొలువులో వున్న కొడుకు దగ్గరకు ఊరువిడిచి రాజధానికి వెళ్ళిపోతూ, తనకున్న అయిదెకరాల పొలాన్ని అమ్మకానికి పెట్టాడు. అయితే, వంద వరహాల విలువ చేసే ఆ పొలాన్నతడు వెయ్యి వరహాలకు తక్కువకు ఇవ్వననడంవల్ల ఎవరూ కొనడానికి రావడం లేదు. చివరకు రంగస్వామి, మృత్యుంజయుణ్ణే ఆ పొలం కొనుక్కోమని బలవంతపెట్టసాగాడు.

''ఇది చాలా అన్యాయం కదా! ఆ పొలాన్ని మీ రెందుకు కొనుక్కోవాలి?'' అన్నాడు భాస్కరుడు.

''అదంతా ఒక పెద్ద కథ. ఒకప్పుడు రంగస్వామి పొలంలో పంటలు సరిగ్గా పండక అప్పులపాలయ్యాడు. నేనతడికి ధైర్యం చెప్పడం కోసం, అతడి పరిస్థితి మెరుగై అప్పులు తీరిపోతాయని చెప్పాను. అతడి కొడుక్కు రాజు కొలువులో ఉద్యోగం వస్తుందని చెప్పాను. ఆ పొలంలో పదివేల వరహాల విలువ చేసే బంగారు కాసులు దొరికే

సమయం ముందు వున్నదన్నాను. ఒక్క బంగారు కాసులు మినహా మిగతావన్నీ జరిగాయి. ఇప్పుడు రంగస్వామి ఆ పొలాన్ని నాకే అమ్మి ప్రత్యుపకారం చేయాలనుకుంటున్నాడు. ఆ పొలం వెయ్యి వరహాల విలువ చెయ్యదు. బంగారు కాసుల విషయంకాదని నేననలేను. ఇలాంటి పరిస్థితుల్లో ఏం చేయాలో దారిలోచక, నీ దగ్గరకొచ్చాను,'' అన్నాడు మృత్యుంజయుడు.



''నేను మాత్రం ఏం చేయగలను?'' అన్నాడు భాస్కరుడు.

''నువ్వు ఆ పొలంలో బంగారు కాసులు దొరుకుతాయన్న నా జ్యోస్యం నిజమవుతుందంటే, నేనది కొనుక్కుంటాను,'' అన్నాడు మృత్యుంజయుడు.

''అయ్యా! సంపాదనకు ఏదారీ తోచకుండా వున్న నాకు, జ్యోతిషవిద్యతో దారి చూపించిన మహానుభావులు మీరు. మీకు తెలియనివి నాకు తెలుస్తాయా?'' అన్నాడు భాస్కరుడు ఆశ్చర్యంగా.

''నాయనా! నీది అమోఘువాక్కు. నాది జ్ఞానం. నీది అదృష్టం! నేను నీ మీదనే ఆధారపడుతున్నాను. ఏ విషయమూ చెప్పు!'' అని బ్రతిమలాడాడు మృత్యుంజయుడు.

ఆయన మాట కాదనలేక, చివరకాయన్నా పొలం కొనుక్కోమని సలహాయిచ్చి పంపేశాడు, భాస్కరుడు.

ఈ జరిగినదంతా చూసిన సంధ్య, భాస్కరుడితో, ''ఇక నీవు జ్యోస్యం చెప్పడం ఆపి, రాజధానికి చేరి ఏదైనా వ్యాపారం చేయడం మేలని నాకు తోస్తున్నది,'' అన్నది.

దానికి భాస్కరుడు నవ్వి, ''ఇన్నాళ్ళిన్నాళ్ళకు, నీకు జోస్యం గురించిన మూఢనమ్మకం తొలగింది. చాలా సంతోషం,'' అన్నాడు.

సంధ్య తల అడ్డంగా వూపి, ''అదేం కాదు. మనం వ్యాపారం ప్రారంభించాక తొందరగా వెయ్యివరహాలు సంపాదించి, మృత్యుంజయుడి నుంచి ఆ పొలం కొనుక్కుందాం. అందులోని పదివేల వరహాల బంగారు కాసులూ మనకే దక్కుతాయి,'' అన్నది.

భార్య మూఢనమ్మకాన్ని విడిచి పెట్టనందుకు, చిరాకుపడుతూ, ప్రస్తుతానికి జ్యోతిషాన్ని విడిచి పెట్టడానికామె అంగీకరించింది కదా అని సంతోషించాడు, భాస్కరుడు. అతడు రాజధాని చేరి వ్యాపారం ప్రారంభించిన ఆరు మాసాల్లోనే వెయ్యి వరహాలు కూడబెట్టేటంతగా అతడి వ్యాపారం వృద్ధి చెందింది.

అప్పుడు సంధ్య, భాస్కరుడు వెయ్యి వరహాలు తీసుకుని తమ ఊరువెళ్ళారు. తండ్రి అతడి రాకకు సంతోషిస్తూ, "మంచి సమయానికే వచ్చావు. ఈ రోజు మృత్యుంజయుడి ఇంట్లో పెద్దవిందు ఏర్పాటయింది. ఆయనకు పొలంలో పదివేల వరహాల విలువ చేసే బంగారు కాసులు దొరికాయి. అందు కాయన్ను అంతా పొగడుతున్నారు. ఎందుకంటే-ఆ బంగారు కాసులు దొరుకుతాయని జ్యోతిశ్శాస్త్రం ద్వారా ముందే తెలుసుకుని, వందవరహాల పొలాన్ని వెయ్యి వరహాలకు కొన్నమహాపండితుడాయన!" అన్నాడు.

భాస్కరుడు తెల్లబోయాడు. తను వ్యాపారంలో కొనసాగాలా, జ్యోతిషాన్ని ప్రారంభించాలా అన్న మీమాంస అతడిలో తలెత్తింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, జ్యోతిషంలో ఉద్దండ పండితుడైవుండీ, మృత్యుంజయుడు పొలంకొనే విషయంలో సలహా కోసం భాస్కరుడి దగ్గరకు ఎందుకు వెళ్ళాడు? తన జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానం మీద తనకే నమ్మకం లేకనా? అసలు జ్యోతిషమంటే తెలియని భాస్కరుడి మాటలు ఎలా ఫలించాయి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "జీవితానుభవం నుంచి పాఠాలు నేర్చుకున్న వివేకవంతుడు, అన్ని వేళలా కీడెంచి మేలెంచడం ఉత్తమం అన్న నమ్మకంతో వుంటాడు. ఆ కారణంగానే, ఎంత ఘనవైద్యుడైనా తనకుగానీ, కుటుంబంలోని వారికి గానీ తీవ్రమైన వ్యాధి సోకినప్పుడు చికిత్సప్రారంభించే ముందు, తనకు సాటిరాగలడన్న మరొక వైద్యుణ్ణి సంప్రదిస్తాడు. అలాగే, జ్యోతిష్కుడు కూడా ఏదైనా కఠిన సమస్య ఎదురైనప్పుడు, మరొక జ్యోతిష్కుడి సలహా ఆశిస్తాడు. మృత్యుంజయుడి విషయంలో ఇదే జరిగింది. ఇక, భాస్కరుడి విషయానికొస్తే-అతడిది అమోఘవాక్కంటూ మృత్యుంజయుడు పొగిడాడు. అతడు చేపట్టిన ప్రతిపనీ, మాటా విజయవంతమయినా అదృష్టదేవత అతడి వెన్నంటి వున్నదనుకోవాలి," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : "వసుంధర" రచన]






# కుడ్యచిత్రాలలో మహాభారతం!

మహారాష్ట్రలోని అజంతా, ఎల్లోరా గుహాలయాలు, అక్కడి కుడ్యచిత్రాలు జగత్ప్రసిద్ధాలు. ఇక దక్షిణాదికి వస్తే, తమిళనాడులోని సిత్తన్నవాసల్, తంజావూరు, తిరునందిక్కావల్ ఈ మూడు ప్రాంతాలలో ఇలాంటి కుడ్యచిత్రాలు కనిపిస్తాయి.

తంజావూరులోని బృహదీశ్వరాలయంలోని కుడ్యచిత్రాలు తప్ప, మిగిలిన రెండు ప్రాంతాలలోని కుడ్యచిత్రాలు కాపాడుకోలేనంతగా చెరిగిపోయాయి. తంజావూరు దేవాలయం రెండవ అంతస్తులోని గోడలు ఈ చిత్రాలతో అలంకరింపబడి ఉన్నాయి. అయితే, భద్రత దృష్ట్యా దాన్ని కొన్నాళ్ళుగా మూసివేశారు.

తంజావూరులోని 'దక్షిణ మండల సాంస్కృతిక కేంద్రం' కుడ్యచిత్రాల పట్ల ప్రజల ఆసక్తిని పెంపొందించడానికి కొన్ని చర్యలు చేపట్టింది. 250 చ. అడుగుల విస్తీర్ణంగల గోడల మీద మహాభారత కథను చిత్రాలుగా చిత్రించాలని నిర్ణయించింది. ఈ కథను వివరించే 21 ఫలకాలు ఉంటాయి. వేదవ్యాసుడు విఘ్నేశ్వరుడికి కథ చెబుతూంటే, విఘ్నేశ్వరుడు లిఖించేట్టు మొదటి చిత్రం ఉంటుంది. పద్దెనిమిది రోజుల భారత యుద్ధానంతరం దుర్యోధనుడి ఊరుభంగాన్ని చిత్రించేది చివరిచిత్రం.



ఈ చిత్రాలు చిత్రించడానికి ఉపయోగించే రంగులను రకరకాల ఆకులు, పువ్వులు, పళ్ళు, కొన్ని రకాల చెట్ల బెరడులు, రాళ్ళ పొడులు మొదలైన వాటి మిశ్రమంతో తయారు చేస్తారు. కేరళకు చెందిన ఒక చిత్రకారుల కుటుంబం ఈ చిత్రాలను చిత్రించడం మరో విశేషం. తండ్రి గోడలకు 'బేస్ కలర్' వేస్తాడు; కొడుకు రేఖాచిత్రాలను అంటే లైన్ డ్రాయింగ్స్ గీస్తాడు. తల్లి వాటిని రంగులతో నింపుతుంది.

# రొట్టెలో నగలు

ఒకానొక రాజుకు ప్రజలు తమకు కలిగే అదృష్టాన్ని ఎలా ఉపయోగించుకుంటారో తెలుసుకోవాలనే ఆసక్తి అమితంగా ఉండేది. ఒకనాడాయన రాజభవనంలోని వంటశాలలో రొట్టెలు కాల్చేవాణ్ణి పిలిచి రెండు అందమైన రొట్టెలు తయారుచేయమన్నాడు. ఒకదానిని మామూలుగా తయారు చేసి, రెండవదాని లోపల విలువైన నగలు దాచమన్నాడు.

వారానికోసారి ఉదయంపూట ఒకరాజోద్యోగి, పేదవారికి దానధర్మాలు చేయడం ఆనవాయితీ. అలా ఆరోజు వచ్చిన రాజోద్యోగిని పిలిచి, రాజు ఆ రెండు రొట్టెల గురించి చెప్పి, నగలు దాచిన రొట్టెను చూపుతూ, "మిత్రమా, దీనిని పాత్రుడైన వాడికి దానం చెయ్యి. రెండవదాన్ని నీ వద్దకు భిక్షకువచ్చే వారికెవరికైనా ఇవ్వు," అన్నాడు.



ఆ రోజు ఇద్దరు భిక్షకు వచ్చారు. వారిలో ఒకడు పొడవాటి గడ్డం, పాదాల వరకు జీరాడే అంగీతో గొప్ప సాధువులాగా ఉన్నాడు. రెండవ వాడు మామూలు బిచ్చగాడిలా ఉన్నాడు. రాజోద్యోగి నగలు దాచిన రొట్టెను సాధువుకిచ్చి, రెండవదాన్ని మామూలు బిచ్చగాడికిచ్చాడు.

దీన్నంతా రాజు తన మేడ ఉపరితలం నుంచి జాగ్రత్తగా గమనిస్తూ ఉన్నాడు. సాధువు రొట్టెను అందుకోగానే, అది బరువుగా ఉండడంతో ఆశ్చర్యంగా చూశాడు. రొట్టె సరిగ్గా కాలినట్టు లేదనే నిర్ణయానికి వచ్చాడేమో మరి. పక్కనున్న బిచ్చగాడికేసి ఆప్యాయంగా చూస్తూ, "మిత్రమా, ఈ రొట్టె కాస్త ఎక్కువ బరువుగా ఉన్నట్టుంది. నీచేతిలో ఉన్నదానికన్నా ఇది కొంచెం పెద్దదనుకుంటాను. ఈ పూట నాకు అంత ఆకలిగా లేదు. మనం రొట్టెలను మార్చుకుందామా?" అన్నాడు. బిచ్చగాడు మరేమీ మాట్లాడకుండా, తన రొట్టెను సాధువు చేతిలో పెట్టి, ఆయన రొట్టెను తీసుకుని తనదారిన వెళ్ళిపోయాడు.

ఆ దృశ్యాన్ని చూసిన రాజు, "సాధువు నగల వ్యామోహంలో పడకూడదన్నది దేవుడి సంకల్పంకాబోలు! సాధువును ధనవంతుడిగా మార్చడం దేవుడికిసమ్మతం కాదేమో!" అనుకున్నాడు. అయినా, సాధువు తన రొట్టెను బిచ్చగాడికి ఇస్తున్నప్పుడు ఆయన ముఖంలో కనిపించిన చిరునవ్వును రాజు మరువలేకపోయాడు. బహుశా, ఉడికీ ఉడకని రొట్టెను తెలివిగా, ఎదుటివాడికి అంటగడుతున్నామన్న తృప్తితో వచ్చినదై ఉంటుంది ఆ నవ్వు!

అయినా, ఆ నవ్వు రాజులో తీరని ఉత్సుకతను రేకెత్తించింది. వెంటనే ఇద్దరు గూఢచారులను పిలిచి, రొట్టెలను పుచ్చుకుని వెళ్ళిన ఇద్దరినీ రహస్యంగా అనుసరించి వెళ్ళి, వాళ్ళు ఏం చేస్తారో తెలుసుకుని రమ్మన్నాడు. సాయంకాలానికి ఇద్దరు గూఢచారులూ వచ్చి జరిగిన సంగతులు రాజుగారికి విన్నవించారు:

సాధువు రొట్టెను తీసుకుని తిన్నగా తన కుటీరానికి వెళ్ళాడు. అంగీనీ, పెట్టుడుగడ్డాన్నీ తీసి పక్కన పెట్టి; రొట్టెనూ, దానితో పాటు తెచ్చుకున్న వంటకాలనూ తృప్తిగా తిన్నాడు. మళ్ళీ పెట్టుడుగడ్డాన్ని తీసి ముఖానికి తగిలించుకుని, అంగీని ధరించి సాధువులా భిక్షానికి బయలుదేరాడు.

బిచ్చగాడు తన గుడిసెకు చేరి రొట్టెను ముక్కలుగా కోయబోయి, అందులోని నగలను చూసి అమితాశ్చర్యం చెందాడు. దానిని చూసిన అతడి వెళ్ళాం, "ఆహా, ఇంతకాలానికి దేవుడు కరుణించాడు. ఇవన్నీ, నావే," అన్నది.

అయితే, బిచ్చగాడు ఏమాత్రం తొందర పడకుండా, "దేవుడు దీనిని ఒకగొప్ప వ్యక్తి ద్వారా ఒక సాధువుకు ఇప్పించాడు. ఆ సాధువు దీనిని నాకిచ్చాడు. ఇది నా నిజాయితీకి పరీక్ష. మొదట నేను ఆ గొప్ప వ్యక్తి దగ్గరికి వెళ్ళి ఈ నగలను పొరబాటున రొట్టెలో పెట్టారేమో తెలుసుకోవాలి. ఒకవేళ దీనిని ఎవరైనా ప్రభువుల ఇంటి నుంచి దొంగిలించి రొట్టెలో దాచారేమో చూడాలి. అలాకాక ఆ గొప్ప వ్యక్తే ఉద్దేశపూర్వకంగానే దీనిని సాధువుకు దానంగా ఇచ్చి ఉన్నట్టయితే ఇది ఆ సాధువుకే చెందాలి కదా? ఇవన్నీ ఏవీ కావనుకుంటేనే దీనిని మనం ఆశించవచ్చు. ప్రభువులే దయతలచి మనకు ఇస్తే, మనం కొన్ని నగలు తీసుకుని, ఇరుగు పొరుగుకు కొన్ని ఇద్దాం," అన్నాడు భార్యతో.



ఆ తరవాత నగలను తీసుకుని, రాజోద్యోగి దగ్గరికి వెళ్ళి సంగతి చెప్పాడు. ఉద్యోగి అతన్ని రాజు వద్దకు తీసుకువెళ్ళాడు. రాజు అతడి నిజాయితీకి సంతోషించి, ఆ నగలను అతనికే ఇచ్చి, మరిన్ని కానుకలతో సత్కరించాడు..

"సాధువుగా నటించిన ఒకమోసగాడి చేతికి దక్కకుండా దానిని దేవుడు ఒక పాత్రుడికే అందించాడు. అయితే, ఈ సంఘటన నుంచి నేను నేర్చుకున్న గుణపాఠం అమూల్యమైనది. వాళ్ళు రొట్టెను మార్చుకోవడం చూడగానే, నాకు తోచిన వివరణతో తృప్తి పడి సరిపుచ్చుకుని వుంటే అసలు నిజం బయటపడి వుండేది కాదు. అంటే, మనకు తెలిసినవే నిజమన్న భావనతో తృప్తి చెంది ఊరుకోవడం ఏమాత్రం భావ్యం కాదు," అన్నాడు వివేకి అయిన ఆ రాజు సభికులతో.

-(ఎం.డి)

# మూగజీవిసాక్ష్యం

శృంగేరి గ్రామంలో, భీమయ్య అనే రైతువుండేవాడు. అతడు తనకున్న నాలుగెకరాల పొలంలో గుమ్మడికాయలు కాయించి, వాటిని దాపులవున్న కోలార్ పట్టణంలోని దుకాణదారుకు అమ్ముతూండేవాడు. ఒకసారి భీమయ్యకు దూర ప్రాంతాలవున్న బంధువులను చూసి రావలసిన అవసరం కలిగింది. అతడు పొలం కాపలా కాసే చెంగయ్యకు సంగతి చెప్పి, "నేను తిరిగి రావడానికి నెల రోజులైనా పడుతుంది. పొలం కాపలా అశ్రద్ధ చేయకు," అని హెచ్చరించి వెళ్ళాడు.

చెంగయ్య నాలుగైదు రోజులకొకసారి, తన కొడుకు ఒంటెద్దు బండిలో పదీ పన్నెండు గుమ్మడి కాయలను వేసుకుని కోలార్ పట్టణంలోని దుకాణదారుకు అమ్మసాగాడు.

నెల రోజులు గడిచాక భీమయ్య తిరిగి వచ్చాడు. అతడు వెళ్ళేప్పుడు షుమారుగా గుమ్మడి పాదులకు ఎన్నెన్ని కాయలున్నదీ లెక్కపెట్టుకుని వెళ్ళాడు. ఇప్పుడు చూస్తే వాటిలో చాలా లేనట్టు తెలిసిపోయింది. ఈ దొంగతనం చెంగయ్యదే అయివుంటుదనుకుంటూ అతడు దొంగను పట్టేందుకు ఒక ఉపాయం ఆలోచించాడు.

మర్నాడు భీమయ్య, చెంగయ్యను పిలిచి, "చెంగయ్యా! నీ కొడుకు ఒంటెద్దు బండిని ఉదయానే తీసుకురా. పట్నంలో గుమ్మడికాయలు అమ్ముకురావాలి," అని చెప్పాడు.

మర్నాడు చెంగయ్య బండి తోలుకు వచ్చాడు. భీమయ్య ఒక పాతిక గుమ్మడికాయలు కోయించి బండిలో వేశాక, చెంగయ్యతో, "నా ఒంట్లో కాస్త నలతగావుంది. దారిమార్గమంతా కుదుపులు. ఎద్దును ఊరికే అదిలించి తోలకు. దాని దారిన దాన్ని పోనీ," అన్నాడు.

చెంగయ్య అలాగే చేశాడు. బండెద్దు సరాసరి పట్నంలోని దుకాణం ముందుకు వెళ్ళి ఆగింది. దుకాణదారు బండిలోని గుమ్మడికాయలు చూసి చెంగయ్యతో, "ఎప్పుడూ పదీ పన్నెండు కాయలకంటే ఎక్కువ తేనివాడివి, ఒకేసారి ఇన్ని కాయలు తెచ్చావేం?" అన్నాడు.

దానితో చెంగయ్య దొంగతనం బయట పడింది. భీమయ్య, అతడితో, "బండెద్దులు అలవాటైన చోట్లకు ఎవరూ తోలకుండానే అలా నడిచి పోగలవు. ఇప్పుడీ మూగజీవి, నువ్వు దొంగవని సాక్ష్యం చెప్పింది! నిన్ను పనిలోంచి తీసేస్తున్నాను," అన్నాడు. - కోలార్ కృష్ణఅయ్యర్





# దేవుడి ఉనికి

రామదేవుడి గురుకులంలో విద్యాభ్యాసం చేస్తున్న అనేకమంది విద్యార్థులలో, చైతన్యుడు చురుకైనవాడు. ప్రతి విషయాన్ని తరచి చూసి, పరిశోధించి తెలుసుకునేవాడు. అతడి కుశాగ్ర బుద్ధికి రామదేవుడు చాలా సంతోషించాడు. తనకువున్న పాండిత్యాన్ని సంపూర్ణంగా ప్రియ శిష్యుడికి అందించాడు.

ఇప్పుడు చైతన్యుడు పద్ధెనిమిదేళ్ళవాడు. ఇకవాడు గురుకులంలో వుండి నేర్వదగినది ఏమీలేదన్న నిర్ణయానికి వచ్చిన రామదేవుడు, ''నాయనా! నీ చదువు పూర్తయింది. దానికి తగినసంస్కారం, వినయసంపద కూడా, నీకు మెండుగావున్నాయి. ఇక ఇంటికివెళ్ళి నీ తల్లి దండ్రుల్ని సేవించు. ఆ దైవం నీకు ఎల్ల ప్పుడూ అండగావుంటాడు!'' అన్నాడు.

చైతన్యుడు, గురువుగారికి తలవంచి నమస్కరించి, ''గురువర్యా! మీరు నాకు ఎన్నో విద్యలు నేర్పారు. కానీ, ఇప్పుడు చెప్పిన ఆ దేవుడిని మాత్రం ఏనాడూ నాకు చూపించ లేదు. ఎక్కడా కనిపించని ఆ దేవుడు, నాకు అండగా వుంటాడంటే నమ్మకం కుదరడం లేదు,'' అన్నాడు.

చైతన్యుడు హేతువాది. ప్రత్యక్షంగా కని పించేది మాత్రమే నిజం అనే యదార్థవాది.

రామదేవుడు ఒక్క నిమిషం ఆలోచించి, ''చైతన్యా! నీ ప్రశ్నకు జవాబు తరవాత చెబు తాను. ముందుగా ఒకపని చెయ్యి. ఇక్కడికి ఉత్తర దిక్కునవున్న అడవిని దాటితేసుశాంతం అనే నగరం వస్తుంది. అక్కడికి ఆమడ దూరా నవున్న భవానీ పురం అనే గ్రామంలో, నా సోదరుడు నివసిస్తున్నాడు. నువ్వు అతడి వద్దకు వెళ్ళి క్షేమ సమాచారాలు తెలుసు కునిరాగలవా?'' అని అడిగాడు.

ఇందుకు సరేనన్న చైతన్యుడు, మర్నాడు వేకువజామునే బయల్దేరాడు. గురుపత్ని అతడికి రెండు రోజులకు సరిపోయే రొట్టె లనూ, ఇతర తినుబండారాలనూ ఒకసంచీలో పెట్టియిచ్చింది.

చైతన్యుడు కాస్త వేగంగా నడుస్తూ, మిట్ట మధ్యాహ్నంవేళకు అడవిలో కొంతదూరం

నందిరాజు పద్మలతా జయరాం



వెళ్ళాడు. దాహం వేయడంతో, ఎక్కడైనా నీరు దొరుకుతుందేమో అని అతడు పరిసరాలను పరికించి చూస్తున్నంతలో, ఒక గుడ్డి ముసలి వాడు – అడవిచెట్ల ఆకులను తడిమి చూస్తూ, వాసన పీలుస్తూవుండడం కంటబడింది.

చైతన్యుడు, ఆ గుడ్డి ముసలివాణ్ణి సమీపించి, "ఏం, తాతా! దేనికోసమో వెతుకుతున్నట్టున్నావే!" అన్నాడు.

"నాయనా, ఏదీ పోలేదు. నేను దాపుల నున్న కోయగూడెంవాడిని; అందరూ నన్ను మందులతాత అని పిలుస్తారు. మందుగా వాడేందుకు పనికివచ్చే ఆకుల్ని ముట్టుకుని, వాసన చూసి కోసుకుపోతున్నాను. పుట్టు గుడ్డినిగదా మరి!" అన్నాడు తాత.

"అలాగా! అయితే, నీ చేతిలోవున్న ఆ తీగ దేనికి పనికివస్తుంది?" అని అడిగాడు చైతన్యుడు.

"ఇదా! ఇది విషహారిణి, నాయనా! పాము కాటుకు ఇది తిరుగులేని మందు. పాము కాటు తిన్న మనిషి నోట్లో, ఈ తీగ పసరు పిండితే, క్షణాల్లో విషం విరిగిపోయి, పోయే ప్రాణం తిరిగి వస్తుంది. కావాలంటే వుంచు. అడవిలో తిరుగుతున్నావు, అవసరం కలగ వచ్చు," అంటూ తీగను కొంత తుంచి, చైతన్యుడికిచ్చాడు తాత.

చైతన్యుడు ఆ తీగను దుస్తుల్లో భద్రపరచుకుని, తాతను, "ఈ దగ్గర్లో ఎక్కడైనా నీరు దొరుకుతుందా?" అని అడిగాడు.

"ఈ దరిదాపుల్లోనే మంచినీళ్ళ బావివుంది. కాస్త వెతికి చూడు," అన్నాడు తాత.

చైతన్యుడు కొంచెం ముందుకు నడిచి నలువైపులా పరీక్షగా చూశాడు. అతడికి ఒక మద్దిచెట్టు పక్కన బావి కనిపించింది. అతడు అక్కడ భోజనం చేసి, చెట్టుకింద విశ్రమించాడు. అంతలో కునుకుపట్టింది. హఠాత్తుగా తన మీద ఏదో పడినట్లయి అతడు కళ్ళు తెరిచాడు. దూరంగా పరిగెడుతున్న కుందేలు అతడి కంట బడింది. అంతలో చెట్టు కొమ్మ ఒకటి పెద్ద ధ్వనితో విరిగి పడింది. చెతన్యుడు చటుక్కున పక్కకు తప్పుకున్నాడు. కుందేలు అలికిడి లేకపోతే, తను కునుకు పాటులో వున్న సమయంలో కొమ్మ అతడి మీద పడి వుండేది. ఎవరో ఆ కొమ్మను వంట చెరుకు కోసం సగం నరికి వదిలిపోయారు!

చైతన్యుడు తిరిగి నడకసాగించాడు. అతడు అడవి దాటి నగర పొలిమేర ప్రాంతాలు చేరే సరికి అక్కడ ఒక పేదవాడు, అతడి భార్యా పిల్లలు డొక్కలు ఎండిపోయి ఆకలితో అలమ

టిస్తూ, అతిదీనంగా ముష్టి ఎత్తుకోవడం కనిపించింది.

వెంటనే చైతన్యుడు, గురుపత్ని తనకు తిరుగు ప్రయాణానిక్కూడా సరిపోయేటట్లు కట్టియిచ్చిన ఆహారాన్ని పేదవాడి చేతుల్లో పెట్టి ముందుకు సాగాడు. అతడు నగరం చేరే సరికి బాగా చీకటి పడింది. ఆ రాత్రికి తలదాచుకునేందుకు ఒకసత్రం చేరి పడుకు న్నాడు. అర్ధరాత్రి సమయంలో చుట్టూ కల కలం ప్రారంభమయ్యే సరికి, చైతన్యుడు లేచి కూర్చున్నాడు. ఎవరో బాటసారి సత్రం వసారాలో నురగలు కక్కుతూ గిలగిలా కొట్టకోవడం అతడికి కనిపించింది. అంతలో గోడవారగా చరచరా పాకిపోతున్న నల్లత్రాచు కంటబడింది.

వెంటనే, ఆ బాటసారిని కాటు వేసిందని గ్రహించిన చైతన్యుడు, తన దగ్గరవున్న విష హారిణి తీగపసరు అతడి నోటిలో పిండాడు. క్షణాల్లో అతడి శరీరం నీలి రంగు నుంచి, సహజమైన ఛాయలోకి మారింది. నెమ్మదిగా కళ్ళు తెరిచిన ఆ బాటసారి ఎవరో కాదు: సుశాంతనగర మంత్రి. ప్రజల సాధకబాధకాలు తెలుసుకునేందుకు మారువేషంలో నగర సంచారం చేస్తూ, సత్రంలో పాముకాటుకు గురయ్యాడు.

ఆయన చైతన్యుణ్ణి పరిపరి విధాల మెచ్చు కుని, ''నా ప్రాణాలు కాపాడావు. ప్రత్యుపకా రంగా, నేనేం చేసినా ఋణం తీరదు. అయినా, నాకు తోచిన సాయం చేయదలచాను. రాజా స్థానంలో నీకు మంచి పదవి ఇప్పిస్తాను. ఏ మంటావు?'' అని అడిగాడు.

చైతన్యుడు, మంత్రికి కృతజ్ఞత చెప్పుకుని, తాను అత్యవసరం అయిన పని మీద దాపుల



నున్న భవానీపురం వెళుతున్నాననీ, తర్వాత వచ్చి దర్శనం చేసుకుంటాననీ చెప్పి, తెల్లవారగానే బయల్దేరి భవానీపురంలోని గురువుగారి సోదరుడి ఇల్లు చేరి, క్షేమ సమాచారాలు తెలుసుకుని, వెంటనే తిరుగు ప్రయాణమయ్యాడు.

అతడు సూర్యాస్తమయ సమయానికి గురుకులానికి చేరి, గురువుకు తన ప్రయాణ విశేషాలన్నీ ఒక్కపాల్లు కూడా పోకుండా చెప్పాడు.

గురువు సంతోషించి, ''నాయనా, చైతన్యా! నువ్వు అడిగిన ప్రశ్న - దేవుడిని చూపమని కదా? నా అవసరం లేకుండానే, నువ్వే చూడగలిగావు దేవుణ్ణి!'' అన్నాడు.

''నేనా! నాకే దేవుడూ కనిపించలేదు!'' అంటూ ఆశ్చర్యపోయాడు చైతన్యుడు.

ఆ జవాబుకు రామదేవుడు చిరునవ్వు నవ్వి, ''ఇక్కడా అక్కడా అని లేకుండా, అప్పుడు ఇప్పుడు అని కాక, ఎక్కడ బడితే అక్కడ - ఏ ఒక్క రూపానికో పరిమితం కాకుండా కనిపిస్తాడు, ఆ సర్వాంతర్యామి. గమనించే విజ్ఞత వుంటే చాలు!'' అన్నాడు.

చైతన్యుడు అర్థంకాలేదన్నట్టు విస్తుపోతూ, గురువుకేసి చూశాడు. అప్పుడు రామదేవుడు, ''విను! నీకు విషహారిణి తీగగురించి తెలియజెప్పిన, గుడ్డిముసలికోయవాడు దేవుడు. అడవిలో కూడా అవసరం కలుగుతుందేమో అని, బావితవ్వించిన వ్యక్తి కూడా దేవుడే. నీ ప్రాణం కాపాడిందే, ఆ అల్పజీవి కుందేలు కూడా దైవాంశమే. పాముకాటుకు గురై ప్రాణాపదలోవున్న మంత్రిని కాపాడిన నీలో కూడా, నీకు తెలియకుండానే, ఆ దేవుడు న్నాడు. చూశావా! ఇన్ని రూపాలతో ప్రత్యక్షమైన, ఆ దేవుడికి - ఇంత చూసినా, ఉనికి లేదనే అంటావా?'' అని అడిగాడు. దానితో జ్ఞానోదయమైంది చైతన్యుడికి. జాలి, దయ గల మనసులోనే దేవుడు కొలువుంటాడని గ్రహించి, గురువుకు సాష్టాంగ నమస్కారం చేశాడు.

ఆ తర్వాత చైతన్యుడు, గురువు వద్ద వీడ్కోలు తీసుకుని, తల్లిదండ్రులను వెంటబెట్టుకుని సుశాంతనగరం చేరి, మంత్రి దర్శనం చేసుకున్నాడు. ఆయన సహాయంవల్ల, చైతన్యుడికి ఆస్థానంలో మంచి పదవి లభించింది.





## ప్రపంచ ప్రసిద్ధ వ్యక్తులలో గాంధీజీ

గత 60 సంవత్సరాలలో ప్రపంచ ప్రసిద్ధిగాంచిన వ్యక్తులు ఎవరు? అన్న విషయం మీద బ్రిటిష్ రెడ్‌క్రాస్ సొసైటీ ఇటీవల నిర్వహించిన ఒక సర్వేలో మహాత్మాగాంధీ, మదర్ థెరెసా స్థానం సంపాయించుకున్నారు. ఈ సర్వేలో దాదాపు 2000 మంది బ్రిటిష్ పౌరులు పాల్గొన్నారు.

దక్షిణ ఆఫ్రికా నాయకుడు నెల్సన్ మండేలా ప్రథమ స్థానంలో వచ్చాడు. కీ.శే. ప్రిన్సెస్ డయానా ద్వితీయ స్థానంలోనూ, సుప్రసిద్ధ గాయకుడు బాబ్గెల్ డోఫ్ తృతీయ స్థానంలోనూ వచ్చారు. మహాత్మాగాంధీ, మదర్ థెరెసా వరసగా నాలుగవ, ఐదవ స్థానాలు పొందారు.

## అతి పెద్ద పుస్తకం!

భూటాన్‌కు సంబంధించిన వివిధ విషయాలను చిత్రాలతో, ఛాయా చిత్రాలతో సమగ్రంగా వివరించే ఒక పుస్తకం బరువు 130 పౌండ్లు. దాదాపు డైనింగ్ టేబుల్ పరిమాణంలో వున్న ఈ బృహద్గ్రంథం అమెరికాలోని సీటిల్‌లో 10,000 అమెరికన్ డాలర్లకు అమ్ముడు పోయింది. గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్ దీన్ని ప్రపంచం లోనే అతి పెద్ద పుస్తకంగా గుర్తించింది. ఈ పుస్తకం అమ్మకాలతో వచ్చే మొత్తాన్ని భూటాన్ విద్యాకార్యక్రమాల నిర్వహణకు ఉపయోగిస్తారు. అరుదైన ఛాయాచిత్రాలుగల ఈ పుస్తకం పేరు: ఎ విజువల్ ఒడిస్సీ అక్రాస్ ది లాస్ట్ హిమాలయన్ కింగ్‌డమ్.



# పాఠకులకు కథల పోటీ

## ఉత్తమ రచనకు రూ. 250 బహుమతి

ఈ కింది కథను చదవండి:

విజయరామరాజా వారి రాజభవనంలో భీమయ్య ప్రధాన వంటవాడుగా ఉండేవాడు. ఒకరోజు రాణి వాణ్ణి పిలిచి, ''ఈరోజు మా సోదరుడు వచ్చాడు. మహారాజుతో కలిసి భోజనం చేస్తాడు,'' అన్నది.

'నేను మహారాజావారికి మాత్రమే వంట చేయగలను,' అన్నాడు వంటవాడు.

రాణిగారికి కోపంవచ్చి రాజుకు ఫిర్యాదు చేసింది. రాజు వంటవాణ్ణి పిలిపించి సంజాయిషీ అడిగాడు.

''నిజమే ప్రభూ! నేను తమకు మాత్రమే వంట చేయగలనని చెప్పాను,'' అన్నాడు వంటవాడు.

''సరే, నేను నీకు వంద వెండినాణాలు అదనపు జీతంగా ఇచ్చాననుకో, అప్పుడు నా బావమరిదికి కూడా వంట చేస్తావా?'' అని అడిగాడు రాజు

దానికి వంటవాడు చెప్పిన సమాధానం ఏమిటో ఊహించగలరా? కింది అంశాలను గుర్తుంచుకోండి.

- అదనపు జీతం అనగానే వంటవాడు సరేనన్నాడా?
- వంటవాడు తను చెప్పిన మాట మీదే నిలబడ్డాడా?
- ఇతరులకు కూడా వంట చేయమని రాజు వంటవాణ్ణి పురమాయించాడా?

100-150 మాటలతో కథకు ముగింపురాసి, చక్కని పేరుపెట్టి మాకు పంపండి. కవరు మీద 'కథల పోటీ'కి అని రాయండి. కింది కూపన్‌ను తప్పక జతచేయండి.

**కథలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ: అక్టోబర్ 31, 2004**

పేరు ______________________ వయసు _______ పుట్టిన తేదీ __________

పాఠశాల ______________________________ తరగతి ______________

ఇంటి చిరునామా ____________________________________________

__________________________________________________________

________________________________ పిన్‌కోడ్ _______________

తల్లి/తండ్రి సంతకం

విద్యార్థి/విద్యార్థిని సంతకం

చందమామ ఇండియా లిమిటెడ్

82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097



# జాలిగుణం

పోలవరం అనే గ్రామంలో పోలయ్య అనే వర్తకుడుండేవాడు. అతడికి మురారి అని ఒక్కడే కొడుకు. వాడిలో చిన్నతనం నుంచే జాలిగుణం ఎక్కువగా వుండేది. వాడిప్పుడు పదేళ్ళవయసువాడయ్యాడు.

ఒకరోజున మురారి వీధిలోకి ఆడుకునేందుకు వెళ్ళి, ఒంటి మీదచొక్కాలేకుండా తిరిగి వచ్చాడు. జరిగిందేమంటే – వాడితో ఆడుకుంటున్నవాడి స్నేహితుడికి చొక్కా చిరిగి పోయింది. వాడు పేదవాడు. ఉన్న ఒక్క చొక్కా చిరిగి పోయిందనీ, రేపటి నుంచి చొక్కాలేకుండా తిరిగాలనీ, వాడు ఏడవసాగాడు. అందుచేత, మురారి తన చొక్కా వాడికి దానం చేశాడు.

ఇది విని పోలయ్య, మురారిని బాగా తిట్టాడు. వ్యాపారగుణానికి జాలి పనికిరాదనీ, పద్ధతి మార్చుకోమనీ కొట్టబోయాడు. పోలయ్య భార్య అడ్డుపడి, ''వాడిని తిట్టీ కొట్టీ ప్రయోజనం లేదు. మనం వర్తకులం. దానగుణం వుండడం మేలో కీడోగాని, జాలిగుణం ముదిరితే మాత్రం వీడు వ్యాపారంలో నష్టపోతాడు. వాడిని తగిన గురువు వద్ద చదివించి, వాడిలో వివేకాన్ని మేల్కొల్పే ప్రయత్నం చేయండి,'' అన్నది.

భార్య సలహా నచ్చిన పోలయ్య, మురారిని వెంటబెట్టుకుని సుశర్మ ఇంటికి వెళ్ళాడు. సుశర్మ మంచి పండితుడు. పోలయ్య, సుశర్మకు జరిగింది చెప్పి, ''పంచతంత్రంలోని విష్ణుశర్మ రాకుమారులకు జ్ఞానం కలిగించినట్లు, నా కొడుకు మురారికి కూడా మీరే జ్ఞానం కలిగించాలి. వీడు చదివి ఉద్యోగాలు చేసి ఊళ్ళేలనక్కరలేదు. వర్తకుడి కొడుకుగా తయారైతే చాలు. జాలిగుణం లేదా తన్ను మాలిన ధర్మం, మా వర్తకులకు పనికిరాదని, వీడికి జ్ఞానోదయం కలిగించండి,'' అన్నాడు.

పోలయ్య చెప్పింది విన్న సుశర్మ చిన్నగా నవ్వి, ''పోలయ్యగారూ! మనిషికుండవలసిన ప్రధానమైన మంచి గుణాల్లో జాలిగుణం ఒకటి. సాటి మనిషి పట్ల జాలి చూపనివాడు, పాషాణ హృదయుడే తప్ప మనిషి కాడు. అయితే, జాలికి కాస్త అమాయకత్వం, తోడు

డా. జొన్నలగడ్డ మార్కండేయులు



కాకుండా జాగ్రత్తపడాలి. విచక్షణ చూపాలి!'' అని మురారిని శిష్యుడుగా చేర్చుకున్నాడు.

ఆ రోజు నుంచి మురారి ఉదయం, సాయంత్రం సుశర్మ ఇంటికి వచ్చి విద్యనేర్చుకోసాగాడు. ఒక నాటి ఉదయం సుశర్మ, మురారితో, ''నాయనా! నువ్వు చదువు పట్ల మంచి శ్రద్ధకనబరుస్తున్నావు, బావుంది. నువ్వు చాలా సున్నిత మనస్కుడివి; అందువల్లనే నీలో జాలిగుణం ఎక్కువ. అయితే, జాలి చూపించే ముందు, ఆ జాలికి అవతలివాళ్ళు అర్హులో కాదో గ్రహించగలగాలి. వ్యాపారానికి నేర్పు, వాక్చాతుర్యం ముఖ్యం. అందులో జాలిగుణానికి తావు లేదు. ఇది తెలుసుకుని నువ్వు ఆలోచించడం మొదలు పెడితే, ఇతరులకు సహాయపడాలన్న నీ నైజగుణం ప్రయోజనకరంగా రూపుదిద్దుకుంటుంది!'' అన్నాడు.

ఆవెంటనే మురారి, ''గురువుగారూ! నా జాలిగుణానికీ, వృత్తి ధర్మమైన వ్యాపారానికీ సంబంధమేమిటో అర్థంకాలేదు,'' అన్నాడు.

''అది నీకు త్వరలో అర్థమౌతుంది. సరే, ప్రస్తుతానికి నువ్వొక చిన్న పని చెయ్యాలి. ఇప్పుడు మా తల్లికి వైద్యుడు వరదాచారిగారు మందులు ఇస్తున్నాడు. నువ్వాయన ఇంటికి వెళ్ళి, నేను పంపించానని చెప్పి, ఆయనిచ్చే మందు తీసుకురా,'' అన్నాడు సుశర్మ.

మురారి, వరదాచారి ఇంటికి వెళ్ళి సంగతి చెప్పాడు. ఆయన, ''మందు తయారు చేయడానికి ఒక గంట పడుతుంది. రోగుల్ని పంపించేశాక, నీ పని చూస్తాను,'' అన్నాడు.

ఆయన మందు కోసం వచ్చిన ప్రతి రోగితోనూ, ''నాకు వైద్యంకోసం మూలికలు తెచ్చిపెట్టే ఒక కుంటివాడున్నాడు. వాడి తండ్రి గుండె జబ్బుతో బాధపడుతున్నాడు. దానికి బంగారం, పాదరసం పుటం పెట్టి, రసరాజ గుళికలు తయారుచేసి వాడాలి. చాలాఖర్చు. నావంతు సాయం నేను చేస్తాను. మీరు జాలితో వాడికి తృణమో పణమో ఇవ్వండి. వాడిప్పుడు బయట నిలబడివున్నాడు,'' అని చెప్పాడు.

ఆమాటలు వింటూనే మురారి మనసు జాలితో నిండిపోయింది. వాడు బయటికి వచ్చి చూశాడు. ఇంటి అరుగు పక్కన ఒకడు కర్ర ఊతంగా పట్టుకుని నిలబడివున్నాడు.

రోగులందరూ వెళ్ళిపోయాక మురారి, వరదాచారి దగ్గరకు వచ్చి, ''అయ్యా, జాలిగుణం కూడదన్న మా గురువుగారి మాటలు నిజమనిపించడంలేదు. ఆ కుంటివాడికి జాలి కొద్దీ చాలా మంది డబ్బులు వేసిపోతున్నారు. నా దగ్గర డబ్బేంలేదు. ఈవేలి ఉంగరం తమకిస్తు

న్నాను. ఆ అవిటివాడి తండ్రికి రసగుళికలు తయారు చేయడానికి సాయపడుతుంది!'' అన్నాడు.

మురారి మాటలకు, వరదాచారి పెద్దగా నవ్వి, వీధిలోకి తొంగి చూసి, "వీరయ్యా!'' అంటూ కేక వేశాడు.

అవిటివాడిలా కర్ర ఊతంతో నిలబడివు న్నవాడు చప్పున కర్రను అరుగుమీద పడ వేసి, చకచకా నడుస్తూ లోపలికి వచ్చాడు. ఇది చూసి మురారి ఆశ్చర్యపడుతున్నంతలో, వరదాచారి వాడి భుజం తట్టి, "వీణ్ణి నేనే ఏర్పాటు చేశాను. మనిషి జాలిగుణాన్ని ఆసరా చేసుకుని, ఎలా సంపాదించవచ్చో నీకర్థ మైందనుకుంటూను. నీవేలి ఉంగరం, నీ తండ్రి ప్రేమతో నీకిచ్చింది. నీ జాలిగుణం కొద్దీ దాన్ని ఒక మోసగాడికి ఇచ్చెయ్య బోయావు, అవునా?'' అని అడిగాడు.

మురారి అవునన్నట్టు తల ఊపాడు. అప్పుడు వరదాచారి, "నా వృత్తి ధర్మం ఒక రోగికి ఉప యోగపడడానికి అప్పుడప్పుడూ, ఒక చిన్న మోసమో, అబద్ధమో ఆడవలసివస్తుంది. నీ గురువుగారి తల్లి సంగతే చూడు! వార్థక్యంలో వచ్చే సాధారణ శరీరలక్షణాలను, వ్యాధి అను కుని భయపడుతున్నది. అది వ్యాధికాదని చెబితే ఆమెకు తృప్తికలగదు. అందుచేత, కాస్త బలవర్ధకమైన గుళికలకు లేనిపోని గొప్ప గుణాలు ఆపాదించి పంపుతూంటాను. ఆవిడ తృప్తి పడుతుంది. ఇప్పుడు నీకిచ్చి పంప బోయేవి అటువంటి గుళికలే!'' అని ఒక పొట్లం మురారి చేతికిచ్చి, "ఇక ముందు నువ్వు చేయబోయే వర్తకం మీద అంకిత భావం అలవాటు చేసుకుని, ప్రయోజనకర మైన జాలిగుణంతో కీర్తితెచ్చుకో. ఆ అవిటి వాడి నాటకమంతా, మీ గురువుగారు ఆడించి నదే,'' అన్నాడు.

మురారి మందుగుళికల పొట్లంతో సుశర్మ ఇంటికి తిరిగివచ్చి, దాన్ని ఆయన కిస్తూ, "గురువుగారూ! మనలోని జాలిగుణాన్ని అనాలోచితంగా అందరి పట్లా కనబరచ కూడదని, తెలుసుకున్నాను,'' అన్నాడు.

మురారిలో వచ్చిన మార్పు, సుశర్మకు చాలా సంతోషం కలిగించింది. నా ప్రయత్నం ఫలించింది. వ్యాపారి పోలయ్య చాలా అదృష్ట వంతుడు, అనుకున్నాడాయన.



## మహారాష్ట్ర జానపద కథ

# శనివారం వింతలు-విడ్డూరాలు!

ఒకానొక గ్రామంలోని ఒక పేద రైతుకు ముగ్గురు కొడుకులు ఉండేవారు. రైతు వారిని అల్లారుముద్దుగా పెంచి పెద్ద చేశాడు. కొడుకులు తండ్రి పట్ల ఎంతో ఆదరాభిమానాలు కనబరచేవారు. అందరూ కలిసి పొలం పనులు చేసుకునేవారు.

కొడుకులు యుక్తవయస్కులయ్యాక తండ్రి వారికి పెళ్ళిళ్ళు చేశాడు. ముగ్గురు కోడళ్ళు వచ్చారు. వారిలోవారు కలిసి మాట్లాడుకుని వారం రోజులు ఒక్కొక్క కోడలు ఇంటిపట్టునే వుండి ఇంటి పనులు, వంట పనులు చేయాలని ఏర్పాటు చేసుకున్నారు.



అది ఒక శనివారం. ఆ రోజు వంటపని చిన్నకోడలి వంతు. వంట చేయడానికి పొయ్యి ముట్టిస్తూండగా వీధిలో నుంచి, "అమ్మా," అన్న పిలుపు వినిపించింది. ఆమె వాకిట్లోకి వచ్చి చూస్తే చిరిగిన బట్టలతో ఒక బిచ్చగాడు కనిపించాడు. "ఒళ్ళంతా దురదగావుంది. నూనె కొంచెం ఇస్తావా తల్లీ. ఒంటికి రాసుకుని స్నానం చేస్తాను," అన్నాడు బిచ్చగాడు ఆమెను చూడగానే.

ఆమె ఇంటిలోపలికి వెళ్ళి సీసాలో నూనె తెచ్చి, బిచ్చగాడి అరచేతిలోకి పోసింది. వాడు దాన్ని ఒంటికి రాసుకున్నాడు. "పక్కనే చెరువు వుంది. వెళ్ళి స్నానం చేసిరా, ఇంత తిని వెళుదువు," అన్నది చిన్నకోడలు.

బిచ్చగాడు స్నానం చేసి తిరిగివస్తూ, దారిలో పెద్ద పెద్ద ఆకులను కోసుకుని పళ్ళెంలా చేసుకుని మరీ వచ్చాడు. చిన్న కోడలు వాడికి ఆ ఆకులో భోజనం పెట్టింది. "ఇంత మంచి భోజనం తిని చాలా రోజులయింది, తల్లీ," అంటూ వాడు భోజనం పూర్తిచేసి, ఆకును తీసి మడిచి ఇంటి చూరులో దోపి వెళ్ళాడు. కోడలు దాన్ని చూసింది కాని, ఆ సంగతి అంతటితో మరిచిపోయింది.

పొలం పనులకు వెళ్ళిన ఇంటిల్లిపాదీ తిరిగివచ్చి, కూర్చుని భోజనం చేస్తూ, వంటలు అద్భుతంగా ఉండడంతో చిన్న కోడలిని ఎంతో



మెచ్చుకున్నారు. అయినా, ఇంటికి వచ్చిన బిచ్చగాణ్ణి గురించి చెప్పే అవకాశం ఆమెకు రాలేదు.

ఒక వారం గడిచి మరుసటి శనివారం వచ్చింది. ఆ రోజు వంట చేయడం రెండవ కోడలివంతు. ఆమె వంట పనులు ప్రారంభిస్తూండగా బిచ్చగాడి కంఠ స్వరం వినిపించింది. ఆమె వెలుపలికి రాగానే బిచ్చగాడు, "ఒళ్ళంతా కురుపులుగా ఉన్నాయి. నూనె రాసుకుని స్నానం చేయాలి. కొద్దిగా నూనె ఇవ్వు తల్లీ పుణ్యముంటుంది," అన్నాడు.

ఒళ్ళంతా పుళ్ళతో ఉన్న వాణ్ణి చూడగానే ఆమెకు కంపరం కలిగి, "నీలాంటి ముష్టివెధవలకు ఇవ్వడానికి మాయింట నూనె లేదు, ఏమీ లేదు. వెళ్ళు వెళ్ళు," అని తిట్టి ఇంటి లోపలికి వెళ్ళిపోయింది.

"నూనె లేకపోతే పోయింది. పొద్దుట్నుంచి ఏమీ తినలేదు. ఒక రొట్టె ముక్క వుంటే పెట్టు తల్లీ. తిని ఆకలి తీర్చుకుంటాను," అన్నాడు బిచ్చగాడు.

"నువ్వు ఇంకా ఇక్కడే తగలడ్డావా?" అంటూ ఆమె లోపలి నుంచే, అక్కడున్న మురికి నీళ్ళ బొక్కెన తీసి కిటికీగుండా వాడి మీదికి పోసింది.

"ఒక ముష్టివాడికి నువ్వు చేసే సాయం ఇదన్నమాట! ఈ రోజంతా నీకు నా గతే," అంటూ వెళ్ళిపోయాడు బిచ్చగాడు.

కోడలు అదేం పట్టించుకోకుండా వంట పనిలో నిమగ్నమైపోయింది. సాయంకాలానికి పొలం నుంచి అందరూ తిరిగివచ్చారు. ఎప్పటిలాగే భోజనాలకు కూర్చున్నారు. అయితే, వంట పాత్రలన్నీ ఖాళీగా ఉండడం చూసి రెండవ కోడలు నిర్ఘాంత పోయింది. వాటిలో స్వయంగా వంటలు పెట్టి మూత పెట్టింది తను. అయినా ఎవరో తినివెళ్ళినట్టు పాత్రలన్నీ శుభ్రంగా తుడిచినట్టు ఉన్నాయి!

కోడలిపట్ల ప్రేమానురాగాలుగల మామగారు ఆమెను పల్లెత్తుమాట అనలేదు. మిగిలిన ఇద్దరు కోడళ్ళనూ వంట పనిలో ఆమెకు సాయపడమని చెప్పాడు. అయితే, పిండి డబ్బా ఖాళీగా వుంది. గుప్పెడు పిండి కూడా లేదు. కూరగాయల బుట్ట కూడా ఖాళీగానే వుంది. నూనె పాత్రలో బొట్టు నూనె లేదు.

అయినా, మామగారు కోడలిని తప్పు పట్టలేదు. రెండవ కొడుకును వెంటబెట్టుకుని అంగడికి వెళ్ళి కావలసిన వెచ్చాలు, కూరగాయలు కొని తెచ్చాడు. ముగ్గురు కోడళ్ళూ కలిసి వంట చేశారు. అందరూ తిని పడుకున్నారు.

మరోవారం గడిచింది. మూడో శనివారం వచ్చింది. ఇప్పుడు వంట చేయడం పెద్ద కోడలి వంతు. ఆమె పొయ్యి రగిలిస్తూండగా, "అమ్మా కొద్దిగా నూనె ఇవ్వు తల్లీ," అని బిచ్చగాడి



కంఠస్వరం విని వెలుపలికి రాగానే, మళ్ళీ బిచ్చగాడు అదేమాట వల్లించి, "ఒళ్ళంతా దురదలుగా ఉన్నాయి తల్లీ! నూనె రాసుకుని స్నానం చేయాలి. కరుణ చూడు తల్లీ," అన్నాడు.

వంటపనికి అంతరాయం కలిగిందని ఆమెకు పట్టరాని కోపం వచ్చింది. దాంతో పాటు, గతశనివారం తన తోడికోడలు ఏమరుపాటుతో ఉన్నప్పుడు ఈ ముష్టివెధవే వచ్చి ఉన్నదంతా తిని, దోచుకొని వెళ్ళాడేమో అన్న అనుమానం కూడా కలగడంతో, "దొంగవెధవా! పిండీ, కూరగాయలు, నూనె మళ్ళీ దొంగిలించడానికి వచ్చావా? వెళ్ళు ఇక్కణ్ణించి," అని గద్దించింది.

"అభాండం వేయకు తల్లీ. నేను దొంగను కాను. ఇంత నూనె పోసి, రొట్టె ముక్క పెట్టు తల్లీ. దేవుడు నిన్ను చల్లగా చూస్తాడు," అన్నాడు బిచ్చగాడు.

"ఒరే, నీ ప్రార్థనలు, దీవెనలు నాకు వద్దు," అంటూ ఒక కర్రపుచ్చుకుని, "మర్యాదగా ఇక్కణ్ణించి వెళతావా? గెంట మంటావా?" అన్నది ఆగ్రహంతో.

"అంటే, నా ప్రార్థన మన్నించవన్న మాట! ఇక ఈ రోజు నువ్వు చేసిన వంట మీవాళ్ళు తిన్నట్టే!" అంటూ బిచ్చగాడు వెళ్ళిపోయాడు.

వాణ్ణొక పిచ్చివాడికింద జమకట్టిన పెద్ద కోడలు, వాడి మాటలేవీ పట్టించుకోకుండా చకచకా పనులు ప్రారంభించి వంట పూర్తి చేసి, తన వాళ్ళ రాకకోసం ఎదురు చూస్తూ కూర్చున్నది.

అందరూ వచ్చి భోజనాలకు కూర్చున్నాక, వంటలతో ఉన్న పాత్రలను తెచ్చి వాళ్ళ ముందుంచి, ఒక్కొక్క పాత్ర మూత తీసింది. రొట్టెల చుట్టూ పురుగులు తిరుగుతున్నాయి. పప్పులో చీమలు, ఈగలు. వాటిని చూసి దిగ్భ్రాంతి చెందిన ఆమె భోరున ఏడుస్తూ వంటగదిలోకి వెళ్ళిపోయింది.

పరిస్థితి మామగారికి అర్థమయింది. తెలియకుండానే మనం దేవతలకేదో అపచారం చేసి వారి ఆగ్రహానికి గురయ్యాం. లేకుంటే గత శనివారం, ఈ రోజు ఇలాంటి దుర్ఘటనలు జరిగే అవకాశం లేదు. మనం దేవతలను సంతోష పరచి దీనికేదైనా పరిష్కారం చూడాలి!" అన్నాడు సాలోచనగా.

ఆ తరవాత ఆయన పెద్ద కొడుకును వెంటబెట్టుకుని వెళ్ళి కావలసిన వంట సామగ్రిని తెచ్చి, ముగ్గురు కోడళ్ళను వంట చేయమని చెప్పాడు.

వారం గడిచింది, నాలుగో శనివారం రానే వచ్చింది. ఆ రోజు వంట చేయడం మళ్ళీ చిన్న కోడలు వంతయింది. ఆమె వంట చేయ డానికి ఉపక్రమిస్తూండగా పరిచిత కంఠ స్వరం మళ్ళీ వినిపించింది. వెలుపలికి వచ్చి చూస్తే అదే బిచ్చగాడు. అలాగే నూనె అడిగాడు.

''కొన్నాళ్ళ క్రితం వచ్చి అడిగావు కదా. ఇంకా నీకా పుళ్ళు, దురదలు పోలేదా?'' అంటూ చిన్న కోడలు ఇంటి లోపలికి వెళ్ళి నూనె తెచ్చి వాడి చేతిలో పోసింది. వాడు నూనెను ఒంటికి రాసుకుంటూండగా, ''వెళ్ళి స్నానం చేసిరా, ఇంత తిని వెళుదువు,'' అన్నదామె.

కొంత సేపటికి వాడు ఆకుల పళ్ళెంతో తిరిగి వచ్చాడు. ఆమె పెట్టిన రొట్టెలు సంతోషంగా తిని, ''మీ భార్యాభర్తలు పిల్లాపాపలతో చిర కాలం, సుఖసంతోషాలతో వర్థిల్లండి,'' అంటూ లేచి, తిన్న ఆకును చూరుకు దోపి వెళ్ళిపోయాడు.

ఆరోజు సాయంకాలం ఆమె చేసిన వంటను అందరూ సంతోషంగా తిన్నారు. ''అంతా చాలా విచిత్రంగా వుంది. ఒక శనివారం వంటలు కనిపించకుండా పోయాయి. మరొక శని వారం వంటలనిండా పురుగులు, చీమలు, క్రిమి కీటకాలు. మరి ఇవాళ భోజనమేమో ఎంతో రుచిగా వుంది! అంటే మనపట్ల దేవతలకున్న కోపం పోయిందన్న మాట. శాంతించి నట్టుంది!'' అన్నాడు మామగారు.

అప్పుడే భోజనం చేయడానికి కూర్చున్న చిన్న కోడలు, ఈ రెండు శనివారాలలో వచ్చిన బిచ్చగాణ్ణి గురించి వివరించి, వాడు తమ ఇంటి చూరులో దాచి వెళ్ళిన విస్తరాకులను మామగారికి చూపించింది.

మామగారు లేచివెళ్ళి ఒక విస్తరాకును తీసి చూశాడు. అందులో మణులూ, మాణి క్యాలూ, రత్నాలూ ఉన్నాయి. రెండవ విస్తరిని తీశాడు. అందులో బంగారు నాణాలు ఉన్నాయి. ఆ కుటుంబం ఆనందాశ్చర్యాలకు అవధులు లేకుండా పోయాయి.

అప్పుడు గత రెండు శనివారాలలో బిచ్చ గాడు వచ్చి నూనె అడిగినప్పుడు తామెలా తరిమికొట్టిందీ, పెద్ద కోడలూ, రెండవ కోడలూ మామగారికి వివరించారు.

''బహుశా శనిభగవానుడే బిచ్చగాడిలా మన ఇంటికి వచ్చాడనుకుంటాను! ఇప్పు డాయన ప్రీతి చెందాడు,'' అన్నాడు రైతు ఆనందంగా.

కొన్నాళ్ళకు ఈ సంఘటన గురించి ఇరుగు పొరుగుకు తెలిసింది. గ్రామ ప్రజలు శని వారాలలో శనీశ్వరుణ్ణి పూజించేప్పుడు ప్రధా నంగా నువ్వుల నూనె పెట్టడం ప్రారంభిం చారు. ఆ సంప్రదాయం కొన్ని ప్రాంతాలలో ఇప్పుడూ కొనసాగుతోంది.





# పంచాయుధుడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్వుడు యువరాజుగా జన్మించాడు. నామకరణ మహోత్సవంనాడు, దేశదేశాల నుంచి దైవజ్ఞులు వచ్చారు. వాళ్ళు రాజుతో, "మహారాజా, ఈ పసివాడు చాలా గొప్ప జాతకుడు. ఐదు ఆయుధాలతో ప్రపంచాన్నంతా జయించగల గొప్ప పరాక్రమశాలి," అని జోస్యం చెప్పి, పిల్లవాడికి పంచాయుధుడు అని పేరు పెట్టారు.

కొంతకాలం గడిచింది. పిల్లవాడికి ప్రాజ్ఞత రాగానే, రాజు అతణ్ణి గాంధర్వదేశంలోని సుప్రసిద్ధ తక్షశిలా నగరానికి, మహాపండితులైన గురువుల వద్ద సమస్త విద్యలూ నేర్చుకునేందుకు పంపాడు.

పంచాయుధుడు తక్షశిలలో కొంత కాలం చదువుకుని, సకల విద్యాపారంగతుడయ్యాడు. గురుకులం నుంచి సెలవు తీసుకునేటప్పుడు, గురువు శిష్యుణ్ణి దీవించి, ఐదు ఆయుధాలను ప్రసాదించాడు. గురువుగారి అనుజ్ఞతో కాశీరాజ్యానికి బయలుదేరాడు.

దారిలో పంచాయుధుడు ఒక మహారణ్యాన్ని దాటవలసి వచ్చింది. అతడు అరణ్యమార్గాన నడుస్తూండగా, కొందరు మనుషులు ఎదురుపడి, "చూడబోతే చాలా చిన్నవయసువాడివి. ఈ మహారణ్యంలో రోమాంచుడనే భయంకర రాక్షసుడు విహరిస్తూంటాడు. వాడి కంట బడితే, నీ ప్రాణాలు దక్కవు. అందువల్ల, ఈ మార్గం వదిలి, మరొక మార్గాన అరణ్యం దాటడం క్షేమం," అని సలహా ఇచ్చారు.

ఈ మాటలేవీ పరాక్రమశాలి అయిన పంచాయుధుడు పట్టించుకోలేదు. అతడు ఆ అరణ్యమార్గాన్నే నడవసాగాడు. మార్గంలో ఒకచోట, తాటిచెట్టు ప్రమాణంలో వున్న రాక్షసుడు రోమాంచుడు ఎదురయ్యాడు.

ఈ రోమాంచుడు చూడ భయంకరుడుగా వున్నాడు. పెద్ద తల, నిప్పులు చెరిగే కళ్ళు, ఏనుగుకున్నట్టు నోటిలో పొడవాటి రెండు దంతాలు, శరీరం నిండా ఎలుగుబంటిలా పొడవైన రోమాలు!

రాక్షసుడు, పంచాయుధుడి దారికి అడ్డుగా నిలబడి, "ఎవడివిరా, నువ్వు? ఎక్కడికి పోతావు? ఆగు, ఆగు! నిన్నిదే మింగబోతున్నాను," అంటూ హుంకరించాడు.

పంచాయుధుడు ఏమాత్రం భయపడక, "రాక్షస రాజా, తెలిసే నేనీ అరణ్యంలో ప్రవేశించాను. జాగ్రత్త, దగ్గిరకు రాకు," అని, పదునైన బాణం ఎక్కుపెట్టి, రాక్షసుడి పైకి వదిలాడు.

బాణం రివ్వుమంటూ పోయి, రాక్షసుడు ధరించిన జంతుచర్మాలకు తగిలింది. వాడు ఏమాత్రం గాయపడలేదు. ఈసారి పంచాయుధుడు బాణం వెంట బాణాన్ని వాడిమీద ప్రయోగించాడు. ప్రయోజనం లేకపోయింది. ఆఖరుసారిగా విషం పూసిన బాణాలను వదిలాడు. అవీ రాక్షసుడికి ఎలాంటి హానీ కలిగించలేక పోయినై. రాక్షసుడు ఈ సారి మరింత పెద్దగా హుంకరించి, పంచాయుధుడి మీదికి వెళ్ళాడు. పంచాయుధుడు తన ఖడ్గం దూసి, రాక్షసుడి మీదికి విసిరాడు. వాడు చలించలేదు.

అప్పుడు పంచాయుధుడు, "నీ మూఢత్వం కొద్దీ నన్ను గుర్తించలేకుండా వున్నావు. నా పేరు పంచాయుధుడు. నేనీ అరణ్యం ప్రవేశించేటప్పుడు, కేవలం నా ఆయుధాలను నమ్ముకునే ఆ పని చేయలేదు," అంటూ పిడికిలి బిగించి, రోమాంచుణ్ణి గట్టిగా ఒక్క పోటు పొడిచాడు.

రాక్షసుడు చలించకుండా పెద్దగా నవ్వి, "కుర్రవాడా, నీ వాలకం చూస్తూ వుంటే, నువ్వు మామూలు మనిషివిలా తోచడం లేదు. ప్రళయ భయంకరుడనైన నన్నే ఢీకొనటానికి సాహసించావు. మానవులు నా రూపం చూసే హడలెత్తిపోతారే, మరి నీకు ప్రాణ భయం లేకపోవడానికి కారణం ఏమిటి?" అని అడిగాడు.



"భయం ఎందుకు? పుట్టుకతో పాటే మరణం వుంటుంది. అంతేకాక, నా శరీరంలో వజ్రసమానమైనటువంటి ఖడ్గం ఒకటి వున్నది. అదే జ్ఞానం! నన్ను నీవు ఒకవేళ మింగటమే జరిగితే, ఆ ఖడ్గం నిన్ను, నిలువునా చీల్చే స్తుంది," అన్నాడు.

రాక్షసుడు ఒకటికి రెండు క్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, "కుర్రవాడా, నువ్వనే దాంట్లో ఏదో సత్యం వున్నట్టు నాకు అనుమానం కలుగుతున్నది. ఏది ఏమైనా, నువ్వు నిర్భయుడివి. నీ వంటి వాణ్ణి నేను మింగ గలిగినా జీర్ణించుకోవటం సాధ్యం కాదు. ఇక స్వేచ్ఛగా, నీ దారిన నువ్వు వెళ్ళు," అన్నాడు.

పంచాయుధుడుగా జన్మించిన బోధి సత్త్వుడు, రాక్షసుణ్ణి దీవించి, "నన్ను వది లావు, బాగానే వున్నది. నీ సంగతేమిటి? నువ్వు ఎన్ని జన్మల నుంచో దుర్మార్గపు పనులు చేస్తూ, ఇలా నికృష్టపు బతుకు, బతుకుతు న్నావు. అజ్ఞాన మనే అంధకారంలో కొట్టు మిట్టాడుతున్నావు. ఎంతకాలం జరిగినా, నీ గతి ఇంతే!" అన్నాడు.

"అయితే, మహానుభావా, ఈ అజ్ఞానం నుంచి బయట పడేందుకు నేనేం చేయాలి?" అని అడిగాడు రాక్షసుడు దీనంగా చేతులు జోడించి.

"నువ్వీ అరణ్యమార్గాన చేరి, దారే పోయే మానవులను చంపి తింటూ, పాపం పెంచు కుంటున్నావు. ఆ పాపం పెరిగిన కొద్దీ, నీవు రాక్షసజన్మలే ఎత్తి, యాతనలు అనుభవించ డమే కాని, ఎన్నటికీ నీకు మోక్షం లేదు. నీకు ఉత్తమమైన మానవజన్మ కావాలంటే, పాపం చేయకు," అంటూ బోధిసత్త్వుడు హితవు చెప్పాడు.

ఆ తరవాత బోధిసత్త్వుడు, రాక్షసుడికి మానవులు మేలు పొందేందుకు అనుసరించ వలసిన ఐదు మహా సూత్రాలను గురించీ, మానవులను అధములుగా చేసే పంచ తంత్రా లను గురించీ విప్పి చెప్పాడు.

ఆ నాటి నుంచీ రోమాంచుడు పరులను పీడించే తన రాక్షస కృత్యాలు మానివేయడమే కాకుండా, అరణ్యంలో ప్రయాణించే బాట సారులకు తన ఇంట ఆతిథ్యం ఇస్తూ, గొప్ప ధర్మబుద్ధి గలవాడని పేరు తెచ్చుకున్నాడు.

ఆ విధంగా బోధిసత్త్వుడి ధర్మబోధల వల్ల, మహాభయంకరుడైన రాక్షసుడు సన్మార్గ వర్తనుడయ్యాడు.





# విష్ణు కథ

శ్రీమతి స్వయంవరానికి దేశదేశాల రాజులు, ముల్లోకాల్లోని ప్రముఖులు అంతా వచ్చారు. విష్ణువేషంతో నారదుడు స్వయంవర మంటపం ప్రవేశించగానే అంతా ఘల్లున నవ్వారు. తన ముఖం కోతి ముఖంగా మారిందని తెలుసుకొని నారదుడు అవమానంతో ఉడికిపోయాడు.

శ్రీమతి విష్ణువును ధ్యానించింది. విష్ణువు ఆమె ముందు సాక్షాత్కరించాడు. శ్రీమతి మాలవేసి విష్ణువును వరించి, అతనితో వైకుంఠానికి వెళ్ళింది.

అది చూసి నారదుడు మరింత కోపంతో పర్వతుణ్ణి కూడగట్టుకొని అంబరీషుడిపై మండిపడ్డాడు. అడిగినప్పుడు తమకు ఇవ్వకుండా శ్రీమతిని విష్ణువుకు అప్పగించినందుకు అంబరీషుణ్ణి నాశనం చేయదలచి, శపించడానికి సిద్ధపడ్డారు. అప్పుడు విష్ణు చక్రం వచ్చి వారిని వెంట తరిమింది.

పర్వత నారదులిద్దరూ వైకుంఠానికి పరుగెత్తారు.

అక్కడ శ్రీమతితో ఉన్న విష్ణువును చూసి నారదుడు మరింత ఉడుకుమోత్తనంతో, "నువ్వు కూడా నీ శ్రీమతిని - అంటే నీ భార్యామణిని పోగొట్టుకొని విలపిస్తావు! నన్ను కోతి ముఖంవాడిని చేసి మోసగించావు. వానరులే నీ సహచరులై సహాయపడతారు గాక!" అని విష్ణువును శపించాడు.

నారదుడి శాపానికి విష్ణువు మందహాసం చేశాడు. శ్రీమతి లక్ష్మీదేవిగా నిజరూపం పొందింది. మునులను ఆవరించిన మాయ తొలగింది. జరిగినదానికి సిగ్గుపడుతూ నారద పర్వతులు విష్ణు పాదాల మీద పడ్డారు.

నారదుడు విష్ణు పాదాన్ని కన్నీటితో తడుపుతూ, శపించినందుకు నొచ్చుకొంటూంటే విష్ణువు నెమ్మదిగా మందహాసం చేస్తూ, నార



దుడి తల నిమిరి, "నారదా! త్రికాలవేత్తవైన నువ్వు విచారించడమేమిటి! నీ నోటిమాట అమోఘం. నువ్వు శపించింది కూడా నా సంకల్పమే! నా రామావతార సమయంలో అలాగే జరుగుతుందిలే! అదీ లోకకల్యాణం కోసమే!" అని చెప్పాడు.

అప్పటినుంచీ అంబరీషుడికి ఎవరివల్లా ఎటువంటి హానీ జరగకుండా, తన చక్రం అతనికి రక్షణగా ఉండేలాగ విష్ణువు అనుగ్రహించాడు.

దుర్వాసుడికి తపోబల గర్వంతో బాటు తామసం ఎక్కువ. ఒకనాడు తన ఆశ్రమం నుండి బయలుదేరబోతూండగా, ఆనంద పారవశ్యంతో కన్నులు మూసి విష్ణుసంకీర్తన పాడుతూ వస్తున్న నారదుడు ఎదురయ్యాడు.

"ఓహో, నారదా! కలహాభోజనంతో కడుపు నిండినట్టుందే! చాలా ఆనంద పారవశ్యంలో మునిగి ఉన్నావు!" అంటూ దుర్వాసుడు నారదుణ్ణి పలకరించాడు.

నారదుడు కళ్ళుతెరిచి వంగి వంగి నమస్కరిస్తూ, "దుర్వాసుల వారికి ప్రణామాలు! అలాంటి దేమీ పడక నకనకలాడుతున్నది గాని, మహర్షీ! విష్ణుభక్తి తత్పరులైన వారిని చూసినపుడల్లా నాకు పరమానందం పొంగుతూనే ఉంటుందాయె. అంబరీషుణ్ణి చూసి ఇలా వస్తున్నాగదా మరి..." అన్నాడు మరొకసారి వంగి ప్రణామం చేస్తూ.

"అంతటివాడా, అంబరీషుడు?" అన్నాడు దుర్వాసుడు.

"ఔను, మహర్షీ! విష్ణువు అనుగ్రహం పొందిన రాజర్షిసత్తముడు, ద్వాదశీ వ్రతం అతని ప్రాణం!" అన్నాడు నారదుడు.

"ఏమిటి నారదా! ఆ రాజును తెగపొగిడేస్తున్నావు?" అన్నాడు దుర్వాసుడు.

"అతణ్ణి చూస్తే తెలుస్తుంది, పొగడ్త కాదని! నీలాంటి మహర్షీశ్వరుడు అతని సదనాన్ని పావనం చేయడం వల్ల, అతని జన్మ ధన్యమౌతుంది. చరితార్థుడై మరింత వినుతికెక్కుతాడు!" అని చెప్పి నారదుడు నారాయణ నామజపం చేస్తూ వెళ్ళాడు.

నారదుడి మాటలు దుర్వాసుణ్ణి రెచ్చగొట్టాయి. అంబరీషుడి దగ్గిరికి బయలుదేరాడు.

ఏకాదశి ఉపవాసం చేసి, ద్వాదశీవ్రత సమాప్తిగా అప్పుడే భుజించడానికి అంబరీషుడు సిద్ధమౌతున్నాడు. దుర్వాసుడి రాకకు పరమానంద భరితుడై, అర్ఘ్యపాద్యాదులతో పూజించి, భోజనానికి ఆహ్వానించాడు.

దుర్వాసుడు నదిలో స్నానం చేసి వస్తానని చెప్పి వెళ్ళాడు. వెళ్ళినవాడు ఎంతకూ తిరిగి రాలేదు. ద్వాదశఘడియలు మించిపోతు న్నవి; ద్వాదశి దాటకుండా భోజనం చేయక పోతే వ్రతభంగం అవుతుంది. అతిథి రాకుండా తింటే దోషమౌతుంది!

అప్పుడు విజ్ఞులైన పెద్దలు అంబరీషుడితో కొంచెం నీరు చప్పరించితే వ్రతభంగమూ కాదు, అతిథి రాకుండా భుజించిన దోషమూ అంటదు అని చెప్పగా అలాగే అతను జల పారణం చేశాడు.

ద్వాదశి పోయి త్రయోదశి వచ్చినట్లేహుటా హుటిగా ఆగ్రహావేశంతో పట పట పళ్ళు కొరుకుతూ, జటాజూటాన్ని విప్పి విదలిస్తూ దుర్వాసుడు వచ్చాడు.

''ఓ రాజాధమా! విష్ణుభక్తుడి నంటూ గర్వించి ఆతిథ్యధర్మానికి అపచారం చేస్తావా? నాకే అవమానం తలపెట్టడానికి నీ కెన్ని గుండెలు? నేనెవర్నో తెలుసా? నా పేరు వింటే ముల్లోకాలూ, ముమ్మూర్తులూ గడగడలాడ వలిసిందే! నా శాపానికి తిరుగులేదు, దుర్మ రణం పాలౌతావు గాక!'' అని హుంకరిస్తూన్న దుర్వాసుడి పాదాల మీద తలవాల్చి అంబరీ షుడు, ''ఋషీశ్వరా! వ్రతభంగం కాకుండా వుండేందుకు జలపారణం మాత్రమే చేశాను. మన్నించమని వేడుకొంటున్నాను!'' అన్నాడు వినయంగా.

దుర్వాసుడు అంబరీషుని తలను తన్ని, ''దుర్వాసుడి కోశంలో మన్నించడం అనేది లేదు! భక్తీ, తపశ్శక్తుల్లో ఏది గొప్పదో నువ్వు స్వయంగా చూద్దువుగాని!'' అని అంటూ



అమిత ఆగ్రహంతో జటాజూటాన్ని సింహం లాగ విదిల్చాడు.

దుర్వాసుడి తపోమహిమ అంతా అతని జడల్లో అనేక శక్తులుగా నిక్షిప్తమై వుంది. పొడ వైన ఒక జడను తీసి పట్టుకొని మరో చేత్తో యోగదండాన్ని ఎత్తి ఆడిస్తూ జడను ఝళి పించాడు.

జడ నుంచి నిప్పురవ్వలు విరజిమ్ముతూ దట్టమైన నల్లని పొగలు సుడులు తిరుగుతూ ఆకాశానికి లేచాయి. ఆ పొగల్లో భయంక రాకారంతో పర్వతంలా కృత్య అనే మహా భూతం ఆవిర్భవించింది.

కృత్య ప్రళయభీకరంగా గర్జిస్తూ అంబరీ షుడిని చంపడానికి ఉరకబోతున్న మరు క్షణంలో అతనికి రక్షణగా విష్ణువు అను గ్రహించిన చక్రం జ్వాలలు కక్కుతూ రివ్వున వచ్చి కృత్యను ముక్కలు ముక్కలుగా నరికి



విధంగా అతడి తపశ్శక్తి అంతా ఆహుతి అయిపోయింది. చెట్టనక పుట్టనక, అడవులు నదులు పర్వతాలు దాటుతూ, దుర్వాసుడు పరుగెత్తుతున్నాడు. చక్రం తరుముకొంటూ వస్తోంది; మునిని ముల్లోకాలు తిప్పింది. దుర్వాసుడు బ్రహ్మలోకానికి పరుగు తీస్తుంటే నారదుడు ఎదురుపడి ముసి ముసి నవ్వులతో, "హా! తపో సంపన్నులు దుర్వాసుల వారేనా! ఏమిటా పరుగు?" అని అంటూంటే మారు మాటరాక వెన్నెంటి వస్తోన్న చక్రాన్ని చూపిస్తూ దుర్వాసుడు అదే పరుగున బ్రహ్మ ముందు పడ్డాడు.

"నేను విష్ణునాభికమలంనుంచి వచ్చినవాణ్ణి, నేనేం చెయ్యగలను? చక్రాన్ని ఎలా వారించగలను?" అన్నాడు బహ్మ.

"బ్రహ్మవని వస్తే ఇంతేనా నీ పస! నన్ను రక్షించగల ఆ మహేశ్వరుడున్నాడులే!" అన్నాడు ఋషి.

"ఔను, ఔను, దుర్వాసా! ఆ మాటా నిజమే. ఎంత త్వరగా వెళ్తావో కైలాసానికి, వెళ్ళు వెళ్ళు!" అన్నాడు బ్రహ్మ చేతులు దులుపుకొంటూ.

కైలాసానికి వెళ్ళి దుర్వాసుడు శివుణ్ణి రక్షించమని మొరపెట్టాడు.

"చక్రం విష్ణువుది. కోరి విరోధం తెచ్చుకోమన్నావా? వెళ్ళు. నీ దురహంకారానికిఫలితం అనుభవించక తప్పుతుందా మరి! వెళ్ళు, వెళ్ళు!" అన్నాడు శివుడు.

దుర్వాసుడు వైకుంఠానికిపరుగెత్తి విష్ణువు ముందుపడి, దీనాతి దీనంగా చక్రాన్నినివారించమంటూ శరణు వేడాడు.

మటుమాయం చేసింది. అదిచూసి దుర్వాసుడికి ముచ్చెమటలు పోశాయి.

కృత్యను నాశనం చేసిన విష్ణుచక్రం అంతటితో ఆగక, అమిత వేగంతో దుర్వాసుడి మీదకు వెళ్ళింది.

దుర్వాసుడు మరొక జడను పెరికి విసిరాడు. పర్వతమంత వజ్రపాషాణం అడ్డునిలిచింది.

చక్రం దాన్ని తుక్కు తుక్కుగా తూలగొట్టి దుర్వాసుణ్ణి వెంబడించింది.

ఇంకొక జడను ఋషి విసిరాడు! ఆకాశమంత మంచు మేఘం ఏర్పడి వెనువెంటనే చక్రజ్వాలల్లో ఆవిర్లు గక్కుతూ హరించిపోయింది.

దుర్వాసుడు పరుగెత్తుతూంటే అతని జటాజూట మంతా వెంట తరిమే చక్రజ్వాలలు తగిలి మసి మసి అయింది. ఈ

"అంబరీషుడికి రక్షగా నా చక్రాన్ని ఎప్పుడో అనుగ్రహించాను. అందువల్ల, ఇప్పుడు నేనేం చేసేది మహర్షీ? అంబరీషుణ్ణే చక్రాన్ని వారించమని అర్థించు!" అన్నాడు విష్ణువు.

దుర్వాసుడు హతాశుడై లేచాడు. అతని అహంకారం నశించింది. అతని తల బోసి పోయివుంది. తపశ్శక్తి అంతా తుడుచుకు పోయింది, భక్తిముందు తపశ్శక్తి ఎందుకూ పనికిరాదని తెలిసింది. అంబరీషుడి దగ్గిరకు బయలుదేరాడు. చక్రం శాంతంగా వెంట వెళ్తున్నది. దుర్వాసుడు పాదాలు పట్టుకో బోతూంటే అంబరీషుడు వారించి, లేవనెత్తి చక్రాన్ని ఆగమన్నాడు. చక్రం వెనక్కి మళ్ళి కొంతసేపటికి అదృశ్యమైంది.

అగ్రగణ్యులైన విష్ణువు భక్తుల్లో అంబరీషుడు పేరుపడ్డాడు.

సూర్యవంశ రాజుల్లో గాధి ఒక ప్రముఖుడు. గాధి కుమారుడు విశ్వామిత్రుడు, కృతాశ్వుడి దగ్గిర ధనుర్విద్య నేర్చాడు. అనేక అస్త్రాల్ని పొందాడు. అస్త్రవేత్తగా పేరు పొందాడు.

విశ్వామిత్రుడు రాజ్యపాలనకు వచ్చాక ఒకనాడు సపరివారంగా వసిష్ఠుని ఆశ్రమానికి వెళ్ళాడు. వసిష్ఠ మహర్షి తన హోమధేనువు మహిమ వల్ల అందరికీ సాదరంగా గొప్ప విందు చేశాడు.

పదిలక్షల గోవులను తీసుకొని హోమ ధేనువును ఇమ్మని విశ్వామిత్రుడు అడిగాడు; వసిష్ఠుడు ఇవ్వనన్నాడు.

విశ్వామిత్రుడు బలాత్కారంగా గోవును పరివారంచేత తోలించుకొని వెళ్ళబోతూంటే, వశిష్ఠుడు తన తపోబలంతో హోమధేనువు



నుండి అనేక మంది శబరయోధుల్ని పుట్టించాడు.

విశ్వామిత్రుణ్ణీ అతని పరివారాన్ని ధేనువు నుండి వచ్చిన యోధులు చిత్తు చిత్తుగా తరిమికొట్టారు.

రాజరికం కంటే తపోబలం మిన్న అని తెలుసుకొని విశ్వామిత్రుడు రాజ్యం విసర్జించి అనేక సంవత్సరాలు గొప్ప తపస్సు చేశాడు. తపస్సు సాధించి వసిష్ఠుడితో సమానుడనిపించుకున్నాడు. అప్పటినుంచి విశ్వామిత్రుడు వసిష్ఠుడితో పోటీగా వుంటూ వచ్చాడు.

రావణుడి అనుచరులైన రాక్షసులు తమ తమ బలాలతో ఆర్యావర్తం మీద విరుచుకుపడి యజ్ఞయాగాల్ని ధ్వంసం చేస్తూ, మునులను ఋషులను బాధించి, ఆశ్రమాలు తగలబెట్టసాగారు.

విశ్వామిత్రుడు గొప్ప యాగం తలపెట్టాడు. అది జరగకుండా మారీచుడు, సుబాహుడు అనే రాక్షస ప్రముఖులూ, తాటక అనే రాక్షసీ పట్టుదలతో ధ్వంసం చేస్తున్నారు.

విశ్వామిత్రుడు యాగభంగానికి చింతాక్రాంతుడై, హిమాలయ ప్రాంతంలో ఉన్న తన సిద్ధాశ్రమంలో ధ్యానమగ్నుడై కూర్చున్నాడు. ఆ ధ్యానసమాధిలో అతనికి మహావిష్ణువు అవతారంగా సూర్యవంశంలో రఘువు సంతతిలో పుట్టి పెరుగుతూన్న రాముడు కనిపించాడు!

లోకకల్యాణం కోసం రాక్షసనిర్మూలన చేయవలసి ఉన్న రాముడికి వసిష్ఠుడు నేర్పిన శాస్త్రవిద్యలెందుకూ అక్కరకు రావు! అందుకు అద్భుతమైన అస్త్ర, శస్త్రవిద్య, ధనుర్విద్యా పాటవంకావాలి! వాటిని అందించగల గురువు అతనికిప్పుడు కావాలి! రాముడికి అస్త్రాలు ఉపదేశించగల సమర్థుడు విశ్వామిత్రుడు ఒక్కడే!

విశ్వామిత్రుడికి ధ్యానసమాధిలో లక్ష్మీదేవి సీతగా జనకుని కూతురుగా పెరుగుతున్నది కూడా కనిపించింది. సీతారాముల కల్యాణం కూడా త్వరలో జరగాలి.

రాముడి వల్లనే తన యాగరక్షణ కూడా జరగాలి! తనకు తెలిసిన అస్త్రవిద్య నంతా రాముడికి ఉపదేశించి, ఆయన్ను అస్త్రవిద్యాకోవిదుణ్ణిగా చేయవలసిన బాధ్యత తనదిగా గుర్తించి విశ్వామిత్రుడు అయోధ్యకు బయల్దేరాడు.



# వ్యాపారంలో పోటీ

శేషయ్య, భూషయ్యలు ఆ ఊరిలో ప్రముఖ వ్యాపారస్థులు. ఇద్దరి మధ్య గట్టిపోటీవుండేది.

ఒక రోజు, ఒక యువకుడు భూషయ్య వద్దకు వచ్చాడు. పద్దులు రాసుకుంటున్న భూషయ్య కొద్దిసేపటి తర్వాత తల ఎత్తి, ఎవరన్నట్టు అతడికేసి చూశాడు.

''అయ్యా! నా పేరు తిరుపతి. శేషయ్యగారి వద్ద గుమాస్తాగా పనిచేసేవాణ్ణి. అక్కడ జీతం సరిపోక పనిమానేశాను. మీ దగ్గర ఖాళీవుంటే చేస్తాను,'' అన్నాడు.

భూషయ్య క్షణం ఆలోచించి, ''ఇక్కడ కొంత కాలం పని చేశాక, మళ్ళీ జీతం పెంచమని అడగవని నమ్మకం ఏమిటి?'' అన్నాడు. ''జీతం సరిపోదనిపిస్తే, అప్పుడు పెంచమని అడగడంలో తప్పులేదు కదండీ,'' అన్నాడు తిరుపతి.

''నిన్ను పనిలోకి తీసుకుంటే, నాకు ప్రత్యేకంగా ఏమైనా లాభంవుందా?'' అని అడిగాడు భూషయ్య. ''అంటే .... మీరనేది నాకర్థంకాలేదండి!'' అన్నాడు తిరుపతి వినయంగా.

''అదే .... అక్కడ వ్యాపారానికి సంబంధించి ఎలా నడుస్తోందీ వగైరా విషయాలు నాకు చెప్పగలవా?'' అని అడిగాడు భూషయ్య.

''అది కుదరదండి. ఎందుకంటే, అక్కడి రహస్యాలు మీకు చెబితే, మీరు నన్ను పనిలోకి తీసుకోరు,'' అన్నాడు తిరుపతి. ''ఎందుకనీ?'' అంటూ భూషయ్య కాస్త మాటసాగదీశాడు.

''ఇక్కడి విషయాలు మళ్ళీ అక్కడ చెప్పవని నమ్మకం ఏమిటి? అని అడుగుతారు,'' అన్నాడు తిరుపతి.

ఆ జవాబు వింటూనే భూషయ్య పెద్దగా నవ్వి, ''తిరుపతీ! నీ జవాబు నీ తెలివి తేటల్నే కాదు, నిజాయితీని కూడా తెలియజేస్తున్నది. నాకూ ఆ శేషయ్యకూ వ్యాపారంలో పోటీయేగాని, గుమాస్తాల విషయంలో పోటీ లేదు. రా, రా, ఈ పద్దుపుస్తకం అందుకో, నిన్ను పనిలోకి తీసుకుంటున్నాను!'' అన్నాడు.

– కె. లక్ష్మీకాంతమ్మ



# ఏదుపంది-పొట్టితోక!

ఇదొక చెరూకీ కథ. ఇప్పటి జంతువులకన్నా పూర్వకాలం నాటి జంతువులు పెద్దవిగానూ, దృఢంగానూ, తెలివిగలవిగానూ ఉండేవని చెరూకీ జాతివాళ్ళు విశ్వసించేవారు. అవి మనుషులతో కలిసిమెలిసి తిరుగుతూ సరి సమానంగా ఉండేవని కూడా వాళ్ళు నమ్మేవారు.

ఆ కాలంనాటి ఒక ఏదుపందికి ఒకనాడు విపరీతంగా ఆకలి వేసింది. ఎవరైనా తన బొరియ లోకి ఇంత తిండి పడేస్తే ఎంత బావుణ్ణు! అన్న ఆశతో ఆలోచించసాగింది. కొంతసేపటికి దానికి కొన్నాళ్ళ క్రితం తాను మనుషులుంటున్న ఇంటి వైపుగా పరిగెత్తుతున్నప్పుడు వాళ్ళు చెప్పుకుం టూండగా తన చెవిని పడ్డ, 'కోరికలే గుర్రా లయితే, మూర్ఖులే వాటి మీద స్వారీ చేస్తారు' అనే సూక్తి గుర్తుకు వచ్చింది. అది చటుక్కున లేచింది. తన మూర్ఖత్వం కాకపోతే, ఎవరు పని కట్టుకుని తన బొరియలోకి ఆహారం తెచ్చి పెడతారు? తనే వెళ్ళి సంపాయించడం తప్ప మరో మార్గంలేదనుకున్నది. తను వెలుపలికి వెళ్ళక తప్పదు. అంటే సురక్షితమైన తన బొరి యను వదిలిపెట్టాలి. వెలుపల తనను వేటాడే జంతువుల కంటబడకుండా జాగ్రత్త పడాలి. లేకుంటే అవి, తనను పట్టి తినేయగలవు. మరుక్షణమే తనలోని భయాన్ని తలుచుకుని నవ్వుకున్నది. తను ఎన్నిసార్లు చావు నుంచి తప్పించుకోలేదు? అపాయం నుంచి తప్పిం చుకోవడానికి తనకు ఎన్నెన్ని ఉపాయాలు తెలుసు!

ఆ ఆలోచనతో ఏదుపందికి నూతనోత్సాహం పుట్టుకొచ్చింది. తను వుంటున్న పొడవాటి బొరియ చివరిదాకా పరిగెత్తింది. బొరియ అంచున, నేల సమతలంలో కొద్దిసేపు ఆగింది. కళ్ళు మాత్రం బయటకు కనిపించేలా తలను మెల్లగా వెలుపలికి పెట్టి చుట్టుపక్కల ఒక సారి జాగ్రత్తగా కలయచూసింది. అంతా ప్రశాంతంగా ఉంది. ఉత్సాహంగా అడుగు ముందుకు వేస్తూ వెలు పలికి వచ్చింది. చుట్టూ పెద్ద పెద్ద చెట్లు, పొదలు, ఏపుగా పెరిగిన పచ్చగడ్డి కనిపించాయి. ఏదు పంది ఆహారం కోసంవెతుకుతూ మెల్లగా నడవసాగింది. కొన్ని మొక్కల వద్ద ఆగి, ముందు



కాళ్ళతో గోతులు తీసి వాటి దుంపలను రుచి చూసింది. అందిన క్రిమికీటకాలనూ, పురుగులనూ, మట్టి పాములనూ పట్టి తింటూ, తన బొరియకు దూరంగా వెళ్ళిపోలేదు కదా అని మళ్ళీ మళ్ళీ బొరియకేసి తిరిగి చూడసాగింది. ఎందుకంటే దాని బొరియే దానికి ప్రాణాధారం. రక్షణా కవచం. ఏదైనా అపాయం అనిపిస్తే చాలు. అందులోకి జొరబడవచ్చు.



ఏదుపంది ఒక దుంపను తవ్వుతుండగా వేగంగా వస్తూన్న అడుగుల చప్పుడు వినిపించడంతో తలెత్తి చూసింది. అంతే! గడగడలాడిపోయింది. దాని చుట్టూ గిరిగీసినట్టు ఒక తోడేళ్ళగుంపు చుట్టుముట్టింది. ఒకటి దాని బొరియకు అడ్డుగా నిలబడింది. ఈ రోజుతో నాపని అయిపోతుందా అని ఏదుపంది ఒక క్షణం హడలి పోయింది. అయితే మరుక్షణమే ఆ ఆలోచనను చంపేసింది. ఏడుతోడేళ్ళు తనను ముక్కలు చేయడానికి తన మీదికి ఉరకడానికి ఆయత్తమవుతూండగా ఈ అపాయం నుంచి ఎలాగైనా బయటపడాలి అన్న నిర్ణయానికి వచ్చింది ఏదుపంది.

"మిత్రులారా! అభినందనలు! మీకు ఇవాళ విందు భోజనం లభించింది!" అన్నది ఏదుపంది సంతోషంగా నవ్వుతూ.

తోడేళ్ళకు విస్మయం కలిగింది. తమకు ఆహారం కానున్న సమయంలో ఇంత నిశ్చింతగా మాట్లాడిన జంతువును అవి ఎన్నడూ చూసి ఎరుగవు. అవన్నీ అలాగే అక్కడే నిలబడి తమ పెద్ద కేసి చూశాయి.

"కృతజ్ఞతలు!" అంటూ తోడేళ్ళగుంపు పెద్ద ఒక అడుగు ముందుకువేసి, "ఇక ఆగలేం. ఆలస్యం దేనికి? ఆకలి నమిలేస్తోంది," అన్నది.

"పరమకరుణతో మీకీ విందు సమకూర్చిన దేవుడికి కృతజ్ఞతలు చెప్పడానికి ఐదు నిమిషాలు ఆగలేరా? ఇంత మంచి విందు దొరికినప్పుడు, ఆరగించే ముందు వేడుక చేసుకోవాలి కదా? తోడేళ్ళు, అందునా నాగరికతగల తోడేళ్ళు తప్పక ఆ సంప్రదాయాన్ని పాటిస్తాయని విన్నానే," అన్నది ఏదుపంది తోడేళ్ళ పెద్ద కళ్ళకేసి ఆశ్చర్యంగా చూస్తూ.

"నువ్వు మమ్మల్ని అనాగరికులనుకున్నావా?" అని అడిగింది తోడేళ్ళపెద్ద ఏదుపంది కేసి కోపంగా చూస్తూ.

"ఎంతమాట! ఎంత మాట! నేనలా అన్నానా? భోజనం చేసే ముందు మీరు దేవుణ్ణి కీర్తిస్తూ పాటలు పాడుతూ నాట్యమాడతారన్న సంగతి నాకు తెలియనిదా?" అన్నది ఏదుపంది.

"మరి మాలో ఎవరికీ శ్రావ్యమైన కంఠస్వరం లేదే!" అన్నది తోడేలుపెద్ద.

"అదేం పెద్దసమస్యకాదు. నేను పాడతాను. మీరు ఆడండి," అంటూ ఏదుపంది నవ్వి, మళ్ళీ ఇలా అన్నది: "నేను మీలో ఒక్కొక్కరి కోసం ఒక్కొక్క పాట పాడతాను. నాకు చాలా పాటలు తెలుసు. నాకు తెలిసినవాటిలో చాలా



మంచి పాటలు ఏడింటిని ఎన్నుకుని మీ కోసం పాడతాను. ఒక్కొక్క పాటను ప్రారంభించేప్పుడు నేను ఒక్కొక్క చెట్టు బోదెకు అనుకుని పాడ తాను. మీరు చప్పట్లు కొడుతూ నాట్యం చేయండి. మొదట నేనొక చెట్టుకు అనుకుని పాట ప్రారంభిస్తాను. మీరు నా చుట్టూ చేరి నాట్యం చేయండి. పాట పూర్తికాగానే ఏ చెట్టుకు అనుకుంటే బావుంటుందో నిర్ణయించి నేను అక్కడికి వెళ్ళి కొత్తపాట ప్రారంభిస్తాను. మీరు వచ్చి నాట్యం చేయండి. ఇలా ఏడు పాటలు పూర్తి చేద్దాం. చివరి పాట దేవుణ్ణి కీర్తిస్తూ పాడ తాను. అవన్నీ అయ్యాక మీరు నన్ను హాయిగా భోంచేయవచ్చు. సరేనా?'' అన్నది ఏదుపంది.

తోడేళ్ళపెద్ద అంగీకరించింది. ఏదుపంది వెళ్ళి దాపులనున్న ఒకచెట్టు బోదెకు అనుకుని తోడేళ్ళ పెద్ద కేసి చూస్తూ, ''ఇది తమ గౌర వార్థం, పాడేపాట,'' అంటూ పాట పాడడం ప్రారంభించింది. తోడేళ్ళ పెద్ద ఆనందంతో గట్టిగా నవ్వింది. తోడేళ్ళు దాని చుట్టూ వృత్తాకారంలో నిలబడిగెంతుతూ నాట్యం చేయసాగాయి. అయితే, ఏదుపంది ఎట్టైనా వెళ్ళి పోగలదేమో నన్న అను మానంతో ఒక కంట కనిపెడుతూనే గెంతసాగాయి. అయినా ఏదుపంది మాత్రం పాట పూర్తయ్యే వరకు ఆ చెట్టుబోదెనుంచి ఒక్క అడుగు కూడా అటూ ఇటూ కదలలేదు.

పాట పూర్తయ్యాక ఏదుపంది వేరొక చెట్టు వద్దకు వెళ్ళి ఆ చెట్టుకు అనుకుని గొంతు సవరించుకుని మరొక పాట అందుకున్నది. తోడేళ్ళు చుట్టూచేరి నాట్యం చేయసాగాయి.

పాట పూర్తయింది. ఇప్పుడు తోడేళ్ళకు ఏదుపంది వీద ఉన్న అనుమానం కాస్త తగ్గింది. వేరొక చెట్టువద్దకు చేరాయి. ఏదుపంది వెళ్ళి ఆ చెట్టుకు అనుకుని తోడేళ్ళు నాట్యానికి సిద్ధం కాగానే పాట ప్రారంభించింది. ఎలాంటి భయం కనబరచలేదు. పారిపోవడానికి ప్రయ త్నించలేదు. అందువల్ల తోడేళ్ళ విశ్వాసం పొంద గలిగింది.

ఇలా ఆరు పాటలు పూర్తయ్యాయి. ఏడవ చెట్టు వద్దకు వెళ్ళాలి. అది తను నివసిస్తున్న బొరియకు సమీపంలో ఉండాలి. ఏదుపంది బొరియ ముఖద్వారాన్ని ఒక్కక్షణం చూసింది. తన పథకం గనక పారితే అందులోకి జొరబడి బతికి పోగలను అనుకున్నది. ఆ తరవాత తను వెళ్ళవలసిన చెట్టును చాలా జాగ్రత్తగా ఎంపిక చేసింది.

ఆ తరవాత తోడేళ్ళపెద్దతో, ''దేవుణ్ణి కీర్తిస్తూ పాడవలసిన ఒకే ఒక పాట మాత్రమే ఉంది,''

అన్నది. అంతలో మిగిలిన తోడేళ్ళన్నీ అక్కడికి వచ్చాయి. ఏదుపంది వెళ్ళి తను ఎంపిక చేసిన చెట్టుబోదెకు ఆనుకున్నది.

"పాట పూర్తికాగానే మేము నిన్ను తినేయ గలం!" అన్నది తోడేళ్ళపెద్ద.

"నిక్షేపంగా! అది మనం మొదటే అనుకున్నదే కదా?" అన్నది ఏదుపంది సంతోషంగా.

"నీ ధైర్యం ఎంతో మెచ్చతగింది. మాకే గనక ఆకలి లేకుంటే నిన్ను వదిలిపెట్టేవాళ్ళమే. అయితే, ..." అంటూ తోడేళ్ళపెద్ద పళ్ళికిలించింది.

"దాన్ని గురించి మరిచిపొండి. మనం ఒక ఒప్పందానికి వచ్చాం. ఒప్పందం ఒప్పందమే కదా! దానిని తప్పక అమలు చేయాల్సిందే. ఏదో పాట పూర్తికాగానే, మీరు నన్ను తినేయవచ్చు," అంటూ ఆనందంగా రాగం తీస్తూ, ఏడుపాటకు సిద్ధంకండి. చివరినాట్యం," అన్నది.

"అలాగే," అన్నవి తోడేళ్ళు ఎంతో ఆనందంగా.

ఏదుపంది పాట ప్రారంభించింది. తోడేళ్ళు ఉత్సాహంగా నాట్యం చేస్తూ, దానికి కాస్త దూరంగా వెళ్ళాయి. పాట ఉచ్ఛస్థాయిలో సాగుతోంది. వేగం పుంజుకుంది. పాటకు తగ్గట్టు తోడేళ్ళు చెట్టు చుట్టూ వేగంగా గెంత సాగాయి. హఠాత్తుగా పాట ఆగింది. 'నేను సిద్ధం' అంటూ ఏదుపంది అరిచింది. తోడేళ్ళు ఆట ఆపి, నాలుగు కాళ్ళ మీద స్థిమితంగా నిలబడ్డాయి. ఆ సమయంకోసమే ఎదురు చూస్తున్న ఏదుపంది చటుక్కున వెళ్ళి మెరుపు వేగంతో కన్నంలోకి జొరబడింది. తోడేళ్ళు జరిగిందేమిటో గ్రహించే లోపలే ఏదుపంది శరీరమంతా బొరియలోకి వెళ్ళింది. దాని తోక మాత్రం బయట కనిపిస్తోంది. తోడేళ్ళ పెద్ద ఒక్కగెంతున వెళ్ళి దాని తోక కొసను పళ్ళతో పట్టుకున్నది. తోకను తెగకొరికి ఉండేదే. అయినా తోకను పట్టుకుని ఏదుపందిని మొత్తంగా వెలుపలికి లాగాలని ప్రయత్నించింది. గట్టిగా లాగింది. అయితే ఏదుపంది తన దృఢమైన గోళ్ళతో కన్నం గోడలను గట్టిగా పట్టుకుంది. ఈ రెంటి మధ్య పోరాటం కొంతసేపు సాగింది. ఆఖరికి తోడేలు తన శక్తినంతా ఉపయోగించి దాని తోకను బలంగా గుంజింది. అంతే, తోక కొస తెగి పోయింది. తోడేలు వెనక్కు వెల్లకిలా పడింది. ఆ ఊపుకు రెండు పొర్లు పొర్లింది. ఆ తరవాత మామూలు స్థితికి వచ్చి చేతిలోని తోకకొసను చూస్తూ, "ఆ ఏదుపంది మనల్ని మోసం చేసింది!" అన్నది. "దాని మాయ మాటలకు మనం మోసపోయాం!" అన్నవి మిగిలిన తోడేళ్ళు.

ఏదుపంది కన్నంలో మరింత లోపలికి వెళ్ళింది. అది కాస్త స్థిమిత పడ్డాక తన తోకకేసి చూసుకుంది. కాస్త పొట్టిగా కనిపించింది. అయినా ఇదీ బాగానే ఉంది అనుకున్నది. ఎలాగో బతికిపోయాం అదేచాలు, అనుకుంటూ చాలా ఆనందించింది.

అప్పటినుంచే ఏదుపందికి పొట్టి తోక ఏర్పడింది!





# నల్లపిచ్చుక

మాళవిక రాజ్యంలోని అభయారణ్యంలో, ఒక అందమైన చిన్న పూరిపాక వుండేది. అందులో వీరభట్టు అనే వృద్ధుడూ, ఆయన మనుమరాలు చంద్రహాసా నివసిస్తూండేవాళ్ళు. చంద్రహాసకు పదహారేళ్ళ వయసు. అంద చందాల్లో ఏ రాకుమార్తో అనిపించేది. ఆ అమ్మాయికి ఊహ తెలిసినప్పటినుంచే, ఆ తాతా మనవరాళ్ళ నివాసం ఆ అరణ్యమే. ఆమెకు ఆ చుట్టుపక్కలవున్న అరణ్య ప్రాంతమంతా బాగా తెలుసు. ఆ అరణ్యంలో జంతువులూ, పక్షులూ ఆమెకు స్నేహితులు.

చంద్రహాసకు, తాత వీరభట్టు ప్రాణం. ఆమె తరచూ, "తాతా! మనం ఈ అరణ్యంలో ఎందుకుంటున్నాం?" అని అడిగేది. అందుక్కారణం వీరభట్టు ఎన్నిసార్లు చెప్పినా, చంద్రహాస మళ్ళీమళ్ళీ చెప్పించుకుని వినేది.

గతంలో వీరభట్టు, మాళవికరాజ్యం రాజు ధీరసింహుడి వద్ద రథికుడుగా పనిచేసేవాడు. ఒకపర్యాయం ధీరసింహుడికి, పొరుగు రాజు చిత్రవర్ణుడికి మధ్య యుద్ధం జరిగింది. ఆ యుద్ధ సమయాన ధీరసింహుడున్న రథాన్ని వీరభట్టు నడిపిస్తున్నాడు. పోరు ముమ్మరంగా సాగుతున్న తరుణంలో చిత్రవర్ణుడు విసిరిన ఈటె వచ్చి ధీరసింహుణ్ణి తాకి గాయపరిచింది. ఆ తర్వాత యుద్ధంలో విజయం ధీరసింహుడు సాధించినా, తనకు గాయం కావడానికి వీరభట్టు అజాగ్రత్తే కారణం అని భావించి, అతడికి నగరబహిష్కారం విధించాడు.

అప్పటి నుంచి వీరభట్టు, తల్లిదండ్రులు లేని చంద్రహాసతో, అరణ్యంలో కాపురం వుండసాగాడు. ఒకరోజు చంద్రహాస ఊయల ఊగుతూండగా, ఆమెదృష్టి ఒక నల్లపిచ్చుక మీద పడింది. అది ఒక పొదదగ్గర ఎగరలేక రెక్కలల్లాడిస్తూ పడివున్నది, చంద్రహాస, దాని దగ్గరకు వెళ్ళి చేతుల్లోకి తీసుకున్నది. పిచ్చుక రెక్కల్లో గాయమైవున్నది.

చంద్రహాస, నల్లపిచ్చుక గాయానికి మందు పూసి, అది తినడానికి గింజలు, తాగడానికి నీరు ఇచ్చింది. మర్నాటి కల్లా, ఆమె సపర్యల వల్ల సేదదీరిన నల్లపిచ్చుక, ఆమె వంక

ఎస్. శివనాగేశ్వరరావు

కృతజ్ఞతగా చూడసాగింది. కొద్ది రోజులకు నల్లపిచ్చుక గాయం పూర్తిగా నయమైంది. త్వరలోనే పిచ్చుకా, చంద్రహాసా విడదీయ రాని స్నేహితులయ్యారు.

ఒకరోజు మహారాజు ధీరసింహుడు కొంత మంది సైనికులతో, చంద్రహాసవున్న పాక దగ్గరకు వచ్చాడు. ఆ సమయంలో వీరభట్టు దాపుల ప్రవహిస్తున్న నది దగ్గరకు వెళ్ళాడు. ధీరసింహుడు, చంద్రహాసను, "ఏం, అమ్మాయీ! నీకీ అరణ్యప్రాంతమంతా బాగా తెలుసా?" అని అడిగాడు.

చంద్రహాస, "తెలుసు, మహారాజా!" అన్నది వినయంగా.

"నేను రాజు ధీరసింహుణ్ణి. కొద్ది రోజుల క్రితం నా ఏకైక పుత్రుడు జయసింహుడు, ఈ ప్రాంతాలకు వేటకై వచ్చాడు. ఆ సమయంలో, ఒక చెట్టుకింద తపస్సు చేసుకుంటున్న మునిని చూసి, నా పుత్రుడివెంట వున్న భటుల్లో ఒక పొగరుబోతు, జడలు కట్టివున్న మునిశిరస్సుపై, అక్కడ చచ్చి పడివున్న ఒక నల్లపిచ్చుకను తీసి వుంచాడు. ఆగ్రహంతో కళ్ళు తెరిచిన మునికి, సమయానికి నా పుత్రుడు కనిపించాడు. అది అతడి దుశ్చర్యగా భావించిన ముని, తన మంత్రశక్తితో రాజకుమారుణ్ణి నల్లపిచ్చుకగా మార్చేశాడు. సైనికుల ద్వారా, ఈ విషాద వార్తవిన్న నేను, నల్లపిచ్చుకను వెదకడం కోసం, ఈ అరణ్యానికి వచ్చాను," అన్నాడు రాజు.

అప్పుడు చంద్రహాస, "ప్రభూ! నేనా నల్లపిచ్చుకను చూడడమే కాదు, గాయపడి ఎగరలేని స్థితిలోవున్న దాన్ని కాపాడాను కూడా.



అది ఈ దాపుల చెట్లలోనేవున్నది," అంటూ చిన్నగా చప్పట్లు కొట్టింది. ఆ మరక్షణం నల్ల పిచ్చుక ఎగురుతూ వచ్చి, చంద్రహాస భుజం మీద వాలింది. ఆ నల్లపిచ్చుకను చూసిన రాజు, తన కుమారుడు తిరిగి దక్కినంతగా సంతోషపడ్డాడు. "ప్రభూ! రాకుమారుడికి నిజరూపం ఎలా వస్తుందో తెలియడం లేదు," అన్నది చంద్రహాస.

"నేను, ఆ శపించిన మునిని దర్శించి, ఆయనకు జరిగిన అవమానానికి రాజకుమారుడు కారణం కాదనీ, ఒక భటుడనీ చెప్పి, వాస్తవం వివరించాను. అప్పుడు అకారణంగా శిక్షకు గురైన రాకుమారుడిపై జాలి పడిన ముని, నాకు మంత్రజలంయిచ్చి - అకారణంగా శిక్షకు గురైన వ్యక్తి, దీన్ని ఆ నల్లపిచ్చుక మీద చల్లితే, తిరిగి అతడికి నిజస్వరూపం వస్తుందని, చెప్పాడు," అన్నాడు రాజు.

రాజు ఇలా చెప్పగానే చంద్రహాస ఆనందంగా, "ప్రభూ! సమస్య పరిష్కారమై పోయినట్టే!" అన్నది.

ఆ జవాబు అర్థంకాని రాజు, ఆత్రుతగా, "ఏవిధంగా?" అంటూ ప్రశ్నించాడు.

"ప్రభూ! నేను, లోగడ తమ వద్ద రథికుడిగా పనిచేసిన వీరభట్టు మనమరాలిని. నా పేరు చంద్రహాస. యుద్ధంలో శత్రురాజు విసిరిన ఈటె వల్ల తమరు గాయపడినప్పుడు, ఆ కోపంలో అందుకు కారణం ఏమైవుంటుందో ఆలోచించకుండా, మా తాతకు నగర బహిష్కార శిక్ష విధించారు. అయితే, దేశం పట్లా, మీ పట్లావున్న అచంచల భక్తి కారణంగా, ఆయన ఉద్యోగసంపాదనకు మరొక రాజ్యానికివెళ్ళక, ఇక్కడే అరణ్యంలో కాపురం వుంటున్నాడు. అకారణంగా శిక్షకు గురైన తాత చేత, ఆ మంత్రజలం నల్లపిచ్చుక మీద చల్లించండి," అన్నది.

అప్పుడే నది నుంచి తిరిగివచ్చిన వీరభట్టు, రాజుకు సాష్టాంగ నమస్కారం చేసి, సంగతి తెలుసుకుని, మంత్రజలాన్ని నల్లపిచ్చుక మీద చల్లాడు. ఆ మరుక్షణం అక్కడ నల్ల పిచ్చుక మాయమై, రాకుమారుడు జయసింహుడు ప్రత్యక్షమయ్యాడు. ఇది చూసి పరమానందభరితుడైన రాజు ధీరసింహుడు, "వీరభట్టూ! ఆనాడు నీకు అకారణంగా నగర బహిష్కరణ విధించినందుకు విచారిస్తున్నాను," అన్నాడు.

అందుకు వీరభట్టు వినయంగా, "ప్రభూ! ఆనాడు తమరు నాకు విధించిన శిక్ష, ఈనాడు యువరాజుకు వరమైంది. ఇందుకు సంతోషిస్తున్నానే కాని, నన్ను శిక్షించినందుకు బాధ చెందడం లేదు," అన్నాడు.

జయసింహుడు, తండ్రికి నల్లపిచ్చుకగా తను వున్నప్పుడు చంద్రహాస తనను ఎంత ఆప్యాయంగా చూసిందో చెప్పి, "మీరూ, తాత వీరభట్టూ అనుమతిస్తే, ఆమెను వివాహమాడదలిచాను," అన్నాడు.

"మా ఇద్దరి అనుమతి మాట సరే! రాకుమారి చంద్రహాస అనుమతి మాటేమిటి?" అంటూ రాజు చిన్నగా నవ్వాడు.

చంద్రహాస సిగ్గుతో తలవంచుకుని, తాత వీరభట్టు చాటుకుపోయి నిలబడింది.

ఆ తర్వాత నెల తిరక్కుండానే, యువరాజు జయసింహుడితో, చంద్రహాస వివాహం మహావైభవంగా జరిగిపోయింది.



16

# ఆర్య

అజ్ఞాత యువరాజు విచిత్ర సాహస గాథ

చిత్రాలు: గాంధి అయ్య

యువరాజు, జయానందముని ఆశ్రమంలో పెరుగుతున్నాడన్న సంగతి జయంతుడికి చెప్పి, రాజు ప్రాణం విడిచాడు. జయానంద ముని శిష్యులు వచ్చి రాజుగారి భౌతిక కాయాన్ని తీసుకువెళ్ళి, రాణిగారి సమాధి పక్కనే భూస్థాపితం చేశారు. జయంతుడు పసివాడైన యువరాజును చూశాడు.

జయానందుడు, వసంతుడు ఆశ్రమానికి తిరిగివచ్చారు.

రాజుగారి మరణం మరెవ్వరికీ తెలియనవసరం లేదు.

మా ఉద్యమానికి ఆయన వెన్నుదన్నుగా నిలిచారు.

మహామంత్రి మానవేంద్రుణ్ణే కలుసుకుంటే మీ తదుపరి కర్తవ్యం గురించి సలహా ఇవ్వగలడు.

ఆయన అమ్మ తపురిలో ఉన్నారు.

యువరాజుకు ఆర్య అని నామకరణం చేశాను.

యువరాజా! నా నమస్కారాన్ని స్వీకరించు!

నన్ను యువరాజా అని పిలవకం. నేను నీ స్నేహితుణ్ణే!

మహామునీ! ఇప్పుడు నా అనుచరుల కర్తవ్యమేమిటి?

కొంతకాలంపాటు నీ తిరుగుబాటు ఉద్యమాన్ని ఆపాలి. ఆర్య ఇక్కడే పెరిగి పెద్దవాడు కానీ. రాజ్యంలో జరిగే విశేషాలను అప్పుడప్పుడు అతనికి తెలియజేస్తూ ఉండు.







అక్కడ నగరంలో వసంతుడి అనుచరులు - వీరసింహుడి సైనికులు ప్రజల నుంచి ధాన్యాన్ని కొల్లగొట్టాలన్న ప్రయత్నాలను అడ్డుకోసాగారు.






















ఆర్యా! నీ ప్రాణం మాకు అమూల్యం!
నువ్వు తరచూ వస్తూండాలి!


వసంతుడు ప్రజలకోసం ఎంతో పాటుపడుతున్నాడు. త్వరలో నువ్వు వాళ్ళ నాయకుడివి కావాలి!
ఇప్పుడే వాళ్ళతో కలిస్తే బావుంటుం దనిపిస్తోంది.


ఆర్య విలువిద్య వంటి యుద్ధవిద్యలు అభ్యసిస్తూ పెరగసాగాడు. ఆశ్రమంలోని శిష్యులు ఆయన అవసరాలు సమకూరుస్తూ కంటికి రెప్పలా కాపాడసాగారు.


అక్కడ రాజధానీ నగరంలో వీరసింహుడు, నూతన సేనాధిపతితో సమావేశమయ్యాడు.
తిరుగుబాటుదార్లు ఇప్పుడు ఎక్కడుంటున్నారు?
వాళ్ళు తమ స్థావరాలను రోజూ మార్చుకుంటున్నారు ప్రభూ!


పర్వత ప్రదేశాలలోని గుహాలన్నిటినీ వెతికాం. నిర్మానుష్యంగా ఉన్నాయి.
అంటే, రాజ్యాన్నే వదిలి వెళ్ళిపోయారా? అయినా వాళ్ళు ఎక్కడికి వెళ్ళగలరు?


అడవులన్నీ వెతికించావా?
ప్రభూ! అడవుల్లో రహస్య స్థావరాలు ఉండడానికి అవకాశం లేదు కదా?


అయినా, వాటిని కూడా నిర్లక్ష్యం చేయకూడదు. మన సైనికుల చేత అడవిని గాలిస్తాను.
నేనే స్వయంగా సైనికులను నడిపిస్తాను. వెంటనే వేటకు ఏర్పాట్లు చేయించు!


వీరసింహుడు సైనికులతో కలిసి వేటకు బయలుదేరాడు. అడవిని సమీపించగానే, జంతువులను హడలగొట్టడానికి డప్పులు మోగించారు.


ఆర్యా, ఈ రోజు ఆశ్రమం వదిలి వెళ్ళకు!


బాఘా, బాఘు, ఆశ్రమాన్ని జాగ్రత్తగా సంరక్షించండి!


భల్లూకి ఆర్య కోసం ఎదురు చూస్తూ వెలుపలే ఉండిపోయింది.


సైనికులు విసిరిన వలలో భల్లూకి చిక్కుకున్నది. సైనికులు పరమానందం చెందారు.


ఆగండి!
ఎవరు? ఎందుకు ఆగాలి?
-(ఇంకావుంది)

# పచ్చని ప్రపంచం!

వీణ సెలవుల్లో తాతయ్యగారి ఊరువెళ్ళింది. చుట్టూ పచ్చని పొలాలూ, తోటలూ గల అందమైన గ్రామం అది. పెరటిలోని మామిడి చెట్టు, చల్లటి నీడలో కూర్చుని చదవడం వీణకు మధురానుభూతిని కలిగించింది. పక్షుల కిలకిలారావాలు. వింత వింత శబ్దాలు చేస్తూ కొమ్మకొమ్మకూ ఎగిరే ఉడత పిల్లలను చూస్తూ మైమరిచి పోయింది వీణ.



"మా ఊరు బావుందా? ఇక్కడి వాతావరణం నీకు నచ్చిందా?" అని అడిగాడు తాతయ్య.

"చాలా బావుంది, తాతయ్యా. తోటలో ఆడుకోవడం అంటే మరీ బావుంది. ఇన్ని చెట్లను ఒకే చోట ఇంతకు ముందు నేనెప్పుడూ చూడలేదు," అన్నది వీణ ఆనందంగా.

"చెట్లు మనుషుల ప్రియనేస్తాలు. అయితే, మనం, ఆ సంగతి గుర్తించడం లేదు. అదే విచారకరమైన విషయం!" అన్నాడు తాతయ్య.

"ఎందుకలా అంటున్నారు తాతయ్యా?" అని అడిగింది వీణ.

"చెట్లు మనకు పళ్ళనిస్తున్నాయి. కలపతో ఇంటికి కావలసిన సామానులు తయారు చేసుకుంటాం. ఆకులు జంతువులకు మేతగా పనికివస్తుంది. కట్టెలు వంటచెరుకుగా ఉపయోగపడుతున్నాయి. చెట్టులో ప్రతి భాగమూ ఉపయోగపడుతున్నది కదా?" అన్నాడు తాతయ్య.

"అవును. నిజమే. దీన్ని గురించి నేనెప్పుడూ ఆలోచించనే లేదు." అన్నది వీణ ఆశ్చర్యంగా.

మనపరిసరాలు పచ్చగా, పరిశుభ్రంగా అందంగా ఉంచడానికి నువ్వూ సాయపడవచ్చు." అంటూ అక్కడికి వచ్చింది బామ్మ.

"ఏం చేయమంటావో చెప్పు, బామ్మా" అని అడిగింది వీణ.

"మన పెరటి తోటలో ఎన్నెన్ని రకాల చెట్లున్నాయో చూశావు కదా? అవన్నీ నేనూ, మీ తాతయ్యా వివిధ సందర్భాల్లో నాటి పెంచినవే. మీ అమ్మ పుట్టినప్పుడే ఈ మామిడి చెట్టు నాటాము. నువ్వు పుట్టినప్పుడు ఈ అత్తిచెట్టు నాటాము. ఇక్కడున్న ఒక్కొక్క చెట్టు వెనకా ఒక్కొక్క చరిత్ర ఉంది," అన్నది బామ్మ గొప్పగా.

"చాలా మంచిమాట చెప్పావు. నేనూ, ఏలాగే మొక్కలు నాటి పెంచుతాను బామ్మా," అన్నది వీణ సంతోషంగా.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## విజ్ఞాన వీచికలు :

### ఫౌంటన్ పెన్నులు



ఒకానొకప్పుడు తాళపత్రాల మీద, రాగి రేకుల మీద ఘంటాలతో రాసేవారు. బొగ్గు, సుద్ద ముక్కలు, పక్షి ఈకలు కూడా కొన్ని కాల ఘట్టాలలో రాతపరికరాలుగా ఉండేవని మన అందరికీ తెలుసు. ఈజిప్టులో మొట్టమొదట పెన్నును రూపొందించారు. అయితే అప్పుడు రాసేవాళ్ళు పెన్ను నిబ్బును మాటిమాటికీ సిరాలో అద్ది మరీ రాయవలసివచ్చేది.

ఈ పద్ధతి పట్ల లూయిస్ వాటర్‌మన్ అనే ఒక ఇన్సూరెన్సు బ్రోకర్‌కు విసుగు పుట్టింది. నిబ్బుకు సిరాను నిరంతరాయంగా సరఫరా చేసే విధానాన్ని రూపొందించలేమా అని తీవ్రంగా ఆలోచించాడు.

ఆయన సైన్సుకు సంబంధించిన వ్యక్తి కాదు. అయినా, సన్నటి రంధ్రం గుండా పెన్ను బాడీనుంచి నిబ్బుకు ఇంకును సరఫరా చేసే పద్ధతిని రూపొందించాడు. అదే ఫౌంటన్ పెన్ అయింది. 1884వ సం.లో దీనిని ఆయన పేటెంట్ చేశాడు.

## మన పరిసరాలు :

### దుమ్ములగొండి

పిల్లి మ్యావ్ మ్యావ్ అంటుంది. కుక్క భౌభౌ అని మొరుగుతుంది. పిల్లీ, కుక్కా కలిసినట్టున్న దుమ్ములగొండి ఏం చేస్తుందో తెలుసా? వింతగా నవ్వుతుంది! దూరం నుంచి ఈ వింత జంతువు పుట్టించే శబ్దం అలా వుంటుంది.

దీనికాళ్ళు కుక్క కాళ్ళలా వుంటాయి; మిగిలిన శరీర భాగాలు పిల్లికి ఉన్నట్టు ఉంటాయి. తల కాస్త పెద్దదిగా ఉంటుంది. అయితే, శరీరమంతటినీ చూస్తే మృదువైన పిల్లిలాగా కానీ, దృఢమైన కుక్కలాగా కాని కనిపించదు. నిక్కబొడుచుకున్న చెవులతో తల కాస్త పెద్దదిగా ఉంటుంది. వెనక కాళ్ళు పొట్టిగా, లావుగా ఉండడం వల్ల శరీరం వెనక్కు వాలినట్టు ఉంటుంది. దాదాపు 150 సెం.మీ. పొడవున్న ఈ జంతువు 90 సెం.మీ. ఎత్తు ఉంటుంది.

దుమ్ములగొండి అసలు వేటాడదు. ఇతర జంతువులు వేటాడి, తిని వదిలిపెట్టిన జంతు కళేబరాలను పీక్కు తిని తృప్తి చెందుతుంది. ఈ అలవాటు వల్లే దీనికి 'జంతు ప్రపంచపు పాకీదారు' అనే పేరు వచ్చింది.



# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## మీకు తెలుసా?

### కుక్కలు ఎందుకు ఎక్కువ విశ్వాసం చూపుతాయి?



కుక్కలు పెంపుడు జంతువులు అయినప్పటి నుంచి మనిషి పట్ల అమిత విశ్వాసం కనబరుస్తూ మనిషికి మంచి నేస్తాలుగా ఉంటున్నాయి. పిల్లులకు అలాంటి విశ్వాసం ఉండదు. కుక్కలు, గుంపులు గుంపులుగా నివసించే తోడేళ్ళ జాతికి సంబంధించినవి. బతుకు భయం కారణంగానే అవి ఒకదానితో ఒకటి కలిసి గుంపులుగా నివసిస్తాయి. అంతే కాదు. ఒక్కొక్క గుంపు ఒక్కొక్క నాయకుడికి లోబడి ఉంటాయి. కుక్కలు అలాంటి తోడేళ్ళ సంతతికి చెందినవి కావడం వల్ల, సహజంగానే ఇంటి యజమానిని తమ యజమానిగా భావించి అమిత విశ్వాసం కనబరుస్తాయి. పిల్లులు ఒంటరిగా వేటాడి తమ ఆహారాన్ని సంపాయిస్తాయి. అందుకు అవి వుండే ఇంటి పరిసరాలు వాటికి క్షుణ్ణంగా తెలిసి వుండాలి. అందువల్ల పిల్లులు ఇంటి పట్ల చూపే ఆసక్తిని ఇంటి యజమానుల పట్ల చూపవు!

## లోకజ్ఞానం

### అక్టోబర్ పండుగల నెల; అందుకే పండుగల గురించి ఒక క్విజ్



1. తీజ్ ఏ రాష్ట్రంలో జరుపుకుంటారు?
ఎ) అస్సాం బి) జార్ఖండ్
సి) రాజస్థాన్ డి) మిజోరం



2. కేరళ రాష్ట్రంలో జరుపుకునే 'ఓణం' పండుగకు విష్ణువు ఎత్తిన ఏ అవతారంతో సంబంధం ఉంది?
ఎ) వామన బి) పరశురామ
సి) కృష్ణ డి) నరసింహ



3. కార్తీక పూర్ణిమ రోజున ఎవరి జన్మదినోత్సవం జరుపుకుంటారు?
ఎ) మహావీరుడు
బి) బుద్ధుడు
సి) గురునానక్ డి) జొరాష్టర్



4. మైసూరు ఏ ఉత్సవాలకు ప్రసిద్ధిగాంచింది?
ఎ) దుర్గా పూజ బి) దసరా
సి) కుంభమేళా డి) సంక్రాంతి

(సమాధానాలు 66వ పేజీలో)

# ఫోటో వ్యాఖ్యల పోటీ



ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని,
చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా?
రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



SOURAA



NARAYANAMURTHY TATA

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్టుకార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు డిసెంబర్ 2004 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.



అభినందనలు

ఆగస్ట్ నెల పోటీ ఫలితాలు

పి. రామకృష్ణ చైతన్య
S/o. పి.ఎస్. బాబు
కిడ్స్ రెడీమేడ్స్, 9-7-59, కమానీబజార్,
ఖమ్మం- 507 001 (ఆం. ప్ర.)





మొదటి ఫొటో : తల్లిప్రేమకు బరువు తెలియదు!
రెండవ ఫొటో : చేయిజారితే బొమ్మ మిగలదు!!

సమాధానాలు

1. సి) రాజస్థాన్
2. ఎ) వామన
3. సి) గురునానక్
4. బి) దసరా

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : B. Viswanatha Reddi (Viswam)

